

పరుగెత్తి పాలుత్రాగే కంటే...

ఫొటో—శ్రీ కె. వి రామచంద్రమూర్తి
(ద్రాక్షారామ)



సంవత్సర చందా
రు. 12-0-0
విడిపత్రిక 4 అ.



# ఆంధ్రపత్రిక

సంపుటము 45
సంచిక 38
20-5-53

సచిత్రవారపత్రిక

Founder : K. NAGESWARA RAO

విజయ వైశాఖ శుద్ధ సప్తమి; బుధవారం

దూర తీరం

ఆర్. వి. చిన్నారావుగారు (దుగ్గుదుర్రు) నీటిరంగులతో చిత్రించిన చిత్రం.

# విషయానుక్రమణిక



## సవరణ

18-5-58 తేదీ ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రికలో లోవైపు కవరుపేజీలో "సూర్యప్రియ" ఫోటో తీసినది హరిసత్యం గారనీ, "చంద్రప్రియ" ఫోటో తీసినది తుమ్మలపల్లి సత్యనారాయణ మూర్తిగారనీ గమనించ ప్రార్థన.




నలువ కులాలుభంగి
　　నలిన ప్రభవాండమునందు దేనిచే
నిలిచె? దశావతారవన
　　నిష్ఠితుడయ్యె మురారి దేనిచే?
వెలుచ గపాల హస్తుడయి
　　భిక్షుకుడయ్యె బురారి దేనిచే?
నల రవి దేనిచే దిరుగు?
　　నా ఘనకర్మము వంద్యమేకదా.

తా॥ గుండ్రముగా నుండి కుమ్మరివాని సారెమీద తిరుగుచున్న కుండవలె నున్న బ్రహ్మాండమధ్యమున కుమ్మరివాని వలె స్థిరముగా నున్నటువంటి బ్రహ్మ దేని మూలంగా ఆ పనికి నియమింపబడి యున్నాడో, విష్ణుమూర్తి పది యవతారము లెత్తవలసినదిగా నియమింపబడి, యీ అవతారములలోని అనేక అవస్థలనొంది మహారణ్యమునందు దేనిమూలంగా చిక్కుబడిన వాడయ్యెనో, శివుడు పుర్రెను పాత్రగా చేతితో పట్టుకొని బిచ్చగాడై దేనిమూలంగా దిరుగవలసివచ్చెనో, సూర్యుడు ఆకాశమున దేని ప్రభావముచేతను దేని ప్రేరేపణచేతను తిరుగుచున్నాడో, అటువంటి గొప్ప కర్మసూత్రము నమస్కరింపదగినది.

"తస్మై నమః కర్మణే"

ఆ కర్మమునకు నమస్కారము.

బ్రహ్మదేవునకు కాదు మన నమస్కారము. విష్ణుమూర్తికి కాదు మన నమస్కారము. శివునకు కాదు మన నమస్కారము. సూర్యునకు కాదు మన నమస్కారము. సూర్యుడు ఏ కర్మసూత్రమునకు బద్ధుడై గతి తప్పకుండా తిరుగుతున్నాడో ఆ కర్మసూత్రమునకు నమస్కరిస్తానన్నాడు. ఈ సృష్టిలోని జీవరాసులను, గ్రహగోళములను సృష్టి చేయడం అనే పనికి ఏ కర్మసూత్రమువల్ల బ్రహ్మదేవుడు నియమింపబడియున్నాడో ఆకర్మసూత్రమునకు నమస్కారము. లోకంలో ధర్మము నశించి అధర్మము ప్రబలినప్పుడు శిష్ట రక్షణార్థమున్నూ దుష్టశిక్షణార్థమున్నూ శ్రీ మహావిష్ణువు యీ భూలోకంలో అవతరిస్తూ ఉండి అనేక అవస్థలు పడుతూఉండవలెనని ఏ నిబంధన ప్రకారముగా నిర్ణయింపబడెనో, ఆ కర్మనిబంధనకు నమస్కారము. ఈ జగత్తులో బ్రహ్మ సృష్టి చేసిన దానిని లయం చేస్తూ పాంచ భౌతికమైన దానిని అంతా భస్మంచేస్తూ, క్రమ వికాసం కలుగజేస్తూ, పృథివీతత్వంలోనుంచి తేజోరూపంలోనికిన్నీ, జడములోనుంచీ చేపలు కప్పలలోనుంచీ, కోతులలోనుంచీ అడవి మనుష్యులలోనుంచీ మానవజాతుల రూపంలోనికిన్నీ క్రమ పరిణామ వికాసం పొందించి ఈమానవజాతిలో తిరిగీ ఉత్తమోత్తమ మహాత్యాగపురుషుణ్ని సర్వసంగ పరిత్యాగిగా, పరిపూర్ణ ఆత్మవికాసం పొందిన వానినిగా చేసి, అందుకు తానే ఆదర్శమూర్తియైన శివుడు ఏకర్మసూత్రప్రకారంగా సక్రమ పరిణామ వికాసమును యీ పంచభూతాత్మకమైన జగత్తులో కల్పించుచున్నాడో అటువంటి కర్మసూత్రమునకు నమస్కారము.

ఇదంతా ఎట్లా ఉందంటే, బ్రహ్మ, విష్ణు మహేశ్వరులుకూడా "నామాదిరిగానే కర్మసూత్రానికి బద్ధులు గనుక, వీరు ముగ్గురినీ నా అధిష్ఠానదేవతలుగా నేను శిరసావహించను" అని వాదించినట్లుగా ఉంది. భారతదేశ ప్రభుత్వానికి అధిపతిగా ఒక అధ్యక్షుడు ఉన్నాడు. భారతదేశప్రభుత్వానికి ఒక ప్రధానమంత్రి ఉన్నాడు. భారతదేశపు పార్లమెంటుసభకు ఒక ప్రెసిడెంటు ఉన్నాడు. వీరు ముగ్గురూ ప్రభుత్వానికి మూలవిరాట్టుల వంటివారు. కాని యీ ముగ్గురియొక్క ప్రవర్తనను చర్యలను విమర్శించి అవి సక్రమంగా ఉన్నవా, అక్రమంగా ఉన్నవా అని విచారణ చేయడానికి సుప్రీంకోర్టు న్యాయమూర్తులకు అధికారం ఉంది. అయితే, యీ సుప్రీంకోర్టులోని న్యాయమూర్తులు భారతప్రభుత్వ రాజ్యాంగచట్టమునకు బద్ధులై యుండాలి.

దాసు వామనరావు

ఈ రాజ్యాంగచట్టము అనేది ప్రజలు తమ యిష్టానుసారము తమకు తామే శాసించుకొనేటటువంటిదై యున్నది. ప్రజాభీష్టము ననుసరించి రాజ్యాంగ చట్టము కూడా సవరింపబడగలదు. కనుక, రాజ్యాంగ చట్టం అనేది ప్రజాభీష్ట స్వాతంత్ర్యమునకు లోబడే ఉంటుంది. ప్రజలు అంటే భారతీయులమైన మనమే. కాబట్టి భారత ప్రభుత్వాధ్యక్షుడున్నూ, భారత ప్రధానమంత్రియున్నూ, భారత ప్రజాసభాధ్యక్షుడున్నూ, భారత సుప్రీం కోర్టు న్యాయమూర్తులున్నూ, భారత రాజ్యాంగ చట్టమున్నూ ఏ ప్రజాభీష్టమునకు బద్ధమైయున్నవో అట్టి ప్రజాభీష్ట శక్తికి నమస్కారము చేయుచున్నాను, అని ఏ భారతీయుడైనా అనవచ్చును. ఆ విధంగా నమస్కరించేటటువంటి భారతీయుడు కూడా భారతీయ ప్రజానీకంలో చేరినవాడే. కనుక, ఈ నమస్కారంలో కొంత భాగం ఆ నమస్కారంచేసే వ్యక్తికి కూడా చెందుతుంది.

ఒకొక్కప్పుడు, ప్రజాభీష్టం అనేది ఒక్క పురుషునియందు పూర్తిగా వికాసం పొందవచ్చు. ప్రజలందరిలో మిణుకుమిణుకుమంటున్న కోరిక గాని, పట్టుదలగాని, సంకల్పబలంగాని, అతనియందు తీవ్రరూపంలో విజృంభించవచ్చును. అటువంటి సందర్భంలో ప్రజాసంకల్పం అంతా అతనిలో అవతరించినట్లుగా ఉంటుంది. అతని అభీష్టమే ప్రజాభీష్టంగానూ, ప్రజాభీష్టమే అతని అభీష్టంగానూ, అద్వైతసిద్ధి పొందుతాయి. గాంధిమహాత్ముని కోరికయే భారతజాతియొక్క కోరిక అయినది. ప్రజాభీష్టమునే గౌరవించి ప్రజాభీష్టమునకే సాష్టాంగ ప్రణామం చేస్తున్నాను అని త్రికరణశుద్ధిగా మనస్ఫూర్తిగా అంతరాత్మసాక్షిగా పలికి ప్రవర్తించేటటువంటి వాడు నిజంగా తనలో ఉజ్వలిస్తున్న ప్రజ్వలిస్తున్న ఆత్మ సంకల్ప బలమునకే నమస్కరిస్తున్నాడని అర్థము.

గాంధిమహాత్ముడు అనేక సందర్భములలో తనకు *"Inner urge"* (అంతరంగ ప్రేరేపణ) ఉంటేనేగాని, ఏపనియున్నూ ప్రారంభించేవాడు కాడు. తనకు నిజంగా ఆత్మప్రేరణగాని, ఆత్మప్రబోధం గాని కలిగినప్పుడు, శాస్త్ర ప్రమాణాల కోసం ఆయన చర్చించి తర్కించేవాడు కాడు. ఆయన అంతఃకరణమే ఆయనకు ప్రమాణం.

ఈ విధంగా అన్నింటినీ నడిపించే ప్రజాభీష్ట స్వాతంత్ర్యశక్తి ఒకటి ఉన్నదనిన్నీ, ఆ ప్రజాస్వాతంత్ర్య శక్తికే తాను నమస్కారముచేయుచున్నాననిన్నీ చిత్తశుద్ధిగా చెప్పేటటువంటి పురుషుడు, ఆత్మనమస్కారము చేసికొనుచున్నాడని చెప్పక తప్పదు. ప్రజాభీష్ట సంకల్పం అనేది ఆయనలోనే ఉంది. అమితంగా ఉంది. కనుక తనలోవున్న ప్రజాసంకల్ప బలమునకు తనకు తానే నమస్కరించినవాడవుతాడు.

పూర్వమొకడు బెల్లము అచ్చుతో విఘ్నేశ్వరుని బొమ్మ ఒకటి తయారు చేశాడు. ఆ విఘ్నేశ్వరుని తన పూజామందిరములో ప్రతిష్ఠించి పూజ అంతా సశాస్త్రీయంగా చేశాడు. చిట్టచివరకు ఆ విఘ్నేశ్వరునకు ఏదైనా ప్రసాదమును నివేదన చేయవలసివచ్చింది. బెల్లపుగడ్డ నివేదన చేయవచ్చునని ప్రక్కనున్న ఒక పెద్ద మనిషి వెంటనే సలహా యిచ్చాడు. పూజ చేసిన మిత్రుడు ఆ బెల్లపు విఘ్నేశ్వర విగ్రహములోని ఒక చిన్న ముక్కను విరిచి, ఆ విఘ్నేశ్వరునకు నివేదనచేసి నమస్కారం చేసి హారతియిచ్చి పూజ ముగించాడు. ఇదంతా చూచి కొందరు పరిహాసం చేశారు. కాని, నిజంగా దేవుళ్ళకు కొట్టబడే టెంకాయలన్నీ దేవుడిచ్చినవేగదా. దేవుడు మనకిచ్చినదానినే తిరిగి మనము దేవునకు సమర్పించడ మవుతోంది.

ప్రభుత్వమువారికి మనము పన్నుల రూపంగా శిస్తులరూపంగా చెల్లించేటటువంటి రూపాయలన్నీ ప్రభుత్వమువారు తమ టంకసాలలో ముద్రవేసి యిచ్చినరూపాయలే గదా. సర్కారువారి రూపాయలను సర్కారువారికే సమర్పిస్తున్నాము. కాని, సర్కారువారికి యీ ద్రవ్యం అంతా ఎక్కడిది ? సర్కారువారి ఖజానా ఏ విధంగా నిండుతోంది అని ప్రశ్నిస్తే ప్రజలు యిచ్చేటటువంటి ద్రవ్యంతోనే నిండుతోంది. సర్కారువారు ఖర్చుపెట్టేది అంతా ప్రజల సొమ్మ తప్ప మరొకటికాదు. ప్రజలసొమ్మను ప్రజలకే ఖర్చుపెట్టుతున్నారు కనుక ప్రభుత్వపు సొమ్మను మనం తింటున్నామా? మన సొమ్మను ప్రభుత్వం తింటున్నదా? అని ప్రశ్నిస్తే, ప్రజలసొమ్మను ప్రజలే తింటున్నారని ప్రత్యుత్తరం చెప్పవలసిఉంటుంది. యీ ప్రజాద్రవ్యపు జమాఖర్చు లెక్క తిరుగుడు కూడా ఆత్మప్రదక్షిణ నమస్కారంగానే ఉన్నది.

మన శక్తిని మనము తెలిసికొనగల్గినప్పుడే మనము వృద్ధిలోనికి వస్తాము. మనఆత్మ విమోచనను మనము పొందవలెనంటే మన ఆత్మ శక్తిని మనము తెలిసికోవాలి. మన ఆత్మశక్తిని, మనము తెలిసికోవాలంటే, మనకు ఆత్మగౌరవం కలగాలి. మన ఆత్మశక్తిని మనము గౌరవించి

"నిన్న నేను యిచ్చిన రెండు కవర్లూ జాగ్రత్తగా పోస్టు చేశావా?"

"ఆ; చేశానండి. కానీ- తీరా పోస్టాఫీసుకు పోయి చూద్దునుకదా లండన్ కు పోయే కవరుమీద రెండణాల స్టాంపు, మద్రాసుకు పోయే కవరుమీద పన్నెండు అణాల స్టాంపు అంటించి వుందండి. సరే ఏదో పొరపాటు జరిగి వుంటుంది లెమ్మని నేనే సవరించేసి పోస్టులో పడేశానండి."

"ఏం చేశావేమిటి?"

"ఏముందండీ? రెండణాలు స్టాంపు అట్టించిన కవరుమీది అడ్రసు కొట్టేసి మద్రాసు కంపెనీ అడ్రసు, పన్నెండు అణాలస్టాంపు అంటించినకవరు మీది అడ్రసు కొట్టేసి, మీ అబ్బాయిగారి అడ్రసు రాసేశానండి"

మన ఆత్మశక్తికి మనమే నమస్కారం చెయ్యాలి. ఆత్మప్రదక్షిణ నమస్కారం చేసికోవాలి. ఆంధ్రుణ్ని ఆంధ్రుడు గౌరవించిననాడే, ఆంధ్రునకు ముక్తిఉంటుంది.

"ఆంధ్రులంటే ఐకమత్యంలేని అప్రయోజకులండీ! ఆంధ్రులంటే నల్లమందు భాయీలండీ! ఆంధ్రులలో ఉత్సాహాలూ, ఉద్రేకాలూ మాత్రం ఎక్కువండీ! ప్రజ్ఞగాని, పట్టుదలగాని తక్కువండీ"— అని యీ విధంగా ఆంధ్రులను ఆంధ్రులే నిరసించుకొనడం కార్యాలయాలలోనూ, కాఫీ హోటళ్ళలోనూ కర్ణాకర్ణిగా వినిపిస్తూ వుంటుంది. "ఆంధ్రులు అవ్యక్తులు, అప్రయోజకులు, అసమర్థులు, అనాథలు, అధమాధములు" అని ఒక ఆంధ్రుడు తన తిట్లకవిలె కట్టవిప్పి తిట్టు కవిత్వం ప్రారంభించినట్లయితే యీ ఆంధ్ర జనదూషణ చేసేటటువంటి ఆంధ్రుడుకూడా అవ్యక్తుడు, అప్రయోజకుడు అసమర్థుడు ఆత్మనిందా

ఆ యిల్లాలు వంట చేసుకొంటూ వుండగా వీధిలో ఎక్కడనుంచో ఎగిరి వచ్చిన బంతి ఒకటి వంటయింటి కిటికీ అద్దం బద్దలుకొట్టి, లోపలికివచ్చి పడింది. ఆవిడకు కోపం వచ్చి, గబగబా బయటకి వెళ్లిచూసింది. వీధిలో ఎవ్వరూ కనిపించలేదు. వంటయింట్లోకి తిరిగి వచ్చి, బంతిని తీసి ఒకమూల దాచేసి, తనపని తను చేసుకొంటోంది.

ఒక గంట గడిచాక, వీధి తలుపుమీద ఎవరో భయం భయంగా కొట్టుతున్నట్లు వినిపించి, పోయి తలుపు తీసింది. ఎనిమిదేళ్ల కుర్రాడొకడు హడిలిపోతూ కనిపించాడు. "అడుగో మా నాన్న...మీ వంటయింటి కిటికీకి మంచి అద్దం వేయటానికి పట్టుకొస్తున్నాడు. నా బంతి నాకు యిచ్చేయరూ?" అని బతిమాలుతున్న ధోరణిలో అడిగాడు. ఆవిడకు జాలివేసింది. చేసిన తప్పుకి ఆకుర్రాడు కూడా బాధపడి, తండ్రిచేత కిటికీ బాగు చేయిస్తున్నందుకు, ఆ కుర్రాణ్ణి ఆవిడ మనస్సులో మెచ్చుకొని, బంతి తెచ్చియిచ్చింది. కుర్రాడు గంతులేస్తూ వెళ్లిపోయాడు.

కొద్ది నిమిషాలకి ఆపెద్ద మనిషి వచ్చి పగిలిపోయిన అద్దం తీసేసి మంచి అద్దం బిగించేపని ప్రారంభించాడు. ఆపని అంతా ఒకగంట సేపు పట్టింది. పని పూర్తిఅయ్యాక అతడు వీధి వాకిట్లోకి వచ్చి "అమ్మగారూ! నా కూలీ యిప్పించండి. నేను పోతాను" అని కేక వేశాడు.

పుస్తకం చదువుతూ నడవలో కూర్చొనివున్న యిల్లాలికి మతిపోయినట్లైంది. వీధిలోకి వచ్చి "డబ్బులు యిమ్మంటా వేమిటీ? మా కిటికీ పగలకొట్టిన కుర్రాడు నీకొడుకు కాదూ?" అని అడిగింది.

"అదేమిటండీ అమ్మగారూ, అట్లాగంటారు? ఆయబ్బాయి తమరి అబ్బాయి కాదూ?" అంటూ అతనూ తెల్లబోయాడు.

# ★ కాలక్షేపం ★

ప్రియుడు అని చెప్పవలసివస్తుంది. ఏ కర్మ సూత్రమును అనుసరించి మనము ఆంధ్రోద్యమాన్ని నడిపించామో, ఏ కర్మ సూత్రాన్ని అనుసరించి మనకు ఆంధ్ర రాష్ట్రము 40 ఏళ్లకు లభించిందో, ఏ కర్మ సూత్రాన్ని అనుసరించి మనము మహాతెలింగాణానుకూడా సాధించి భాగ్యనగరంలో బావుటా ప్రతిష్ఠించి అభ్యుదయ పరంపరాభివృద్ధిని పొందవలసియున్నామో అట్టి మన కర్మకొక నమస్కారం అని ఆత్మప్రదక్షిణ నమస్కారం చేయడం వివేకలక్షణం.

కాని, యీ ఆత్మ ప్రదక్షిణ నమస్కారం జగత్తులో ప్రతి గ్రహమున్నూ చేస్తూనే ఉంది. భూమి తన చుట్టూ తాను 24 గంటలకొకసారి తిరుగుతూ, సూర్యునిచుట్టూ సంవత్సరానికొకమారు ప్రదక్షిణం చేస్తూ ఉంది. సూర్యునిచుట్టూ గ్రహాలన్నీ అదే విధంగా తిరుగుతున్నాయి. అంతేకాదు, ప్రతి అణువులోనూ ఉన్నటువంటి పరమాణువులు కూడా, ఆత్మప్రదక్షిణాలు చేస్తూఉన్నాయి.

జగమంతా ఆత్మప్రదక్షిణ మయంగా ఉంది. సారె సారెకు కుమ్మరిసారెవలె తిరిగెడి సంసార చక్రము కూడా ఆత్మప్రదక్షిణం చేస్తోంది. రాజుచుట్టూ ప్రజలు. రాణిచుట్టూ రాజు-పురుషుని చుట్టూ స్త్రీ-స్త్రీ చుట్టూ పురుషుడు. "నా భార్య, నా బిడ్డలు, నాజాతి, నాదేశం," యీ అభిమానంతోనే మానవకోటి ఆత్మప్రదక్షిణాలు చేస్తోంది. "అలివంకవారు ఆత్మజనులు" అనే అభిమానంకూడా ఆత్మజ్ఞానమే - తన్ను తాను తెలిసికోవలెనంటే, తనదేశం, తన జాతి, తన నాగరికత, తన భాష, తన పూర్వసంస్కారము అన్నీ తెలిసికోవాలి. ఇందుకొరకై ఆత్మ ప్రదక్షిణ నమస్కారంచేసి, ఆత్మజ్ఞానం పొందాలి.

కాని, యిందులో ఉన్న పెద్ద చిక్కు ఏమిటంటే, ఆత్మప్రదక్షిణ చేయగా చేయగా కళ్లు తిరుగుతాయి. నిలువలేక కూలిపడిపోతారు. వాంతి కూడా అవుతుంది. గుండె దడదడలాడుతుంది. ప్రాణం తల్లడిల్లుతుంది. చాలా ప్రమాదకరంగా పరిణమిస్తుంది.

కొంతకాలంక్రిందట ఒక గ్రామంలో అఖండ వైభవంగా ఒక భాగ్యవంతుని యింట్లో వివాహం జరిగింది. శారదాఆక్టులేని పరదా కాలపు పెళ్లి అది. అయిదురోజులూ కొట్టి కోలాహలంగా పాటకచ్చేరీలతో, విందు భోజనాలతో, వేడుకలు లాంఛనాలతో వివాహం జరిగింది. పెండ్లికుమార్తెను పెండ్లికుమారుని పెద్ద పూలపల్లకీలో ఊరేగించవలెనని పెండ్లికుమార్తెయొక్క తండ్రికి ఆసక్తి కలిగింది. మల్లెపూవుల మాలలతో పూల అంబారీ వంటిది ఒకటి కన్నులపండువుగా, వీధి అంతా ఘుమఘుమలాడేటట్లు తయారుచేశారు. ఆ పూలపల్లకీ అంబారీలో మెత్తనిదిండ్లుగల చిన్న సోఫా ఒకటి అమర్చి ఆసోఫాలో నూత్న వధూవరులను చక్కగా ఆభరణాలతో ముస్తాబుచేసి కూర్చుండబెట్టినారు. ఈ పూల అంబారీని, ఎద్దులలాగే

బద్ధకస్తుడైన ఒక వుద్యోగిని ఆకంపెనీ యజమాని చివరికొక రోజు పనిలోనుంచి తీసేశాడు. 'పని తీసేస్తే తీసేశారు, చక్కని సర్టిఫికెట్టు అయినా యిప్పించమ'ని ఆ మాజీ వుద్యోగి, ఆయనను పట్టి వేధించుకు తిన్నాడు. చివరికి ఆయన యిలా ఒక సర్టిఫికెట్ వ్రాసి వాడిచేతి కిచ్చాడు.

"...అనే పేరుగల వ్యక్తి మా కంపెనీ సర్వీసులో రెండేళ్లపాటు వున్నాడు. ఇప్పుడు వదిలి పోతున్నాడు. అది మాకెంతో సంతృప్తికరంగా వుంది"

బండిమీద చక్కగా కదలకుండా బందోబస్తు చేశారు.

ఆ బండీని లాగుటకు ఆ యజమానివద్ద ఉన్న ఎద్దుల జతకు జబ్బుచేసి సమయానికి అక్కరకు రాలేదు. ఆ గ్రామంలో మంచి ధనికుడైన సర్వేశం నూనె గానుగలు రెండు పెట్టి చాలా డబ్బు సంపాదించాడు. పెండ్లికుమార్తె యొక్క తండ్రికి యీ తిలఘాతకుడైన సర్వేశం చాలా ఆప్తమిత్రుడు. అందువల్ల వెంటనే తనవద్ద ఉన్న పెద్ద ఎద్దుల జతను సప్లయిచేసి సమయానికి సహాయం చేశాడు. ఆ గాండ్లవాని ఎద్దులు చాలాభారివి. అందువల్ల మల్లెపూల అంబారీ అమర్చబడిన బండీకి కట్టి, అఖండ వైభవంగా ఊరేగింపు సాగించారు. బండీకి రెండువైపులను గ్యాస్‌లైట్లతో అరడజను మంది నడుస్తున్నారు. బండీకి వెనుక పెళ్ళివారు. బండీకి ముందు బ్యాండు మేళం భోగం మేళం వగైరా ఉన్నాయి. మధ్యమధ్య ఊరేగింపు ఆగుతోంది. జొట్లు, తారాజువ్వలు, అగ్నిబాణాలు వగైరా బాణాసంచు కాలుస్తున్నారు. వీధి గుమ్మాలలోకి వచ్చిన పిల్లలు పెద్దలు ముత్తయిదువలు అంబారీలోపల వెల్తురులో మెరుస్తున్న పెండ్లికుమార్తెను పెండ్లికుమారుని మెచ్చుకుంటున్నారు. వాళ్లిద్దరు కూడా అంబారీలో శివిగా కూర్చుండి తమవైభవానికి తామే మెచ్చుకొని ఆనందిస్తున్నారు. ఊరేగింపు పెద్ద బజారులో నుంచి చెరువుగట్టు వీధికి పోవుటకుగాను కాలువ మీదనున్న వంతెనమీదుగా పోవాలి. వంతెనమీదుగా పోవుటకు పెద్ద కంకర రోడ్డు ఉంది. వంతెనకు ఇటువైపుననూ, అటువైపుననూ రోడ్డు ఏటవాలుగా సులోపుగా ఉంది. ఆ సులోపుగాపోయే రోడ్డుకు కుడివైపుననూ, ఎడమవైపుననూ అగాధంగా ఉంటుంది. సులోపుగా పోయే ఆరోడ్డు మీద బండ్లను కొంచెం జాగ్రత్తగా తోలుతూ ఉండాలి. ఆ గ్రామంలో బండ్లు తోలుతూ ఉండేవారికి యిది అభ్యాసవశంగా అనుభవసిద్ధమైన విషయమే. పూల పల్లకీ బండి ఆ వంతెనదాటి దిగుతూఉండే సమయంలో కొంతదూరం వచ్చినతర్వాత ఆ ఎద్దులు ఎందుచేతనోగాని ప్రదక్షిణం చేయడం ప్రారంభించాయి. పైన పూల అంబారీలోని పెండ్లికుమార్తెకూ పెండ్లికుమారునకూ గాబరా ఎక్కువైంది. చాలా ఎత్తయిన అంబారీలో కూర్చుండడంచేత తటాలున క్రిందకు దిగడం వారికి ఎంత మాత్రమూ సాధ్యంకాలేదు. ఆ సులోపు ప్రాంతంలో ఆ బండీని గిరగిర త్రిప్పి ప్రదక్షిణాలు చేయసమకట్టిన ఎద్దుల పగ్గంబట్టి బండిని తోలుచున్న చాకలి చాలా ప్రయాసపడ్డాడు. "హో హో" అన్నాడు. కాని అవి ఆగలేదు. "హే! హే" అన్నాడు. "హూ! హూ!" అన్నాడు. ఏమీ లాభంలేదు. "హ" గుణింతము అంతా ఏకరువు పెట్టి, ఆ ఎద్దులను బుజ్జగించాడు. కాని, హ గుణింతములోని "హ్రాం! హ్రీం!" వంటిబీజాక్షరోచ్చారణకుకూడా చలించని మొద్దు ఎద్దుల లాగున కన్పించాయి. ఆ సులోపుదగ్గిర యివి సాగించిన ఆత్మ ప్రదక్షిణం అందరికీ భయం పుట్టించింది. శుభంలో అశుభ కారణంగా కన్పించింది. ఊరేగింపులో ఉన్న బ్యాండు వాళ్లు మేళం ఆపివేశారు. ఎక్కడి వాళ్ళక్కడ స్తంభించి నిలిచిపోయినారు. కాని, ఆపూల అంబారీ పల్లకితో సహా ఆ బండీ ఆత్మప్రదక్షిణం అవశ్యకర్తవ్య మన్నట్లుగా ఆ ఎద్దులు సంకల్పించి, అపసవ్య ప్రదక్షిణం ఆరంభించాయి - రవంత ఆలస్యమైతే ఆసులోపులో బండీ బోల్తా కొట్టవలసిందే. సరిగ్గా ఆ సమయంలో ఎక్కడనుంచి వచ్చాడోగాని సర్వేశ్వరుని లాగున సర్వేశం వచ్చి ఆ ఎద్దులముందు నిలువబడి "ఆ!" అని అదలించేసరికి, అప్పుడవి ఆత్మప్రదక్షిణం విరమించాయి.

పెండ్లికుమార్తె తండ్రియున్నూ తల్లియున్నూ వెంటనే ముందుకువచ్చి వధూవరులిద్దరికీ దృష్టిదోషం తగిలి యీ ఉపద్రవభయం సంభవించినదని నిశ్చయించి ఇద్దరూ చెరియొక కొబ్బరికాయను వధూవరుల చుట్టూ ముమ్మారు గిరుక త్రిప్పి దిష్టితీసి నేలమీద విసిరికొట్టి వేశారు. "ఏమిటోయి సర్వేశం యీ కర్మం?" అని పెండ్లికుమార్తె యొక్క తండ్రి సర్వేశాన్ని ప్రశ్నించాడు. సర్వేశ్వరుడైతేమాత్రం ఏం చెప్పగలడు? గానుగఎద్దులను బండికి కట్టినందుచేత, ఆ ఎద్దులకు ప్రదక్షిణాలు చేయడమే పరిపాటిగనుక, ఆ విధంగా అవి తమ "వెనుకటి గుణమేలమాను వినరా సుమతీ!" అన్నట్లుగా తిరిగినవని జవాబు చెప్పాలి. కాని, ఆ గానుగ ఎద్దులను యీ బండికి కట్టడం ఎందుకు జరగాలి? అని ప్రశ్నిస్తే, దానికెవడు జవాబు చెప్పగలడు? ఆరీతిగా జరుగవలసిఉన్నది గనుక జరిగింది. అనుభవించవలసిన కర్మ అనుభవించవలసినదే. ఆత్మప్రదక్షిణాలు చేయకుండా కర్మపాశం నుంచి తప్పించుకోలేము.

"అల రవి దేనిచే దిరుగు?
నా ఘనకర్మము వంద్యమే కదా."

సూర్యుడు దేని ప్రభావముచేత తిరుగుచున్నాడో అటువంటి ఘనమైన కర్మసూత్రము నమస్కరించదగినదే కదా! ★

---

మాకు కథలు, గేయాలు, చిత్రాలు, ఫోటోలు పంపేవారు వానిని త్రిప్పి పంప గోరినట్లయితే, వానితోపాటు తగిన స్టాంపులను చేర్చిపంపవలసెందని మనవి. ఈ సందర్భంలో బుక్‌పోస్టుకు **అణా స్టాంపుకు** తక్కువకాకుండా అంటించాలని గుర్తుంచుకోవడం అవసరం. ఫోటోలను పంపేవారు కనీసం కార్డుసైజు ఫోటోలను పంపాలి. నెగటివ్‌లు స్వీకరించబడవు. కథలు, ఫోటోలు మొదలైనవి అందినవెంటనే ప్రచురణ విషయమై మా నిర్ణయాన్ని తెలియ చెయ్యడం సాధ్యంకాదని మనవి చేస్తున్నాము. నిరాకరించబడిన వానిని త్రిప్పి పంపడానికి కనీసం ఒక మాసమైనా వ్యవధి నివ్వవలసిందని మా విన్నపం. ప్రచురించే వాని విషయమై **ప్రచురించే ముందు మాత్రమే** తెలియ పరచగలము. రచయితలూ, చిత్రకారులూ ఈ విషయంలో సహకరించగలరని మా విశ్వాసం. —సం॥

# పెళ్ళంటే మాటలా?

'నమస్కారమండీ గురువుగారూ!' అంటూ నా ప్రక్కనవచ్చి కూర్చున్నాడు మిత్రుడు రమణ.

ఈమధ్య సినిమాలు ప్రసాదించిన వరాల్లో ఇదొకటి! హెచ్చుతగ్గులు లేకుండా ప్రతివాడిని అమాంతంగా 'గురువుగార్ని' చేసేయటం. నమస్కార బాణం పారేయటం. ఇది అందరికీ అలవాటై పోయింది. 'నేను పెళ్ళి చేసుకోను' అన్నాడు ఉన్నట్టుండి. 'అదేమిటోయ్! అమాంతంగా ఆ నిర్ణయానికి వచ్చావు?... సరేలే! నువ్వేమిటి! కొమ్ములుతిరిగిన పెద్దలు కూడా నీలాగే అని చివరికి చడీచప్పుడూ లేకుండా పుస్తెకట్టేశారు. అసలు పెళ్ళి చేసుకోకుండా ఎవరు బ్రతగ్గలరు చెప్పు? ఆనాటి వ్యాసుణ్ణి బ్రహ్మచారి అంటారు. కాని వాడు మాత్రం దొటికినచాన్సులు ఊరికే పోగొట్టుకున్నాడా? అమాంతంగా ముగ్గురుపిల్లల తండ్రై ఊరుకున్నాడు. మహర్షులకుమాత్రం నిగ్రహమేది? ఇవన్నీ నీటిమీదిరాతలు. అంతా అభిలాషకు దాసులే!' అని చిన్న లెక్చరుదంచాను.

మావాడు సముద్రపు కెరటాలమధ్యనున్న రాయిలా చలించలేదు.

'నువ్వు వెయ్యి చెప్పు. లక్ష చెప్పు సంసారం చెయ్యటంకన్న సాగరంలో ఉరకటం మంచిది. నువ్వే ఆలోచించు. ప్రస్తుతం ఇంటరు చదువుతున్నా. ఆపైన చదివే ఆశ లేదు. S. S. L. C., ఇంటరుసమానం. కనుక నాకు గుమాస్తాగిరీ పెర్మనెంటని ఒప్పుకుంటావా? అటువంటప్పుడు పెళ్లిచేసుకోటమంటే మెడకి బండరాయి కట్టుకోటమన్న మాట. ఏమంటావు?' అని నాకేసి సీరియస్‌గా చూశాడు. నిజానికి అతని ముఖంలో బాధకూడా వ్యక్తమయింది. 'నిజమే! కాని పెళ్ళిచేసుకోకపోతే అసలే బ్రతకలేవు. లోకం నీమీద నానా అపవాదులూ వేస్తుంది. మన ఫ్రెండు జోగారావు సంగతిచూస్తేనే నీకు అంతా బోధపడుతుంది. పాతికేళ్లు పైబడ్డాయి. పెళ్ళి పెడాకులు లేవు. సరదాకి మత్తుగా మస్తాబై తిరుగుతాడు. ఈమధ్య అతను గోడలు దూకుతున్నాడని కొందరంటున్నారు. ఆపైన ఆ పేరిశాస్త్రిలు అతను కనిపించినప్పుడల్లా 'బెండకాయ ముదిరినా బ్రహ్మచారి ముదిరినా ప్రమాదమే!' అంటాడు. ఇవన్నీ సూదిపోట్లలా తగులతాయి. మంచిగా ఉందామన్నా అపవాదు తప్పదు. అందుచేత పెళ్లిచేసుకుని ఆ బాధల్ని గౌరవంగా అనుభవించడం ఉత్తమం' అని పరిస్థితుల్ని విడమర్చి చెప్పాను.

'ఏమయినా సరే! నా నిశ్చయం నాదే!' అన్నాడు రమ. కొంతమంది 'లవ్ మేరేజీల' కోసం, కొందరు 'ఘరానా' కోసం, కొందరు 'వినోదం'కోసం ఈ 'పెళ్ళి చేసుకోను' అనే బ్రహ్మాస్త్రాన్ని వదలుతూంటారు. మరి మా మిత్రుడి అభిప్రాయమేమిటో!



ఆ రాత్రి రమణ, నేను ఏదో మాట్లాడుకుంటున్నాం. ఎవరో క్రొత్త ఆసామీ వచ్చి 'వెంకయ్యగారిల్లు ఇదేనాండి?' అనడిగాడు. మిత్రుడు అవునన్నాడు.

'ఆయన ఇంట్లో ఉన్నారాండి' అన్నాడు.

'భోంచేస్తున్నారండి...ఎందుకండి?'

'ఆయనతో కొద్దిగా రాచకార్యముండి వచ్చానండి' అన్నాడు. వచ్చినమనిషి 'కన్యాశుల్కం' చాలా సారులు చదివినట్టున్నాడు.

'ఇలా కూర్చోండి. వస్తారు' అని రమణ మంచం వాల్చాడు. ఆ ఆసామీ మంచం మీద కూర్చుని 'ఉస్' అనుకుంటూ తను చాలా శ్రమపడి వచ్చానని ఛాటుకున్నాడు.

అతనికి మీసాలు బాగా పెరిగున్నాయి. మధ్య పాపిట తీశాడు. కాళ్ళకి కిర్రుచెప్పులున్నాయి.

'ఈ వీధిలో ఎలక్ట్రీదీపాలు లేవాండీ?' అన్నాడు.

'ఉన్నాయి - దీపాలు ఆరిపోయాయి' అన్నాను - మరుక్షణంలో తక్కున దీపాలు వెలిగాయి.

రమణని ఓ నిమిషం తేరిపారచూచి 'మీరేనాండి వెంకయ్యగారి పెద్దబ్బాయి?' అన్నాడు-అవునన్నట్టుగా రమణ తలూపాడు.

'అటూ! మీ ముఖంలో సలక్షణం, మంచి కళ ఉందండి. అసలు మొగాళ్ళకి కావలసింది ముఖకళ, చదువుకాని అందమెందుకండి?' అన్నాడు.

రమణ ఏమీ అర్థంకాక నాకేసి చూస్తే నేను ఆకాశంకేసి చూచాను - ఇతను ఒకవేళ భట్రాజయితే ఏ రాజుదగ్గఱకో పోక మాదగ్గఱకు వచ్చాడేమిటనుకున్నాను. రమణ లోపలికి వెళ్లి వెంకయ్యగారితో క్రొత్త ఆసామీ రాకనుగురించి చెప్పాడు.

అయిదు నిమిషాలు గడిచాక వెంకయ్యగారు జర్రున త్రేనుస్తూ స్థూలకాయాన్ని బయటికి చేరవేసి, 'ఎవరది?' అనడిగారు.

'నేనండి. కామయ్యను.' అన్నాడు క్రొత్త ఆసామీ.

'ఓహో! మీరా!...ఇదేనా రావటం?' అంటూ అతని ప్రక్కన కూర్చున్నారు.

'అవునండి. ఇందాకనే వచ్చాను... మన అబ్బాయి పెళ్ళిగురించి మీతో మాట్లాడుదామని...' అని ఆగాడు.

'ఓహో! అదా సంగతి! ఇంతకీ మీరు భోంచేసేరా?' వెంకయ్యగారు మరోసారి త్రేన్చారు.

'హోటల్లో భోంచేశానండి.'

'ఏమిటీ! మనిల్లు ఉండగా హోటల్లో భోంచేయట మేమిటి? ఛ...ఛ......మీరు చేసిన పని ఏం బాగూ లేదు' అని నొచ్చుకున్నాడాయన.

'దానికేం లెండి! మీ ఆదరాభిమానాలుంటే అదే పదివేలు! ఇవేళ కాకపోతే రేపు...వాళ్ల కుటుంబం చాలా సలక్షణమైనదండి' అంటూ ప్రారంభించాడు.

ఇంతా చేసి కామయ్య పెళ్ళిళ్ళ పేరయ్యలాగున్నాడు!

'వాళ్ళ దే వూరు? కృష్ణాపురం కదూ' అన్నారు?

'అవునండి. ఎంతో గౌరవప్రదమైన కుటుంబం. అంత మర్యాదగా ఉండగలిగిన వాళ్ళు మన దేశంలోనే లేరంటే నమ్మండి. వాళ్ళ ముత్తాత 'శరభయ్య'గారు వెంకటగిరి ఆస్థానంలో రాజాగారికి కుడిచేయిగా ఉండేవారు...'

'అయ్యో! శరభయ్యగార్ని గురించి నాకు చెప్పాలా?'

'అటువంటి ఉత్తమ కుటుంబం. వాళ్లను ఆ గ్రామంలోనివాళ్ళంతా దైవ సమానంగా చూస్తారు. వాళ్ళకి ఆస్తిపాస్తులతో సంబంధం లేదు. కట్నాలు కానుకలు కావాలని కలలో కూడా అడగరు. మన బ్బాయి చదువుకుంటున్నాడు. అంతే చాలు! చదువుకున్న వాళ్ళంటే వాళ్ళకు ఎంత అభిమానమో చెప్పలేను. శరభయ్య గారి తరవాత ఆ వంశంలో చదువుకున్న వాళ్ళు ఒక్కళ్ళూ లేరు. కావాలంటే అబ్బాయిని కావలసినంతవరకు చదివిస్తారు. దమ్మిడీ అయినా మనం కట్నం యివ్వనక్కర్లేదు.'

మధ్య ప్రశ్నలు వేయకపోతే 'మగవాడి తండ్రి'కి ఉండవలసిన దర్జా తగ్గిపోతుందనుకున్నారు గామోలు వెంకయ్యగారు—

'వాళ్లు మంచి ఆస్తిపరు లనుకుంటా' అన్నారు.

'వాళ్ళు మొత్తం అయిదుగు రన్నదమ్ములండి. అందులో రెండో అతని కూతురండి పెళ్ళికూతురు. ఆ అయిదుగురికీ తలో పది ఎకరాల భూమి ఉంది బంగారంలాంటి సుక్షేత్ర మనుకోండి. మిగతా నలుగురికీ సంతానంలేదు. అందుచేత ఈ యమ్మాయంటే వాళ్ళందరికీ భలే అభిమానం. పెద్దతని డబ్బు కొంత వడ్డీకి తిరుగుతోంది. ఆ సొమ్మంతా పెళ్ళికూతురుకే దక్కుతుంది. మరో సంగతి - తన ఆస్తంతా పెద్దతను అమ్మాయిపేర రాసేశాడని వినికిడి. నిజమే అయుంటుంది కూడా' అని ఆగాడు.

'మరి కన్నవాళ్ళ పిల్లల కివ్వకుండా దారంట పోయేవాడి కిస్తారా?' అన్నారు వెంకయ్యగారు.

'పెళ్ళి చేసుకోను' అన్న మా మిత్రుడు దవులు నొక్కుకుంటూ ఆనందంతో సంభాషణ వింటున్నాడు.



'ఆ శరభయ్యగారి సేవకు మెచ్చి రాజాగారు ఓ పదెకరాల భూమి బహూకరించారు. అది కూడా అమ్మాయి పేరనుంది. అమ్మాయికూడా అతి గారాబంగా పెరుగుతోంది. అక్కడి గిన్ని ఇక్కడ కూడా పెట నివ్వరండి. చదువుకున్న అల్లుణ్ణి తల నెత్తికెక్కించుకు[illegible] చాలా ఉత్తమమైన సంబంధమండి' అని ముగించాడు కామయ్య.

'అమ్మాయికి ఎన్నేళ్ళుంటాయి?' అనడిగారు వెంకయ్యగారు. ఈమధ్య తమికం పెద్ద పిల్లల్ని కొందరు పెళ్ళాడుతున్నారని ఆయన భయం!

'తొమ్మిది పదేళ్ళుంటాయండి. ఇంకా రెండుమూడేళ్ళు పోతేనేకాని పెద్దమనిషి కాదండి. అంతకుముందే పెళ్ళిచెయ్యాలని వారి ఆలోచన.'

వెంకయ్యగారి ఛాందసత్వానికి, ఇది [illegible]కరంగానే కనిపించింది

'ఈ ఇల్లు మన దేనాండి?' అని పెళ్ళి

# ★ పెళ్ళంటే మాటలా? ★

కొడుకు తరఫువారిని గురించి ఎన్‌క్వైరీ ప్రారంభించాడు.

'అబ్బే! ఇది అద్దిల్లు...మన సొంత వూళ్లో మంచి డాబా ఉంది. వెనకాల తోట. మాంచి విశాలమైనది. అబ్బాయి కాలేజీలో చదువుకుంటున్నాడుగా! అందుకని ఇక్కడికి రావలసివచ్చింది. కాలేజీదగ్గఱ యాభైరూపాయల అద్దికి ఓ మంచి పోర్షను చూశాను. కాని ఈ వీధిలో అందరూ ఎరిగున్నవాళ్ళే - ఇక్కడికి రమ్మని బలవంతం చేయటం మూలాన రాక తప్పింది కాదు.'

'అదే బాగుందండి - ఎరిగున్నవాళ్ళ మధ్య ఉండటమే మంచిది' అని తాళం వేశాడు కామయ్య. ఉత్తది! సామాన్య కుటుంబీకుడు 50 రూపాయల అద్దె యింట్లో ఎలా వుంటాడు చెప్పండి!

'అబ్బాయి S. S. L. C ఫస్టుగా పేస య్యాడు - స్కూలుకంతా ఫస్టు అతనిదే.

'చిత్తం - అది అబ్బాయి ముఖకళలోనే తెలుస్తోందండి' అసలు రహస్య మేమిటంటే మావాడు స్కూలుఫైనలు ఫస్టు ఛాన్సులో ప్యాసవుతే బాగుండదని - అన్ని విషయాల్లో సంపూర్ణ జ్ఞానం రాదని - మద్రాసు యూనివర్సిటీకి రాబడి తగ్గిపోతుందని భావించి అక్టోబరులో ఓసారి వెళ్ళి మళ్ళీ మార్చిలో ఓసారి వెళ్ళి గటాగటి మార్కులతో S. S. L. C. ప్యాసయ్యాడు.

'అతని మార్కులుచూచి హెడ్మాష్టరు అతన్ని పైకి చదివించమని చెప్పారు... అసలు వ్యవసాయం చేయిద్దామనుకున్నాను!'

ఉన్న ఎకరం భూమిని వెంకయ్యగారు ఏనాడో అమ్మేశారు.

'అందుకని ఇంటరులో జాయిన్ చేశారు. అంతా కలుపుకుని జాయిన్ చేయటానికి మొత్తం ఎనిమిదివందలు ఖర్చయింది. ప్రతి నెల బోలెడు జీతం - ఇన్ని మెతుకులు పెట్టేది చదువేకదా అని చదివిస్తున్నారు.'

ఇదో పెద్దబడాయి! జాయిన్ చేయటానికి రెండువందలకు ఎక్కువకాలేదు. రమణకు చాలా పుస్తకాలు లేవు - వాళ్ళనీ వీళ్ళనీ అడిగి చదువుకుంటాడు.

'అంతేనండి. మావూరి కర్ణంగారబ్బాయికి నెలకు నూటయాభై ఖర్చవుతోందండి' అన్నాడు కామయ్య. ఆ కర్ణంగారబ్బాయి చదువుకేకాక ఇంకా ఎన్ని ఇతర విషయాలకు ఆడబ్బును వినియోగిస్తున్నాడో!

'అయితే ఇంటరులో ఆపేస్తారా?' అని సందేహం వెలిబుచ్చాడు కామయ్య.

'అబ్బే! బి. ఏ. చదివించి ఆపైన ఎం. ఎ. చదివిస్తాను' అని గర్వంగా చెప్పుకున్నారు.

'బి. ఏ. చదివి ఉద్యోగం లేకుండా ఒకబ్బాయి మావూరిలో తిరుగుతున్నాడు. ఎం. ఎ. చదివించండి' అని కామయ్య సలహాయిచ్చాడు.

'అందుకే వాడికి టైపు నేర్పించాను. హయ్యరు పరీక్ష ఫస్టుక్లాసులో పాసయ్యాడు.'

ఈ పరీక్ష కూడా మావాడిది రెండు సారులు తన్నింది! విసుగెత్తిమానుకున్నాడు! ఆంధ్రదేశంలోనే ఎవడికీ ఫస్టుక్లాసురాదు! ఇక మావాడికెలాగ వస్తుంది?

'షార్టు హాండు కూడా పాసయ్యాడు'

అది మాత్రం నిజమేమిటి? అంతా బడాయి.

'ఎక్కడి కెళ్ళినా వాడిని కళ్ళకద్దుకుని స్టెనోగ్రాఫరుగా తీసుకుంటారు. అయిదు వందలకు తక్కువుండదు జీతం. మొన్ననే బెజవాడనుంచి మంచిసంబంధం వచ్చింది. యాభైవేలదాకా ఆస్తి ఉందట. రేపురమ్మన్నారు. ఈలోగా మీరే వచ్చారు... మరి నాకు అభ్యంతరంలేదు. అబ్బాయిని ఓసారి బాగా చూసుకోండి!'

నేర్పు అనే బ్యాటుతో 'కోతలు' అనే బంతిని కొడుతుంటే బౌండరీలు దాటిపోయి క్షణంలో సెంచరీ పూర్తయింది!

'అబ్బే! అబ్బాయికేమండి. లక్ష

చిన్ననాటి స్నేహితుడు వెంకయ్య వచ్చాడనివినగానే, రత్తయ్య, అర్ధరాత్రి అని అయినా ఆలోచించకుండా, లాంతరు పుచ్చుకొని, మూడు మైళ్ల దూరమూనడిచి పొరుగూరికి వెళ్లాడు. బాగా రెండు మూడు గంటలసేపు మాట్లాడి, మళ్ళీ వెనక్కి నడిచివచ్చి తనయింట్లో పడుకొన్నాడు.

మరునాడు తెల్లవారేసరికి వెంకయ్యగారి పాలేరొకడు లాంతరు పట్టుకొని రత్తయ్యగారి వాకిట్లో ప్రత్యక్షమయ్యాడు. రత్తయ్యగారు వీధిలోకి రాగానే—

"ఇదిగో నండీ; తమరి లాందరు. రాత్రి మాఅయ్యగారి యింటికాడ తమరు యిది ఒగ్గేసి, ఆరి సిలక పంజరం పట్టుకొచ్చేసి నారంటగా?" అన్నాడు.


కేశముల సౌందర్యాభివృద్ధికి
కాష్మీర్-కుసుమ్
ఇష్టమైన నూనెలో నానబెట్టుడు.
సుగంధ చర్మరక్షణ మలామ్
సాంటలక్స్
దురద, గడ్డలు, కాళ్లు, మొటిమలకు
ప్రేమలీలా
ప్రసిద్ధమైన మైసూర్ ఊదువత్తులు.
యునైటెడ్ కన్సర్న్ - మద్రాస్ - 1.
బ్రాంచి: విజయవాడ.



అంగవరముల బలహీనత పోగొట్టియథాప్రకారం సంతోష సౌఖ్యముల కలిగించుటకు నపుంసక తైలం రూ. 10/-; వి. పి. రూ 1/4-

యికమీదట గర్భం రాకుండా అపుటకు, లోపలికి సేవించే మందు, గర్భ విరోధిని 1 సీసా రూ. 10/- వి. పి. 1-4-0.

సిద్ధమకరధ్వజం మాత్రలు—శీఘ్ర స్ఖలనం ఆపి, కాళ్లు, నడుమునొప్పులు పోయి, ధాతుపుష్టి బలంకలిగించుటకు సీసా రూ. 10. వి. పి. 1-4-0.

కావలసినవారు రూపాయ పంపేది.

డాక్టర్. రత్నం సన్స్ మెడికల్‌హాల్,
మలకపేట, బిల్డింగ్స్ - హైద్రాబాదు.



టాప్‌సాయర్
వెల: 2-0-0
పోస్టుఖర్చులు ప్రత్యేకం.
ఆంధ్ర గ్రంథమాల
మద్రాసు-1

ణంగా ఉన్నాడు. పెద్ద చదువు చదువుతున్నాడు! అన్ని పరీక్షలూ ఫస్టుక్లాసులో ప్యాసయ్యాడు. ఇంతకంటె కావలసినదేముంది?...అయితే మరి రేపు సోమవారంనాడు వస్తాను. అబ్బాయిని తీసుకెడతాను. ఇద్దరికీ నచ్చి ఈ పెళ్ళి జరిగితే నా శ్రమ ఫలించినట్లే! ఏదో మంచి పని చేసినవాణ్ణవుతాను' అని వెకిలిగా నవ్వాడు కామయ్య.

'ఎంతమాటండోయ్! ఈ పెళ్లి మీరు జరిపించినట్లయితే మేం మాత్రం ఊరుకుంటామా? మా శక్తి కొలదీ మిమ్మల్ని సత్కరించమా?' అన్నారు వెంకయ్యగారు.

'ఎంతమాట! మీ దయ ఉండాలి కాని నాకు లోటేమిటి? మరయితే సోమవారం ఉదయం వస్తాను. అబ్బాయి నేను వెడతాం. మరి మీరు రారూ?'

'మొత్తం ముగ్గురమవుతాం' అని అడ్డు అడ్డాడు రమణ.

'సరే! మీరిద్దరూ వెళ్ళండి. నచ్చితే అప్పుడు చూసుకుందాం'

'నేను తలపెట్టటం - జరక్కపోవటమూనా' అని కామయ్య గర్వంగా నవ్వి సెలవు తీసుకోబోయాడు.

'ఈరాత్రి ఎక్కడకు పోతారు? ఇక్కడే పనుకోండి, తెల్లవారేక వెళ్ళవచ్చు' అని వెంకయ్యగారు అడ్డుపడ్డారు. కామయ్యకు తప్పలేదు.

మరో పదిహేను రోజులు పోయాక పెళ్ళికూడా దిగ్విజయంగా జరిగింది. ఇంతకీ విచిత్రమేమిటంటే కామయ్య పెళ్ళికూతురు తరఫువారిని గురించి వెంకయ్యగారి ముందు అఖండంగా వర్ణించాడు. అవన్నీ కోతలని వెంకయ్యగారికి తెలుసు. కామయ్యకూ తెలుసు. ఇలాగే పెళ్ళికూతురు తరఫువాళ్ళదగ్గర వెంకయ్యగార్ని గురించి, రమణనుగురించి, అమోఘంగా కోసుంటాడు. అవన్నీ కోతలని పెళ్ళికూతురి తరఫువాళ్ళకీ తెలుసు. కాని పెళ్ళయిపోయింది. ఆ కోతల్ని గురించి ఇరుపక్షాలవారూ ఎత్తలేదు. అదీ ఆశ్చర్యం! అందుకే గాబోలు పెద్దలు 'వెయ్యి అబద్ధాలు ఆడితేనే కాని ఓ పెళ్ళి కాదని' సామెత చేసి పారేశారు.

ఒకనాడు రమణను అడిగాను:

'పెళ్ళి చేసుకోనని భీష్మించుకుని కూర్చున్నావే! హఠాత్తుగా వేడికి మంచు కరిగినట్టు నీ ప్రతాపం, ప్రమాణం అన్నీ పటాపంచలయ్యాయే!' అని.

'చాన్సు వచ్చినప్పుడు వదల కూడదు గురువుగారూ! వాళ్లు చదివిస్తామంటున్నారు. అనవసరంగా ఆపర్ట్యునిటీని ఎందుకు వదలాలి? అన్ని ఆశయాలనూ నువ్వన్నట్టుగా ఆచరణలో పెట్టగలమా?' అని నా పాఠం నాకే వప్పజెప్పాడు.

నేను తెల్లబోక చేసేదేముంది?

కామయ్య గుర్తుకు వచ్చినప్పుడల్లా 'పెళ్ళంటే మాటలా?' అనిపిస్తుంది. ★




ఎండగా యున్నా ఉల్లాసంగా ఉండండి!

ఎండ గాడ్పులలో జీర్ణకోశం మందంగా ఉంటుంది—అప్పుడు శరీరమందలి విషమాలిన్యములు నిలువయై ఒళ్లంతా భారంగా బద్ధకంగా నిరుత్సాహంగా ఉంటుంది. తళతళ మెరయు ఈనోస్ "ఫ్రూట్ సాల్ట్‌ను" పుచ్చుకొనుడు—అది ఎంతో ఉల్లాసము నిస్తుంది! దాని సౌమ్య విరేచక గుణము అపాయకరమగు మాలిన్యములను వెలువరించుటలో సహాయపడి, మీకు చల్లదనమును, ఉత్సాహమును, సంతోషమును, కల్గించును.

ఈనోస్ 'ఫ్రూట్ సాల్ట్'

చల్లదనానికి మరియు మంచి ఆరోగ్యానికి

తాజా గుణము చిరకాల ముండుటకుగాను సీసాలలో అమ్మబడును

"ఈనో" మరియు "ఫ్రూట్ సాల్ట్" అను మాటలు రిజిష్టర్డు ట్రేడ్ మార్కులు

ENO 6813

# కథ చేసిన మేలు

శ్రీ యర్రామురళీ కృష్ణమోహన్

ఇది ఏప్రిల్ నెల. ఊరందరిది ఒకదారి ఉలిపికట్టె దొక దారినట. అన్ని కాలేజీల్లోనూ మొదటి సంవత్సరం వాళ్లకు ముందయిపోతాయి పరీక్షలు. మా కాలేజీలో మాత్రం యూనివర్సిటీ పరీక్షలయ్యాక ఈ నెలలోనే అయ్యాయి.

నిన్న సాయంకాలం వరకూ ఎండెండు నెదకి మాడిన అందంగా అగుపించిన కాలేజి విద్యార్థులు అదేమి చిత్రమో ఈ వాళ సాయంత్రానికి ఒక్కడూ అయిపులేడు. ప్రొద్దుట పరీక్షలయ్యాయి. సాయంకాలానికి ఒకడైనా కలిపిస్తేనా! వీళ్ళంతా అంత యమర్జంటుగా వెళ్ళి, ఏ పెద్ద గుజ్జాలకు పళ్లుతోమాలో కాని.

కాలక్షేపం కావటం కష్టంగానే వుంది. మా లైబ్రరీకి కొత్తపుస్తకాలయితే వచ్చి మూడు నెలలైందికాని వాటని చదివే భాగ్యం మాకింతవరకూ పట్టలేదు. అందుచేత లైబ్రరీకి వెళ్లి ప్రయోజనం లేదు కనుక అలా పార్కుకి పోదామని బయలుదేరాను. దారిలో కిల్లీకొట్టుమీద కొత్తవారపత్రిక కనపడింది. "ఈవాళ ఏం వారం అబ్బా!" అంటూ ఆలోచించి, చివరకు సోమవారం అని ధృవపరుచుకొని "ఏమిటో! పరీక్షలయిపోతే వారాలు కూడా జ్ఞాపకం వుండటంలేదు" అనుకొంటూ వారపత్రిక కొనుక్కొని పేజీలు తిరగవేస్తూ పుట్ పాత్ మీంచి నడిచి వెళుతున్నా.

"జాగ్రత్తరోయ్! ఎవరికైనా డాష్ ఇవ్వగలవు, క్రిందచూపే కాని పై చూపు లేదా!" అనటం నా వీపుమీద ఒక్క చరుపు పడటం ఒక్కసారే జరిగాయి. ఎవరా అని వెనక్కు తిరిగాను. కృష్ణమూర్తి కనుపించాడు. కృష్ణమూర్తి, మేం నరసాపురంలో వుండేటప్పుడు మా ఇంటి ఎదురింట్లో వుండేవాడు. మేం ఇద్దరం టైలర్ హైస్కూల్లో ఎస్. ఎస్. ఎల్. సి ఒక్కసారే పాసయ్యాం. నేనా తరువాత ఇక్కడికి వచ్చి కాలేజీలో చేరాను. కృష్ణమూర్తి ఉద్యోగంలో చేరాడు.

"ఇపుడెక్కడ వుంటున్నావ్ రా!"

"అక్కడే!"

"ఏం ఇలా వచ్చావ్; ఎవరైనా బంధువులున్నారా!"

"చిన్న పనిమీద వచ్చాలే; పరీక్షలయిపోయాయా?"

"ఆఁ!"

"రా, కాఫీ తాగుదాం" అంటూ రవీంద్రలోకి లాక్కుపోయాను. కాఫీ తాగి బయటికి వచ్చేసరికి "వార్తలు చదువుతోన్నది. పణ్యాలరంగనాథరావు" అంటూ రేడియో నుంచి వినపడుతోంది.

ఇద్దరం నెమ్మదిగా పార్కు చేరాం. ఆసనం చూసుకొని కూర్చునేసరికి "ఇక వివరాలు" అంటోంది రేడియో.

నా చేతిలో పత్రిక లాక్కొని బొమ్మలు చూస్తూ "ఎందుకురా ఈ ఇయింట్ మెంట్? ఏ లైబ్రరీకన్నా వెళ్లి చదువుకొంటే. వదిలిపోయేదానికి" అన్నాడు కృష్ణమూర్తి.

"సరిలే; లైబ్రరీకి వెళ్లి చదివినట్టే. ఎంత ముందుగా వెళ్లినా ఎవడో ఒకడు దీన్ని గుత్తకుపుచ్చుకుని కూర్చుంటాడు. ఇక ఆ మహానుభావుడు దాన్ని వదలడు. అందులోనూ, తన చేతిలో పుస్తకంకోసం ఇంకో వ్యక్తి కాచుకొని కూర్చున్నాడని తెలియగానే, లైబ్రరీ మూసే వేళకు కాని ఆ వ్యక్తి ఆ పత్రికని వదలడు. ఇలాంటి వ్యక్తులు కాక, ప్రతి లైబ్రరీకి కొందరు అభిమాన పుత్రులు వుంటారు. మొట్టమొదట లైబ్రరీకి వచ్చిన ప్రతిపత్రిక వాళ్ళు చదవందే మరొకరు చదవలేరు. ఇన్ని గండాలూ దాటి పుస్తకం మన చేతికి వచ్చేసరికి మళ్ళీ సోమవారం రానే వస్తుంది. ఎందుకొచ్చిన బాధ ఇదంతా, కొనుక్కొంటే తీరిపోతుంది" అన్నాను.

"అది నిజమే!......ఈ కథలు కేవలం కాలక్షేపానికే నంటావా?" అన్నాడు వాడు.

"కాకపోతే, శాస్త్ర విజ్ఞానం కూడా ప్రసాదిస్తాయి."

"అదీ కాక, ఈ కథలు మనమీద కొంత ప్రభావం చూపెడుతుంటాయి" అన్నాడు కృష్ణమూర్తి.

"అదెలాగ?"

"అదెలాగో చెప్పనా?" అంటూ కృష్ణమూర్తి చెప్పటం ప్రారంభించాడు.

ఇది నిజంగా జరిగిన సంగతి, ఇదేం కథనుకోకు. వాళ్లు చాలా భాగ్యవంతులు. ఆ ఇంటి యజమాని రామయ్యనాయుడు గారికి రెండు వందల యకరాల పొలం వుందని ఆ వీధిలో అంతా అనుకుంటారు. వాళ్లు మాత్రం రెండువందల యాభై యకరాలని చెప్పుకుంటారు. వాళ్ళు భాగ్యవంతులు కనుక వాళ్ళకి ఓ కారు వుందని, వాళ్ళ ఇల్లు ఒక మహాసౌధం అని, వాళ్ల ఇంటి కిటికీలకు, గుమ్మాలకు తెరలుంటాయని, ఇంటిముందు చిన్న వనం వుంటుందని ఎవరయినా అనుకొంటే పూర్తిగా పొరపడ్డట్టే!

రామయ్యనాయుడుగారికే కాక ఆ ఇంట్లో అందరికీ డబ్బుకి ప్రాణానికి లంకె. ప్రపంచంలో అవసరాలకు డబ్బు కర్చుపెట్టని పిసనారివాళ్లు చాలామందివుంటారు. కాని, రామయ్యగారి కుటుంబం అవసరాలకు డబ్బు ఖర్చు చేయరు సరికదా, ఇతరులు ఖర్చుపెట్టటం చూసికూడా సహించలేరు.

పిసనారివాళ్లకూ కొన్ని తప్పనిసరి ఖర్చులుంటాయి. రామయ్యనాయుడుగారు వార పత్రికలు, మాసపత్రికలు కొని విధిగా చదువుతుంటారు. చాలామందిలో ఒక అభిప్రాయం వుంది; యువకులే కాని వయసు మళ్ళినవారు కథలు, నవలలు చదవరని. అది కేవలం అపోహ అని రామయ్యనాయుడు గారు ఋజువు చేశారు

ఇక రామయ్యనాయుడుగారి కుటుంబ పరిస్థితి; నాయుడుగారికి ముగ్గురు ఆడసంతానం, ఒక మగసంతానం. కొడుకు ఇంటర్మీడియట్ క్లాసులో పార్ట్ త్రీతో కుస్తీ పడుతున్నాడు. కూతుళ్ళిద్దరూ పెళ్లికి సిద్ధంగా వున్నారు. రామయ్యనాయుడుగారు, పెద్దమ్మాయి పెళ్ళి చేయాలని అయిదేళ్ళనుంచి ప్రయత్నమట కానీ ఇంతవరకూ ఆయన సఫలుడు కాలేకపోయాడు.

కిట్టనివాళ్లెన్నో అనుకుంటారు రామయ్యనాయుడుగారి గురించి.

"అప్పుడే ఏం తొందరమ్మా. ఇప్పుడే పెళ్లిచేస్తే పదివేలూ ఈనాడే అల్లుడికియ్యవలసి వస్తుంది. రెండుమూడేళ్ళాగితే ఆ

పదివేలుపై రెండుమూడు వేలన్నా. వడ్డీ రాకమానదు, అది పెట్టి పెళ్లి చెయ్యొచ్చు, అసలు అలాంటి దేమయినా చెయ్యదల్చు కొంటేను!" అని అమ్మలక్కలు చెప్పుకోవటం ఒకసారి నేనుకూడా వినటం జరిగింది.

ప్రపంచంలో ఆడపిల్లల పెళ్లిళ్లు చేయలేక బాధపడేది డబ్బు లేనివాళ్లు. కట్నాలు ఇవ్వలేక, తామిచ్చే కట్నాలకు సరైన వరుడు దొరకక బాధపడటంవుంది. కానీ డబ్బు పేరబెట్టున్న రామయ్యనాయుడు గారి వంటి ధనికుడు కూతురు పెళ్లిచేయటానికి ఎందుకు వాయిదాలు వేస్తున్నాడా అని ఆ వీధివారంతా ఆశ్చర్యపోవటంలో తప్పేముంది?

ఒకరిద్దరు "అమ్మాయిగారి పెళ్లెప్పుడండి" అని అడిగి రామయ్యనాయుడుగారిచేత ముఖం వాచే చివాట్లు తిన్నట్టు కథలు వున్నాయ్. అందుచేతనే ఆ ప్రసక్తి ఆయన ముఖంముందు తేవటానికి ఎవరికీ దమ్ములుండేవికావు.

ఇలా వుంటోండగా, ఒకనాడు రామయ్య నాయుడుగారి ఇంటిముందు కూలీలు పందిర వేయటం ప్రారంభించేసరికి అక్కతంబేమో తెలియక ఆ వీధివారంతా నోళ్లుతెరచి అలా చూస్తూవుండిపోయారు. చివరకు తర్జనభర్జనలమీద ఆ వీధివారు గ్రహించిందేమంటే రామయ్య నాయుడుగారి అమ్మాయి వివాహం అని.

రామయ్యనాయుడుగారి అమ్మాయి వివాహం జయప్రదంగానే ముగిసింది. కట్నం కొంత బకాయివేద్దామని నాయుడుగారు ప్రయత్నించారుకాని, అల్లుడు పీటలమీంచి లేచిపోతే ఇంట్లోకి వెళ్లి తక్కిందికూడా తెచ్చిఇచ్చాడాయన.

రెండురోజుల తరువాత, ఆవేళ సాయంకాలం నేనూ నా రూమ్‌మేట్ రామం తూర్పు లాకుల దగ్గరకు వెళ్ళాం. షికారు పిచ్చాపాటీ మాట్లాడుకొంటూ. తిరుగుముఖం పట్టేసరికి మసగమసగ చీకటి పడింది. రైల్వేస్టేషన్ సమీపానికి వచ్చేసరికి మాకు ముందు ఇద్దరు వ్యక్తులు వెళుతున్నట్టు గమనించాం. అందులో ఒకాయన "టక్...టక్" మంటూ శబ్దం చేసుకొంటూ చేతికర్ర సహాయంతో నడుస్తున్నాడు. ఇంతలో ఒకాయన సన్నగా దగ్గి "మా అమ్మాయి పెళ్ళి ఇంత అకస్మాత్తుగా చేయటం చూసి మా వీధివాళ్లెంత ఆశ్చర్యపోయా రనుకున్నావ్" అన్నాడు. ఆ కంఠస్వరం మాకు చిరపరిచితమయినదిగా వినిపించింది.

"అలాగా!" అన్నాడు రెండో వ్యక్తి.

"కారణం ఏమిటో తెలుసా?" అన్నాడు మొదటివ్యక్తి మళ్ళీ.

"ఏమిటి!"

"నేను కథలు, నవలలు చదువుతోంటాను నీకు తెలుసుగా; నాకు చిన్నప్పటి నుంచి అదో అలవాటయిపోయింది. మొన్న వారం పత్రికలో "ఎవరిది తప్పు?" అన్న కథ చదివాను. నామనస్సంతా కెలికినట్టయిపోయింది. కీడెంచి మేలెంచాను. మా అమ్మాయిపెళ్ళి అనుకోకుండా చేయటానికా కథే కారణం."

"అలానా!" ఆ పత్రిక నీదగ్గర వుందా" అన్నాడు రెండో వ్యక్తి.

"ఆఁ! వుంది, నువ్వుకూడా చదువుదువుగానిలే."

మేం ఇద్దరం ఊపిరి బిగపట్టి వింటున్నాం. పెద్ద హత్యారహస్యం పొంచి వింటున్నట్టు.

ఆ ఇద్దరు వ్యక్తులు సినిమాహాలు దాటి వంతెనమీంచి రోడ్డు పట్టారు. ఆ వంతెన కిళ్లీ దుకాణాలనుంచి ప్రసరిత మవుతున్న ట్యూబులైట్ల కాంతిలో ఆ ఇద్దరు వ్యక్తులు మాకు స్పష్టంగా అగుపించారు. ఆ ఇద్దరూ; ఒకరు రామయ్య నాయుడుగారు, రెండు పెళ్ళికి వచ్చి రామయ్యనాయుడిగారి బలవంతంమీద వున్న ఆయన చిన్ననాటి స్నేహితుడు గోవిందరావుగారు.

దారిలో కనబడితే, ఆ వారం పత్రిక కొనుక్కొని వెళ్ళాం. రామయ్యనాయుడుగారు చెప్పిన కథ చదివాను.

ఒక డబ్బుగల వ్యక్తి తన దర్జాకు తగ్గ వరుడు దొరక్క కూతురుపెళ్లి చేయటానికి కాలవిలంబన చేస్తోంటాడు. ఆ అమ్మాయి సహజమయిన తన కోరికలను ఎప్పటిదాకానో అణచుకోలేక - తీర్చుకొంది. ఫలితంగా పాపాయి పుట్టే సూచనలు కన్పించాయి. ఆమె తన ప్రియుడితో వెళ్లిపోయింది, పాలసముద్రంవంటి ఆ ఇంటివారి వంశానికి మాయని మచ్చను వదలి. కూతురుకోసం బెంగపెట్టుకొని తండ్రి మంచం పట్టి మరణించాడు" ఇదీ సంక్షిప్తంగా ఆ కథ.

రెండు మాసాల తరువాత ఒకనాడు పోస్టుమేన్ రామయ్య నాయుడిగారి అమ్మాయి పేర ఒక మనియార్డర్ తెచ్చాడు. ఆ అమ్మాయి అప్పుడు అత్తవారింట్లోవుంది. రామయ్యనాయుడుగారు కూడా సమయానికి ఇంట్లో లేకపోవటం జరిగింది. నేను ఎవరు పంపారా మనియార్డరని చూశాను. "మా పత్రికలో ప్రచురించబడిన "ఎవరిది తప్పు?" అను మీ కథానికకు ఈ మొత్తం పారితోషికంగా పంపడమైనది. అందినట్లు వ్రాయండి" అని వుంది ఆ మనియార్డరు కూపనుమీద అని ఆగాడు కృష్ణమూర్తి. నేను ఆశ్చర్యపోయాను కాసేపు.

"మరి ఆ అమ్మాయి పేరు పత్రికలో పడలేదూ?" అన్నాను.

"లేదు. కాంతం అని పడింది. ఆమె పూర్తిపేరు సూర్యకాంతం. ఈ కాంతం తన కూతురు సూర్యకాంతం అని రామయ్య నాయుడుగారెలా అనుకొంటాడు."

"రామయ్యనాయుడిగారి గురించి ఇంత విపులంగా చెప్పావ్, ఆయనతో నీకుగల సంబంధం ఏమిటి?" అనడిగాను.

"ఆయన ఇంటి వీధి గదిలో నేనూ, మా ఆఫీసులో ఇంకో గుమాస్తా రామం అద్దెకుంటేవాళ్లం" అంటూ కృష్ణమూర్తి పక్క దులుపుకొంటూ లేచాడు. "ఇంతటితో నేటి గ్రామస్థుల కార్యక్రమం సమాప్తి" అంటోంది రేడియో. కథ చేసిన మేలు తలుచుకొంటూ పార్కునుంచి బయటపడ్డాం ఆవేళ. 

మిలిటరీ లారీ వొకటి పిచ్చెత్తినట్లు ప్రతి పల్లెకూ తిరిగి తిరిగి చీకటిపడే వేళకు మళ్ళీ కాంపుకు కాబోలు పోతున్నది. ఇంతలో రోడ్డుమీద ఎవడో రెండు గాడిదలను నడిపించుకు పోతూవుండడం ఆడ్రైవరు కంటబడింది. వాడి దగ్గరకు పోయాక లారీ స్పీడు తగ్గించి "ఏం సోదరా? వాళ్లిద్దరూ నీ అన్నదమ్ముల్లా వున్నారే? అదేం పాపం-వాళ్లిద్దరి మెడలకీ తాళ్లుకట్టి నడిపించుకు పోతున్నావేం?" అన్నాడు ఆడ్రైవరు.

"ఆ మరేంలేదు - ఈగాడిదలు కూడా మిలిటరీలో చేరిపోతాయేమో నని!!" అని సమాధానం యిచ్చాడు, రోడ్డుమీద నడిచిపోతున్న మనిషి.

# శిథిల మందిరం

ఆరేళ్ళనుంచి తాలూకా ఆఫీసులో అటెండరు పని చేస్తున్నా, కామేశ్వరరావుకి ప్రమోషనే కాలేదు, చేస్తున్న ఉద్యోగంకూడా ఖాయం కాలేదు. రోజు రోజూ క్రుంగిపోతున్నాడు. తెచ్చుకునే జీతంరాళ్ళు నెలలో ఇరవైరోజుల కయినా రావడంలేదు. భార్యను, తన ఇద్దరు పిల్లలతో సహా పుట్టింటికి పంపేద్దామనుకుంటే, రైలు కర్చులకుకూడా డబ్బు మిగలనందువల్ల ఏ నెల కానెల ఆమె ప్రయాణం, వాయిదా పడుతూనే ఉంది. ఏమి చేయడానికీ మతి పాలుపోవడంలేదు. స్కూలు ఫైనలు ప్యాసయినా సర్వీసు కమిషన్ ప్యాసయితేనే గాని తనకు గుమాస్తా ఉద్యోగం దొరకదని అతనికి తెలుసు; కాని, అతని మనసు బండబారిపోయింది. సర్వీసు కమిషన్ ప్యాసవుదామన్న ధ్యాస కూడా అతనికి లేదు. బంట్రోతుజీతంకన్నా తక్కువా, గుమాస్తా పనికన్నా ఎక్కువా అయిన, ఆ అటెండరు ఉద్యోగాన్నే ఈ ఆరేళ్ళనుంచీ చేస్తున్నాడు.

ఆవేళ శనివారం. కామేశ్వరరావు అధికారులకు వెళ్ళే ఉత్తరాలకు సర్వీసు స్టాంపులు కూడా విడిగా అంటిస్తున్నాడు. ఆఫీసులో గుమాస్తాలు ఎవరి పని వారు చూచుకుంటున్నారు. తహసీల్దారుగారు కూడా ఆఫీసు గదిలో కూర్చొని హెడ్ గుమాస్తా తయారుచేసిన ప్రోగ్రెస్ రిపోర్టు చదువుకుంటున్నారు. ఇంతలో పోస్టు బంట్రోతు తహసీల్దారు గదిలోకి వచ్చి, "కామేశ్వరరావు ఎవరండీ?" అని తన చేతిలోని టెలిగ్రాంని ఒకసారి చూచుకున్నాడు.

"అటెండరు; లోపల ఉంటాడు వెళ్ళు" అని తహసీల్దారు మళ్ళీ తన కాగితాల వేపు దృష్టి మళ్ళించాడు.

పోస్టుబంట్రోతు యిచ్చిన టెలిగ్రాం కామేశ్వరరావు చదువుకొని, తన కళ్ళను తానే నమ్మలేక మళ్ళీ చదివాడు, మళ్ళీ చదివాడు. నాలుగయిదుసార్లు గబగబ చదివాడు. పోస్టుబంట్రోతుకి ఏమయినా ఇద్దామని జేబులు తడుముకున్నాడు; కానీ కూడా దొరకలేదు. ప్రక్కనున్న గుమాస్తాను ఒక పావలా బదులు అడిగాడు. అతను ఒకఅణా ఇచ్చాడు. ఆ అణా పోస్టుబంట్రోతుకిచ్చి "రేపు మళ్ళీ కనపడు." అని కామేశ్వరరావు మళ్ళీ టెలిగ్రాం చదువుకున్నాడు. ఇంతలో ఆఫీసు బంట్రోతువచ్చి తహసీల్దారుగారు పిలుస్తున్నారని చెప్పి కామేశ్వరరావుని తీసుకుపోయాడు. కామేశ్వరరావుని చూడడంతోనే తహసీల్దారు, "ఏమోయ్! టెలిగ్రాంలు తెప్పించుకుంటున్నావు; ఏమిటి కథ?" అన్నాడు.

"మా పెదనాయనగారి వద్దనుంచి వచ్చిందండీ! ఆయనకు చాలా సుస్తీగా వుందట."

"అయితే, వెళ్ళావన్నమాట!"

"ఆ! వెళ్ళాలండీ."

"నీ కింకా ఉద్యోగం ఖాయం కాలేదన్నమాట తెలుసునా?"

"తెలుసునండీ!"

"వెళ్ళడానికే నిశ్చయించుకున్నావా?"

"తప్పదు వెళ్లితీరాలండీ."

శ్రీ వంటెత్తు

"నీదగ్గర ఉన్న రికార్డు పూర్తిగా హెడ్ గుమాస్తాకు అప్పజెప్పి మరీ వెళ్ళు."

"అలాగేనండి."

"ఎరియర్సు పూర్తిజేయాలి."

"తిరిగి వచ్చాక పూర్తిచేస్తానండి."

"అలా కుదరదు. ఎరియర్సు పూర్తిచేయకుండా వెళ్ళావంటే, నీ ఉద్యోగం ఊడిపోతుంది; తెలుసునా?"

"పోనీలెండి." అని కామేశ్వరరావు అనేసరికి తహసీల్దారు నిర్ఘాంతపోయాడు. అతని నోటంట అలాంటిమాట వస్తుందని తహసీల్దారు కలలోనైనా అనుకోలేదు.

"ఏదీ, ఆ టెలిగ్రాం?" అని తహసీల్దారు కామేశ్వరరావు చేతిలోని టెలిగ్రాం పుచ్చుకొని చదివి, "అయితే, అతని ఆస్తంతా నీకు కలుస్తుందన్నమాట!" అన్నాడు.

"ఔను."

"ఎంత ఉంటుంది?"

"సుమారు అయిదులక్షలుంటుంది."

తహసీల్దారుకి నోట మాట రాలేదు. అప్రయత్నంగా అతను, "అలా కూర్చో!" అని కామేశ్వరరావుకి కుర్చీ చూపించాడు.

కుర్చీలో కూర్చోడానికి కామేశ్వరరావు తటపటాయిస్తుంటే, "మరేమీ, భయంలేదు; అలా కూర్చో! ఈవేళనుంచి నువ్వు లక్షాధికారివి కదా!" అని తహసీల్దారు మందహాసంచేస్తూ అనగానే కామేశ్వరరావు మొండి చొరవతో కుర్చీలో కూర్చున్నాడు. ఇంతవరకూ కామేశ్వరరావు చక్కగా ఉద్యోగంచేసినందుకు తహసీల్దారు అతణ్ణి అభినందించడం మొదలు పెట్టాడు. ఆఫీసు టైమ్ అయ్యేవరకూ, కామేశ్వరరావు తహసీల్దారు గదిలోనే ఉండిపోయి ఏదో పిచ్చాపాటీ చెప్పతూ కాలక్షేపం చేసి తరవాత ఇంటికి వచ్చేశాడు.

* * *

కామేశ్వరరావు టెలిగ్రాం అందిన మర్నాడే పట్నం చేరుకొని, మరణశయ్యమీద ఉన్న పెదతండ్రిని కలుసుకున్నాడు. కామేశ్వరరావు రాగానే రిజిష్టరు చేసిన వీలునామా చేతికిచ్చి అతని పెదతండ్రి శాశ్వతంగా కళ్లుమూశాడు. పెద్దలెందరో సానుభూతి సందేశాలు పంపారు. కొందరు స్వయంగావచ్చి కామేశ్వరరావుకి తమ సంతాపాన్ని, తెలిపి వెళ్లిపోయారు.

తన పెదతండ్రి చనిపోయి ఆవేళకు సరిగా పదిహేనురోజులయింది. కామేశ్వరరావు ఆఫీసుగదిలో ఒంటరిగా కూర్చొని ఏవో కాగితాలు చూచుకుంటూ ఉండగా, 200 రూ. విడినోట్లు బల్లమీదపెట్టి డబ్బు ముట్టినట్టు రశీదురాసి కామేశ్వరరావుని సంతకం చెయ్యమన్నాడు గుమస్తా రామయ్య. "ఏమిటిది?" అని కామేశ్వరరావు అనేసరికి గుమస్తా—

"హైరోడ్‌లోఉన్న మన మేడలో క్రిందభాగంలో ఉన్నవారు ఈనెల అద్దె పంపారు." అన్నాడు రామయ్య.

"మొత్తం మన మేడకు అద్దె ఎంత వస్తుంది." అని కామేశ్వరరావు అనేసరికి, "నెలకు ఆరువందలు" అన్నాడు రామయ్య.

కామేశ్వరరావు ఎందుకో ఆగిపోయాడు, మరి మాటాడలేకపోయాడు. భరించరానంత ఇంటి అద్దె యిచ్చుకుంటూన్న వాని ముఖం లాగ అతనిముఖం పాలిపోయింది.

"ఎన్నాళ్ళనుంచి వీరు ఇంత అద్దె ఇచ్చుకుంటున్నారు?" అని నీరసంగా అన్నాడు.



"అబ్బో! ఇప్పటినుంచా? పదిసంవత్సరాలనుంచి మనమేడలో మొత్తం మూడు భాగాల్లోనూ ఈ పన్నెండుగురూ ఉంటున్నారు. మనిషికి నె 1 కి 50 రూ. అయింది. ఎంత రాయితీ! ఈ ఇల్లు విడిచి పెడితే, మళ్లీ ఇలాంటి ఇల్లు వాళ్ళకి దొరకొద్దూ?" అన్నాడు రామయ్య.

కామేశ్వరరావు మాటాడకుండా ఒకనిముషం ఆగి, "సరే, మన మేడలో మొత్తం పన్నెండుగురు కదూ, ఉన్నారన్నావు?" అన్నాడు.

"ఔనండి."

"ఒక్కొక్కళ్లు 50 రూ. చొ॥న ఇస్తున్నారా?"

"ఔనండి."

"ఈ రోజు మొదలు ఒక్కొక్కళ్లు 25 రూ. కంటే ఎక్కువ ఇచ్చుకోనక్కర్లేదు. ఈ రెండు వందలూ పంపినవాళ్ళకి 100 రూ. తిరిగి ఇచ్చివెయ్యి. పై రెండు అంతస్థుల్లో ఉన్నవాళ్ళతో కూడా చెప్పు; మనిషి 1 కి నెలకు 25 రూపాయలే అని" అని కామేశ్వరరావు అనేసరికి రామయ్య ముఖం వాల్చేశాడు. కామేశ్వరరావు రామయ్యవంక చూడకుండానే తన కాగితాలు చూసుకోసాగాడు. కాస్సేపుండి, మెల్లగా రామయ్య, "అయ్యా! ఒక మాట వినాలి మీరు.. అద్ద తగ్గించమని వారు అడక్కుండానే, మీరు చెరిసగం అద్దె ఒకేసారి తగ్గించడం చాలా ప్రమాదం" అన్నాడు.

"మరేమీ, భయం లేదు. నేను చెప్పినట్టు వెంటనే చెయ్యి. వారు అడక్కుండానే, మనంతట మనమే అద్దె తగ్గిస్తే ప్రమాదమెందుకొస్తుంది? చాలా సంతోషిస్తారు."

"అలా కాదండీ! ఒక్కసారే ఇంత అద్దె తగ్గిస్తే, ఏదైనా అనుమానపడతారేమో అని నాభయం."

"ఎందుకు, అనుమానం? అద్దె తగ్గిస్తే అనుమానపడి ఇల్లు విడిచిపెట్టి పారిపోతారా? పిచ్చివాడివల్లే ఉన్నావు. లేనిపోని అనుమానాలు పెట్టుకొని బాధపడకు, వెళ్ళు. వారితో ఈవేళే చెప్పు" అని కామేశ్వరరావు మళ్లీ తన దృష్టి కాగితాలవేపు మళ్లించాడు. రామయ్య మళ్ళీ మాటాడకుండా తన యింటికి వెళ్ళిపోయాడు.

* * *

చిరబురలాడుతూ రామయ్య మంచం మీద కూర్చున్నాడు. "అన్నం పెట్టమన్నారా?" అని భార్య లక్ష్మి అడిగింది.

"ఆ! తగలెయ్యి" అని భార్యకు సమాధాన మిచ్చి కట్టుకున్న బట్టలు విప్పుకోకుండానే అతను మంచంమీద పడుకున్నాడు. లక్ష్మి అన్నం వడ్డించి రామయ్యను కేక

# శిధిల మందిరం

చేసింది. రామయ్య మనసు మనసులో లేకుండానే అన్నం తిని, ఒక నిముష మయినా ఇంట్లో కూర్చోకుండానే, వీధిలోకి వెళ్లి పోయాడు. తాను అద్దెలు వసూలు చేయ వలసిన మేడదగ్గరికి వెళ్లి, వాచరుని పిల్చి, "లోపల అందరూ ఉన్నారా?" అని అడిగాడు.

"ఏమోనండి బాబూ! లోపలికెళ్లి చూసి రమ్మన్నారా?" అని, వాచరు సమాధాన మిచ్చాడు.

"అక్కర్లేదు. నేనే వెళ్తాను." అంటూనే రామయ్య సరాసరి క్రింద అంతస్థులోఉన్న భాస్కరం దగ్గరికి వెళ్ళి, "మీ భాగంలో ఉన్న వారందరూ ఉన్నారాండీ" అన్నాడు.

"ఇప్పు డెక్కడుంటారయ్యా! సాయం కాలం ఆరు దాటాలి."అన్నాడు భాస్కరం.

"దానికేమిగాని, మీరు ఇందాక ఈ నెల అద్దె రెండువందల రూపాయలూ మా యజమాని దగ్గరికి పంపారు కదూ!

"ఔను."

రెండువందలు అవసరంలేదు. ఇక్కడ నుంచి నెలనెలా వందరూపాయలు చాలు."

"ఆ! వందరూపాయలు చాలా? ఎవ రన్నారు?" అని భాస్కరం ఆశ్చర్యంగా రామయ్యకేసి చూస్తూ అన్నాడు.

"ఇంకెవరు? మా కొత్తయజమాని! మొత్తం మూడు అంతస్థులకూ మూడువందలే పుచ్చుకుంటాడట! జరిగిన నెలనుంచీ ఈ పద్ధతి అమల్లోపెట్టమని ఆయన ఆర్డరు; కాబట్టి, మీరు పోయినసెల అద్దె రెండు వందలు పంపారు కదూ! వందరూపాయలే తీసుకున్నాడు. తక్కిన వందా ఇదిగో! తీసుకొని తక్కినవారికి ఇచ్చేయండి." అని వందరూపాయలూ రామయ్య భాస్కరం చేతిలో పెట్టాడు. భాస్కరం తన కళ్ళు తానే నమ్మలేకపోయాడు. "నెలకు పాతిక రూపాయలు! సంవత్సరానికి మూడు వందలు! అబ్బ! ఎంత సొమ్ము!" అని తనలో తానే పొంగిపోయాడు. "కాస్త కాఫీ తీసుకుంటారా!" అని రామయ్యని అడిగాడు గాని, "తర్వాత, వస్తాను లెండి." అంటూ రామయ్య వెళ్లిపోయాడు. వెళుతూ వెళుతూ, అతను "పై భాగాల్లో ఉన్నవారికికూడా చెప్పండి." అని భాస్కరాన్ని హెచ్చరించి మరీ వెళ్ళాడు.

భాస్కరానికి నిముషాలు, సంవత్సరాల్లాగ గడుస్తున్నాయి. సాయంకాలం ఎప్పుడవుతుందా, అద్దెకు ఉన్నవా రందరితోనూ ఈ శుభవార్తమానం ఎప్పుడు చెప్పుదామా, అని అతని మనసు తహతహ లాడుతూంటుంది. కింది అంతస్థులో ఉన్నవారిలో ఒకడయిన వెంకట్రావు వచ్చాడు. అతను ఆవరణలో అడుగుపెట్టగానే భాస్కరం అతని

(63-వ పేజీ చూడండి)

భర్త:- ఎందుకే? కుర్రాణ్ణి అల్లా చావ బాదేస్తున్నావ్!
భార్య:- నాలుగు సార్లు పిల్చినా మీరు పలుకరాయె! నేను మాత్రం ఏం చేయను?

—శ్రీ వి. రామారావు (రామచంద్రపురం)





R.P. 109-50 TL
రెక్సోనా ప్రొప్రయిటరీ లిమిటెడ్ వారి తరఫున ఇండియాలో తయారుచేయబడినది

# అకౌంట్సు టెస్టు

"శ్రీ. రాగి"

సుందరం పరీక్షహాలులో సరిగా ఉదయం తొమ్మిదిన్నర గంటలకు అడుగుపెట్టాడు. అతని గుండె వేగంగా కొట్టుకొంటున్నది.

సుందరం ఒక డిపార్టుమెంటులో లోయరు డివిజను గుమాస్తా. డిపార్టుమెంటులో ప్రమోషను కావాలంటే తప్పనిసరిగా అక్కౌంట్సు పరీక్ష ప్యాసు కావాలి. ఆ పరీక్ష ప్యాసుకావటం చాలా కష్టమని, కొంతమంది అయిదారు సార్లు గూడా దండయాత్ర చేశారంటే, అదొక వింతైనవిషయం కాదనీ వాడుక. అందుకే సుందరం పరీక్షకు కూర్చోడానికి తొందరపడలేదు.

కాని అప్పటికే చాలామంది తనని 'అక్కౌంట్సు పరీక్ష ప్యాసైనావా?" అంటూ అడుగుతూ వచ్చారు, అక్కడికో పరీక్షప్యాసుకాకపోతే ఆఫీసుఅక్కౌంట్సు రాని అసమర్థుడయినట్లు. కొంతమంది 'నేను 'అక్కౌంట్సు పరీక్ష' ప్యాసైనాను అని గర్వంగా చెప్పుకోటం తాననేక సార్లు విన్నాడు.

తనుకూడా పరీక్ష ప్యాసుకాకపోయినట్లయితే మర్యాద నిలచేటట్లు కనపడలేదు. అందుకని పరీక్షకు కూర్చోడానికి నిశ్చయించుకొన్నాడు.

పరీక్ష ఇంకా అయిదు నెలలుందనగానే రోజూ, ఒక గంటో రెండు గంటలో, పరీక్ష పుస్తకాలు చదవటం మొదలుపెట్టాడు. మొదలు పెట్టాడన్నమాటేగాని, ఒక రోజు చదివితే మూడు రోజులు చదివేవాడుకాదు.

పుస్తకంముందు కూర్చుని చదువుతుంటే, ఆ వెధవ ఫండమెంటలురూల్సు ఎంతితన్నుకొన్నా అర్థంగాక తన బుర్ర బ్రద్దలవుతుంటే, అపుస్తకాలు చదవాల్సొచ్చినందుకు ప్రభుత్వాన్ని తిట్టుకొనేవాడు సుందరం. సుందరానికి ఆఫండమెంటలు రూల్సుపుస్తకం చదివి అర్థంచేసుకోటం కన్నా యం. యే. పరీక్ష తేలిగ్గా ప్యాసు కావచ్చునిపించింది.

నిజంగా ఆ అక్కౌంట్సు టెస్టు ఇన్ స్ట్యూటు ధర్మాన వాళ్లు వ్రాసిననోట్సు ఉండబట్టిగాని, లేకపోతే అసలు పరీక్షలో ప్యాసయేవాళ్ళుంటారా అని సుందరానికి ఇప్పటికీ అనుమానమే.

పిడుగుకీ, తద్దినానికీ, ఒకటే మంత్రమన్నట్లు అన్ని ప్రభుత్వశాఖలలోవున్న గుమాస్తాలనందరినీ, వాళ్ళు పనిచేసే బ్రాంచీలతో సంబంధంలేకుండా, అక్కౌంట్సు టెస్టు ప్యాసుకావాలనటం ఎవరికయినా అన్యాయంగా కనుపించకమానదు.

బడ్జెటు మాన్యువలు చదవటం ఉపయోగకారిగానే కనిపించింది సుందరానికి. ఎందుకూ పనికిరాని ప్రతివాడూ అసెంబ్లీ మెంబరవుతున్న ఈ రోజుల్లో బడ్జెటును గురించి తెలుసుకోటానికి వీలైన బడ్జెటు మాన్యువలు చదవటం వృధా అనిపించదు.

ట్రావలింగు అలవెన్సు రూల్సులో పై ఉద్యోగులకు, క్రింది ఉద్యోగులకు, ఇచ్చే దినభత్యంలో ఉండే అధిక వ్యత్యాసాలు, స్వతంత్రభారతంలో ఇంకా మార్పు లేకుండా వుండటం, సుందరానికి శోచనీయంగా కనుపించింది.

కొన్ని రూల్సు ప్రభుత్వంయొక్క చాదస్తాన్ని తెలియబర్చేవిలాగా కూడ వున్నయి. ప్రతి సర్కారు ఆఫీసులో, ఆఫీసు డబ్బు దాచుకునేందు కుపయోగించే ఇనప్పెట్టెకు, భద్రంగా దిట్టమైన డబుల్ లాక్ వెయ్యటం, దాని డూప్లికేటు 'కీ' ఒక చిన్న తోలుసంచీలో బిగించి సీలువేసి దానిమీద ఆఫీసు ముద్రవేసి, ఆ సంచిని తాలూకా ట్రెజరీలో ఉంచటమే కాకుండా, ఇనప్పెట్టెను దొంగలు ఎవరూ ఎత్తుకుపోకుండా ఉండేటందుకు ! - (అంత లావు బరువు ఇనప్పెట్టెలను మోయటానికిగాని, ఎత్తుకుపోవటానికిగాని సాహసించే దౌర్భాగ్యు లుంటారేమో ? ఆలోచించాల్సిన విషయమే) - దిట్టమైన సిమెంటు దిమ్మెలో బిగించాలిట !

సుందరం అక్కౌంట్సు పరీక్ష ఇంకా రెండు నెలలుందనగా కూడా పరీక్షకు తాను వెళతానో లేదో అని అనుమానం మీదనే వున్నాడు. ఆఖరి పదిరోజులలో మాత్రం ఆఫీసుకు శెలవుపెట్టి పుస్తకాలు ముందువేసుకొని గాఢంగా చదివాడు.

సుందరం పరీక్షకు కావలసిన పుస్తకాలతో, పరీక్ష హాలులో అడుగుపెట్టి, హాలునంతా ఒకసారి కలయచూశాడు. సూటు బూటు హాటులతోనూ, అక్కడక్కడ తలపాగాలతోనూ చేతులలో రకరకాల పుస్తకాలతోనూ ఉన్న గుమాస్తాలతో హాలంతా నిండిపోయింది.

ఎవరిముఖం చూసినా, దిట్టంగా జబర్దస్తీగా చదివిన ముఖంలాగా కనపడేసరికి సుందరం గుండెల్లో పీచుపీచు మనసాగింది. అక్కడక్కడ గుమాస్తాలు గుంపులు గుంపులుగా జేరి రాబోయే ప్రశ్నలను గూర్చి తర్క వితర్కాలు చేస్తున్నారు. చాలామంది గుమాస్తాలకు అక్కౌంట్సుటెస్టు ప్యాసుకావటం కత్తిమీద సాములా కనుపిస్తుంది. దానికి కారణం ఆపరీక్ష కొంచెం కష్టమైనది కావటమూ, వాళ్ల ప్రమోషన్లు ఆ పరీక్షాఫలితంమీద ఆధారపడి ఉండటమే. అభ్యర్థులలో నాలుగోవంతు యాభయ్యోపడిలో పడినవాళ్ళుండటం గమనించదగిన విషయం.

అక్కడివాళ్లలో అందరూ, హుషారుగా నిర్భయంగా ఉన్నట్లు, తానొక్కడే పిరికి హృదయంతో వున్నట్లు, సుందరానికి


కేశ సంపదకు
RITA
రీటా
హిందూ దేశమంతటా దొరకును

# ★ అక్కౌంట్సు టెస్ట్ ★

తోచింది. తనదగ్గరవున్న అక్కౌంట్సు నోటుపుస్తకం వందపేజీలది మాత్రమే, చాలా చిన్నది. చాలామంది చేతిలోవున్న నాలుగయిదు వందల పేజీల లావాటి నోట్సు పుస్తకాలను చూసిన సుందరం గుండె బిక్కుబిక్కుమనటంలో. ఆశ్చర్యమేముంది?

కొంతమంది ఈ తడవ పరీక్ష చాలా కష్టంగా ఉండొచ్చు అని, కొంతమంది తేలికగా ఉండొచ్చుని, అంటున్నారు. 'రూల్సు అర్థమయితే సరి, కష్టమేమిటి తేలికేమిటి' అనుకొన్నాడు తను.

హాలులో తన నంబరు వేసున్న సీటులో కూర్చున్నాడు. పది గంటలయింది. వాచర్లు హాజరైనారు, ప్రశ్న పత్రాలతోనూ, ఆన్సరు పుస్తకాలతోనూ.

ముందు అందరికీ ఆన్సరు కాగితాలు పంచిపెట్టారు. హాలులో అభ్యర్థులు అనుసరించవలసిన నిబంధనలను ఒక వాచరు ఆన్సరు పుస్తకం చూసి, అందరికీ చదివి వినిపించాడు.

వాచరు చేతుల్లోనుంచి ప్రశ్నపత్రాల దొంతి కనబడుతూవుంది. అరతావు సైజు కాగితానికి రెండువేపులా ప్రశ్నలున్నట్లు దూరానికి కనపడుతూ వుంది. హాలులోని అభ్యర్థులందరూ ఊపిరి బిగబట్టి వాచరు చేతుల్లోని ప్రశ్న పత్రాలవంక చూస్తున్నారు. హాలు నిశ్శబ్దంగా వుంది.

ఆ సమయాన అభ్యర్థుల గుండెలను పరీక్షించిన యే డాక్టరైనా, అవి అసాధారణ వేగంతో కొట్టుకొంటున్నాయని చెప్పక మానడు.

ప్రశ్నపత్రాలు అభ్యర్థులకు పంచి పెట్టడం ఆరంభమయింది. ప్రశ్నపత్రాలు అందుకొన్నవారివైపు, ఇంకా ప్రశ్న పత్రాలు అందుకోనివారు ప్రశ్నార్థంగా చూస్తున్నారు.

వాచరు ఆన్సరు పుస్తకాలు పంచిపెట్టక ముందు, నోట్సు పుస్తకాలు ఎవరి దగ్గరున్నా వుంటే, తన టేబిలుమీద పడెయ్యండని హెచ్చరిక చేశాడు. అభ్యర్థులలో చాలామంది తమ నోట్సు పుస్తకాలను వాచరుదగ్గర పడేశారని మనం నమ్మవచ్చు!

అభ్యర్థులు ప్రశ్నపత్రాలను చదవటంలో దీర్ఘంగా మునిగిపోయారు. కొందరి ముఖాలు అప్పుడే వెలవెలబోవటం ఆరంభించినయి. కొన్ని ముఖాలు హాలు పైకప్పును, ఎదుటగా ఉన్న తెల్లగోడలను పరిశీలించడంలో నిమగ్నమైయున్నాయి.

సుందరం వణుకుతున్న చేతులతో ప్రశ్నపత్రం అందుకొన్నాడు. రెండు నిమిషాలలో పేపరు పైనుంచి క్రిందికి చూసేడు. ఇచ్చిన నాలుగు ప్రాక్టికలు లెక్కలూ తనకు తెలిసినవే. థియరీలో అక్కడక్కడ కొన్ని ఉప ప్రశ్నలు మాత్రం తనకు తెలీనివి ఉన్నయి.

పేపరులో చాలామటుకు తెలిసిన ప్రశ్నలే ఉండటం సుందరానికి ధైర్యం కలిగించింది. వెంటనే ఆన్సరు పుస్తకంమీద తన నంబరు వేసి, 'ఫెషిక్స్నప్రగ్' ప్రశ్న ఆన్సరుచేయటం ఆరంభించాడు. ఆరంభించేముందు తన వాచీవంక చూసుకొన్నాడు. పది గంటల అయిదు నిమిషాలయింది. సుందరం అంతక్రితం పరీక్షలో ఎప్పుడూ వాచీ పెట్టుకొని ఎరగడు. ప్రతి పది నిమిషాలకూ వాచీవంక చూసుకోటం, టైము







అయిపోతున్నదే అని ఆదుర్దాపడుతూ ప్రశ్నలు ఆన్సరుచేయటం సాగించాడు.

ప్రశ్నలన్నీ తనకు బాగా వచ్చినవే అవటంచేత పేపరు బాగా ఆన్సరు చేయాలనుకొన్నాడు. తన సమాధానంలో ప్రతి చిన్న రూలూ విడిచిపెట్టకుండా రిఫరెన్సు ఇచ్చుకుపోతున్నాడు. నాలుగు పేజీలు చెడ వ్రాస్తే, మొదటి ప్రశ్నకు సమాధానం ఇయ్యగల్గాడు. టైము చూసుకొంటే మొదటి ప్రశ్నకే గంట పట్టింది. ఇంకా రెండు గంటలే టైముంది. మూడు ప్రాక్టికల్సు, థియరీ ప్రశ్నలు ఆన్సరుచెయ్యాలి. సుందరానికి గాభరా పుట్టింది. వ్రాయటంలో వేగం హెచ్చించాడు. ఒక్కసారి హాలులో, ఇతరుల అభ్యర్థులవంక చూసేడు. ప్రతివాడూ ఏదో బరికేస్తున్నాడు. సూపరింటెండెంటు మధ్య మధ్య రూములోకి వచ్చి అనుమానం కలిగిన అభ్యర్థులవంక పరిశీలనగా చూసి, ఋజువు దొరక్క తిరిగి ప్రక్క రూముకు పోతున్నాడు. వాచరు ప్రవర్తన అభ్యర్థులకు, - అలవాటున్న వాళ్లకి మాత్రమే - కాపీ కొట్టడానికి అనుకూలంగా వుంది.

'లీవు యకౌంటు' ప్రశ్న సాల్వు చేయటం మొదలుపెట్టాడు. నాలుగు స్టెప్సు ఆన్సరు చేశాడు. ఇంకా రెండు స్టెప్సు ఆన్సరు చేస్తేగాని పూర్తి ఆన్సరు రాదు. ఇప్పటికి సుందరం బుర్ర వేడెక్కింది. మొదటి ప్రశ్నకే వ్రాయాల్సిన దానికంటె యెక్కువరాసి టైము పాడుచేశా ననుకొంటున్న సుందరం రెండో లెక్కలో మొదటి నాలుగు స్టెప్పూ చాదస్తంగానే ఆన్సరు చేశాడు. అంటే తనకు వచ్చిన ఆన్సరు సరియైనదో కాదో మెస్టెప్ కాస్టెప్ సరి చూసుకొంటున్నాడు. టైము చూసుకొంటే దాదాపు రెండుగంటలు పూర్తికావచ్చింది. గాభరాగా లీవు అకౌంటులో తికమకలు పడ్డాడు. అక్కడికా ప్రశ్న వదిలేశాడు.

తరువాత 'టి. ఏ' రూల్సు లెక్క చేశాడు. తరువాత జీతాలబిల్లు లెక్క తీసుకొన్నాడు. అప్పటికి టైము నలభై అయిదు నిమిషాలే మిగిలింది. అణాలు పైసలుతో లెక్క వేసుకొంటూ చేస్తే లాభం లేదని, పేబిల్లు స్కెలెటనుమాత్రం చూపించి వదిలిపెట్టాడు. తరువాత 'యావరేజి పే' ప్రశ్న తీసుకొని అయిదు నిమిషాలలో పూర్తిచేశాడు. కాని సమాధానం అనుమానంగా వుంది.

ఇంకా అరగంట వుంది. ఆ అరగంటలో తనకు తెల్సిన థియరీ ప్రశ్నలకు సమాధానం చెడామడా వ్రాశాడు. చివర చివర సుందరం దస్తూరీ మరీ అధ్వాన్నంగా తయారయింది. తిరిగి చదువుకొంటే సుందరానికే అర్థమయేటట్టు లేదు.

మూడో గంటలో సుందరం తను ప్యాసవుతాననే విషయంగూర్చి నిరాశ చేసుకొన్నాడు. ఇంకా అరగంట టైముందనగా తను తప్పటం ఖాయమనుకొన్నాడు. మరొకసారి పరీక్ష ఫీజు పదిరూపాయలు ముడుపు చెల్లించాలి గదా అని విచారపడ్డాడు. నాలుగు యడిషను షీట్సునిండా చెడామడా వ్రాసేశాడు సుందరం. మొత్తం సుందరం వ్రాసిన పేజీలు పన్నెండయినయి.

ఆఖరి బెల్లు కొట్టారు. వాచరు సుందరం చేతిలోనుంచి కాయితాలు లాక్కొన్నాడు.

పరీక్ష అయిపోయినతర్వాత అంతా అక్కడక్కడ గుమికూడి తాము వ్రాసిన సమాధాలనుగురించి చెప్పుకొంటున్నారు.

వాళ్లలో ఒకడు "పరీక్ష చాలా తేలికగావుంది, ఇప్పుడు ప్యాసుకాలేని వాళ్ళు ఇంకెప్పుడూ ప్యాసుకాలేరు" అని అన్నాడు. సుందరానికి ఆ ముక్క బాణంలా గుచ్చుకొంది.

ఇంకొకడు "పేఫిక్సేషను ప్రశ్న నేను పది నిమిషాలలో చేసేశాను" అన్నాడు. మరి ఆ ప్రశ్న ఒక్కటే తనకు గంటకుపైగా ఎట్లా పట్టిందా అని సుందరం ఆశ్చర్యపోయినాడు.

పరీక్ష ఆరంభం కాకముందే దుడిసులుగా వున్న వాళ్లలో చాలామంది ఇప్పుడు హుషారుగా వున్నారు. అక్కడికి చేరిన వాళ్లలో మూడువంతులమంది తాము బాగా వ్రాశామని, తప్పకుండా ప్యాసవుతామనే అభిప్రాయం వెల్లడించారు. కొంతమంది తాము పేపరు అంతా ఆన్సరు చెయ్యగా పది, పదిహేను నిమిషాలు టైము మిగిలిందన్నారు. అది ఎలా సాధ్యమో సుందరానికి అర్థం గాలేదు.

సుందరం మొహం చూసిన వాళ్లెవరైనా, సుందరం పేపరు తగలేశాడని తేలికగా ఊహించగలరు. నిజానికి ఇంత తేలిక అయిన పేపరు (మెజారిటీ అభిప్రాయంలో) చెడగొట్టినందుకు సుందరం ఎంతగానో బాధపడుతున్నాడు. సుందరానికి ఒక్క నమ్మకం మాత్రముంది. అక్కడికి పరీక్షకొచ్చిన అయిదారువందలమందిలో మొదటి పేఫిక్సేషను ప్రశ్న తను వ్రాసినట్లు ఎవరూ వ్రాసిఉండరని, ఆ ప్రశ్న పూర్తిగా ఎగ్జామినరును 'ఇంప్రెస్' చేస్తుందనే నమ్మకం సుందరానికుంది. ఏమయినా సుందరానికి మొత్తంమీద తను ప్యాసవుతాననే విషయం నమ్మదగినదిగా కనుపిం


కేసరి రత్నత్రయము

**లోధ్ర**

గర్భాశయ రోగ నివారిణి

స్త్రీల వ్యాధులన్నింటికి, హిస్టిరియా. కీళ్ల నొప్పులు, నిద్రలేకపోవడం. అజీర్ణం. మలబద్ధకం, దగ్గు, ఉబ్బసం, తలనొప్పి, నడుంనొప్పి మున్నగువాటికి శ్రీరామరక్ష.

**అమృత**

రక్తాన్ని పరిశుభ్ర పరచగల దివ్యౌషధం

పాండువ్యాధి, అజీర్తి మలబద్ధకం బ్రెయిన్-ఫాగ్. అశక్తత, జ్ఞాపకశక్తి విహీనత, మందబుద్ధి, చర్మరోగాలను ఇట్టే కుదురుస్తుంది.

**అర్క**

జ్వర రోగ నివారిణి

ఇన్ఫ్లూయెంజా. టైఫాయిడ్, మలేరియా మున్నగు అన్నిరకముల జ్వరములకు దివ్యౌషధం. స్ప్లీన్ లివర్ వ్యాధులకు కూడా శ్రీరామరక్ష.

కేటలాగు కొరకు వ్రాయండి.

**కేసరి కుటీరం లిమిటెడ్**

రాయపేట : మద్రాసు-14.

ఒరిస్సా, నైజాము. ఆంధ్ర. తమిళ జిల్లాలకు ఏజంట్లు

**శ్రీ సీతారామ జనరల్ స్టోర్సు**

బరంపురం. సికిందరాబాద్. బెజవాడ మధుర.



అమృతమువంటి

**అనంగప్రభాయాకుతి**

సుందరమైన యౌవ్వనానికి. ప్రకాశవంతమైన తేజస్సుకు. ఉత్తమమైనది. ధాతువును గట్టిపరచి వృద్ధిచేయును బలహీనతచెందిన నరములకు శక్తిని, పటుత్వమును చేకూర్చును. సుఖమైన దాంపత్యజీవితమునకు ఉత్తరవాదముగలసంజీవి.

30 మాత్రలు రు. 10, 15 మాత్రలు రు. 5.

**మదన మంజరి ఫార్మసీ**

184, చైనాబజారు రోడ్డు. మద్రాసు.

బెజవాడ-శ్రీనివాస మెడికల్ స్టోర్సు-పార్కురోడ్డు

రాజమండ్రి-ఈశ్వరదాస్ & కో. మెయిన్‌రోడు

నెల్లూరు: ఆర్యన్ ఫార్మసీ-ట్రంకురోడ

ఇతర కేంద్రాల్లో ఏజెంట్లు కావాలి

#  అకౌంట్సు టెస్ట్ 

వలేదు. నిరాశతో సుందరం ఆసాయంత్రమే తన వూరు వచ్చేశాడు.

ఆతర్వాత తన నడిగిన ప్రతి స్నేహితుని తోనూ, తోడీ గుమాస్తాలతోనూ, తను పరీక్ష చెడగొట్టాడనీ, తప్పక తప్పుతాననీ, అంటూవచ్చాడు, తనమీదే తనకే నమ్మకం లేక.

ఒక వారం రోజులు మాత్రం పరీక్ష చెడ గొట్టాననే దిగులు సుందరాన్ని పట్టుకొని వేధించింది గాని తర్వాత ఆ దిగులునుంచి తేరుకొన్నాడు.

రెండు నెలలు గడిచినయి. ఆ వూరికి గజెట్ గురువారంనాడు చేరుతూ వుంటుంది. పరీక్షా ఫలితాలు పడతా యను కొన్న గురువారంనాడు సుందరం పోస్టాఫీసుకు వెళ్ళి ఒక ఆఫీసు జవానును బ్రతిమాలి గజిటు సంపాదించి పేజీలు తిరగేశాడు.

దానిలో సబార్డినేటు ఆఫీసర్ల ఎకౌంట్సు టెస్టుఫలితాలు ప్రచురించబడ్డయి. రణుకుతున్న చేతులతో గుంటూరు సెంటరు ఎదురుగా తన పేరు, నంబరు ఉన్న దేమోనని జాగ్రత్తగా వళ్ళంతా కళ్లుచేసుకొని చూశాడు. తనపేరు లేదు. అసలు చాలా కొద్ది పేర్లున్నాయి. ఎలాగూ తను అనుకొన్నదే గదా అని అనుకొని సుందరం గజిటు ఇచ్చేసి ఇంటికి వచ్చేశాడు.

ఇంటికి వచ్చినతర్వాత సుందరానికి అనుమానం కల్గింది ఆరిజల్ట్సు తనవి కాదేమోనని, గజిటులో అకౌంట్సు టెస్టు పార్టు II అని ఉంది. తను హాజరయింది యేటెస్టు ? పార్టు I లేక II నా ?

భద్రంగా దాచిపెట్టిన ప్రశ్నపత్రం తీసి చూశాడు. దానిమీద అకౌంట్సు టెస్టు, ఫర్ సబార్డినేటు ఆఫీసర్సు పార్టు ఒకటి అని వుంది. అమ్మయ్య! ఒక గండం తప్పింది. ఇంకా తను తప్పినట్లు ఋజువు కాలేదు.

తర్వాత పదిరోజులకు సుందరం స్వగ్రామం వెళ్ళాల్సొచ్చింది. మంగళవారం నాడు వాళ్ళ ఊరు వెళ్ళాడు. తిరిగి శుక్రవారం తప్ప రావటానికి వీల్లేదు. ఆ గురువారం తప్పకుండా రిజల్ట్సు పడతాయి, సందేహం లేదు.

సుందరానికి తన స్వగ్రామంలోనే గురువారం గడిచింది. శుక్రవారంనాడు కూడా తిరుగు ప్రయాణం బడలేదు. గురువారంనాడల్లా సుందరం హాయిగా గడిపాడు. తను పరీక్షలో తప్పుతానన్న దిగులు అతని కెప్పుడు లేదు. కారణం ఆ దిగులంతా అదివరకే అనుభవించాడు. ఇంక ఇప్పుడు తనకి పరీక్ష తప్పావన్న విషయం తెలిసినా తను దిగులుపడాల్సిన అవసరంలేదు.

శనివారం మధ్యాహ్నానికల్లా తనవూరు చేరుకున్నాడు సుందరం. మధ్యాహ్నం ఇంట్లో భోజనంచేసి నాలుగుగంటలదాకా పడుకున్న తర్వాత సుందరం ఆఫీసుకు బయలుదేరాడు. ఎలాగూ రిజల్ట్సు పడతాయని తనకు తెలుసు గాబట్టి, ఆఫీసులో తనకు ఎవరూ పరీక్షలో తన అపజయానికి కన్సొలేషన్సు చెప్పకముందే తనంతట తను, తన స్వంతకళ్ళతో గజిట్టుచూసి, పరీక్ష సంగతి తేల్చుకోటం మంచిదని నిశ్చయించుకొన్న సుందరం నేరుగా గజిట్ తెప్పించే ఓ ప్రింటింగు ఆఫీసుకు వెళ్లి మంగళవారం నాటి గజిటు అడిగి తీసుకున్నాడు.

వరండాలో తీరికగా కూర్చొని గజిటు పేజీలు త్రిప్పుతున్న సుందరానికి, తన పరీక్షా ఫలితాలు కనపడ్డాయి. ఫలితాలు పడ్డాయి అన్న విషయం అతని బుర్రలో ఆందోళన రేపింది.

అప్రయత్నంగానే అతని కళ్ళు సుందరం పేరుకోసం వెదకసాగినయి. సుందరానికి గుంటూరు సెంటరు కెదురుగా తన పేరు కనుపించింది! సుందరం తన కళ్ళను తను నమ్మలేకపోయ్యాడు. తప్పుతా ననుకొన్న తను ప్యాసుకావడం, ఆ లిస్టులో తను అనుకొన్నవాళ్ళ పేర్లెవరివీ లేకపోవటమే గాకుండా, చాలా తక్కువమంది పేర్లుండటం, ఆశ్చర్యమేసింది సుందరానికి. మరొక్కసారి తన పేరు నమ్మకంగా చూసుకొని గజిటు వాళ్ళ కిచ్చేసి, ఆఫీసువేపు నడక సాగించేడు సుందరం. ఆ సంతోషంలో ఎంతమంది పేర్లున్నదీ సుందరం గమనించలేదు.

సుందరం బుర్ర ఇప్పుడు పనిచేయటం మానేసింది, ఈ అనుకోని సంఘటనకి.

సుందరం నేరుగా ఆఫీసులో కెళ్లాడు. భాస్కరం తన సీటులో కూర్చొని తలొంచకుండా పనిచేసుకొంటున్నాడు.

సుందరం మెల్లిగా వెళ్లి, భాస్కరం కుర్చీవెనక నిలబడి "గుడ్ ఈవెనింగు; మిష్టరు భాస్కరం" అన్నాడు.


# కేరళ సోప్




స్నానపు సోపులు

చందనపు సోప్ || రోజ్ సోప్

మెడికల్ సోపులు

కోల్‌తార్ సోప్ || వెప్ సోప్

కుటుంబపు సోపులు

వాష్ వెల్ సోప్ (బార్లు & కేకులు) || దీపా బార్లిండు సోప్ పాత్ర సామానులకు

కేరళ సోప్ ఇన్‌స్టిట్యూట్, కోజికోడ్

మద్రాసు ప్రభుత్వపు ఇండస్ట్రీస్ & కామర్సు. డిపార్టుమెంటు యొక్క ఒక డివిజన్.

Sistas'-K S.-34.

దూరదేశం నుంచీ మద్రాసుకు వచ్చిన ఒక ప్రయాణికుడు బసకోసం ఒక హోటలుకి వెళ్లాడు హోటల్ యజమాని ఒకేఒకరూము ఖాళీ వున్నదన్నాడు కానీ, ఆ రూముకి ప్రక్కనున్న రూములో ఎవరో ఒకాయన వుంటున్నాడనీ, ఆయన ఏమాత్రం శబ్దమైనా అదిరి పడ్తాడనీ చెప్పాడు.

మరొక హోటల్‌కి పోవటం ఎందుకులెమ్మని, ఆ ప్రయాణీకుడు తానా రూములోనే వుంటాననీ, ఏమాత్రం శబ్దం చెయ్యననీ మాట యిచ్చాడు.

మాట యిచ్చాడు కానీ, తీరా రూములోకి పోయి, ఆమాట మరచిపోయి, ఒక కాలు బూటు వూడదీసి దభేలున కింద పడేశాడు. ఆశబ్దం వినేసరికి అతనికే జ్ఞాపకం వచ్చింది-రెండో కాలి బూటు వూడదీసి నింపాదిగా కిందపెట్టి అవతలరూము వైపు ఒకసారి తలెత్తి చూశాడు. సంచలనం ఏమీ కనిపించలేదు.

అరగంట గడిచాక యితని రూము తలుపు ఎవరో తట్టారు. ఇతను పోయి తలుపు తీశాడు. ప్రక్క రూములో వుండే మనిషి ప్రత్యక్షమై "ఆ రెండో కాలిబూటు ఎప్పుడు విప్పుతావు, మహాశయా?" అని ప్రశ్నార్థకంగా చూస్తున్నాడు.

పనిలో ఉన్న భాస్కరం అప్పటిదాకా సుందరం రాకను గమనించలేదు. సుందరం మాటలు విని "హాలో గుడ్ ఈవినింగ్ మిష్టరు సుందరం" అని భాస్కరం ప్రతినమస్కారం చేస్తూ "అయామ్ సారీ. మిష్టర్ సుందరం ఫర్ యువర్ ఫెయిల్యూరు ఇన్ ది యక్కౌంట్సు టెస్టు" అని విచారం వెలిబుచ్చాడు.

సుందరానికి తికమకగా ఉంది.

"మీరు అనేదేమిటో నా కర్థం కావటంలేదు" అన్నాడు సుందరం గాభరాతో.

"మొన్న గురువారం రిజల్ట్సు వచ్చినయి. మీరు ప్యాసు కాలేదని చంద్రం అన్నారు. గుంటూరులో మన ఫ్రెండు సుబ్బారావు ప్యాసయినాట్ట" అన్నాడు భాస్కరం.

"నేను ప్యాసయినానండీ. ప్యాసు కాలేదని ఎవరన్నారు?" గట్టిగానే అన్నాడు సుందరం.

"మన చంద్రం అండీ. ఆయన గెజెటంతా చూసే! మీరు పొరపాటున చూసుంటారు గెజెటు" అన్నాడు భాస్కరం.

"నా కళ్లతో నా పేరు చూస్తే లేదంటారేమిటి?" అన్నాడు సుందరం.

"ఫెయిల్యూరు లిస్టులో చూశారేమో?" అన్నాడు సందేహంగా భాస్కరం.

"మా టెస్టుకు ఫెయిల్యూరు లిస్టు అసలు వెయ్యరుగా?" అన్నాడు సుందరం.

"కావలిస్తే మీ రెళ్లి ఆ ప్రింటింగు ఆఫీసులో గెజెటు ఉంది చూసిరండి" అన్నాడు సుందరం.

భాస్కరం, సుందరం స్నేహితులలో ముఖ్యుడు. సుందరం పరీక్ష తప్పాడని చంద్రం గెజెటు చూసి చెబితే, ఎంతో విచారించాడు. ఇప్పుడు సుందరం తన కళ్లతో తన పేరు గెజెటులో ఉంది అని చెప్తుంటే నమ్మలేకుండా ఉన్నాడు. ఇందులో ఎవరివో, ఒకరి మాటలు అబద్ధం కావాలిగదా.

భాస్కరం చేతిలో పని వదిలిపెట్టి, గెజెటు చూడటానికి బయలుదేరాడు. సుందరం భాస్కరాన్ని వెంబడించాడు.

ప్రింటింగు ఆఫీసులో తిరిగి గెజెట్టు అడిగి తీసుకొన్నాడు భాస్కరం.

అక్కౌంట్సు టెస్టు ఫలితాలు వున్న పేజీ తీసేరు. సుందరం తన వ్రేలితో గుంటూరు సెంటరు కెదురుగా వున్న తన పేరు చూపించాడు. భాస్కరం దాని వంక చూస్తున్నాడు. ఇంతలో సుందరం చిన్నగా కేకపెట్టాడు. భాస్కరం సంగతేమిటన్నాడు.

"ఫస్టుక్లాసండి. నా పేరు ఫస్టుక్లాసులో వుంది. అదిగో పైన చూడండి ఫస్టుక్లాసు అని లేదూ?" సంభ్రమంతో అన్నాడు సుందరం.

సుందరం ఆనందంతో ఉక్కిరిబిక్కిరిగా తెలియకుండా వున్నాడు. తప్పుతానని అనుకొన్న తను ఫస్టుక్లాసులో ప్యాసయాడు.

"మరి చంద్రం మీ పేరు లేదని చెప్పాడేం" అన్నాడు భాస్కరం.

"ఆయన సెకండు క్లాసు చూసుంటాడు. ఫస్టుక్లాసులో పేరుంటే సెకండు క్లాసులో వెతుకుతే ఎట్లా కనపడుతుంది?" అన్నాడు సుందరం.

"అంతే...అంతే" అన్నాడు భాస్కరం.

ఫస్టుక్లాసులో గుంటూరు సెంటరు కెదురుగా సుందరం పేరున్నా, ఇంకొకతని పేరు మాత్రమే ఉన్నాయి. అంటే గుంటూరు సెంటరులో పరీక్షకు హాజరయిన అయిదారు వందల మందిలో ఇద్దరే ఫస్టుక్లాసులో ప్యాసయినారు. ఆ ఇద్దరిలో తానొకడు! మరి పరీక్ష హాలులో ఇట్లా వ్రాశాం, అట్లా వ్రాశాం, అన్నవాళ్ళంతా ఏమయినట్లు?

రెండవ తరగతిలో ఒక అరవైమంది మాత్రం ప్యాసయినారు, అయిదారువందల మందికీ.

తను పరీక్ష ప్యాసయినందుకు సుందరం సంతోషంతో అయిదారు రూపాయలు ఖర్చుపెట్టి తన స్నేహితులకు టీపార్టీ చేశాడు.

ఎంతమంది తప్పినా, ప్యాసైనవాళ్లలో ఎంతమందికి ప్రమోషన్లు వచ్చినా రాకపోయినా, ప్రభుత్వానికిమాత్రం, రాజధాని మొత్తంమీద పదివేలమంది అభ్యర్థులమీదా అభ్యర్థికి పదిరూపాయల చొప్పున, ఒక లక్షరూపాయల ఆదాయం నికరంగా లభించింది.

మొత్తం పరీక్షకు హాజరయిన పదివేల మందిలో ముప్పదిరెండుమంది మాత్రం మొదటితరగతిలో ఉత్తీర్ణులు కావటం, వారిలో తను ఒకడు కావటం సుందరానికి గర్వకారణమయింది. తను పరీక్షలో వ్రాసినదాన్ని గురించి తక్కువ అంచనా వేసుకున్నందుకు సుందరం సిగ్గుపడ్డాడు. తను పరీక్ష వ్రాసిననాటి రాత్రి దిగులును, ఆందోళనను గూర్చి తలుచుకుంటే సుందరానికి, ఇప్పటికీ నవ్వు వస్తుంది. ★

# సిటీ బెగ్గర్

డిశెంబరు మూడవ తేదీ. రాత్రి ఎనిమిది గంటల పదిహేను నిమిషాలయింది. బెంగుళూరు మెయిలు యింకొక అర గంటలో మద్రాసు సెంట్రల్ స్టేషన్‌నుండి బయలుదేరుతుంది.

నేను ఇంటరుక్లాస్ కంఫార్ట్‌మెంటులో కిటికీవైపు కార్నర్ సీటులో హోల్డాల్ బాగా పరుచుకొని కూర్చున్నాను. దానికెదురు సీటులో, గోపాలం తన బెడ్డింగ్ వేసికొని కూర్చున్నాడు. కంపార్ట్‌మెంట్‌లో అవతలవైపు ఎవరో యిద్దరు మనుష్యులు మాత్రం ఉన్నారు.

నేను ప్యాసింగ్ షో సిగరెట్టు వెలిగించి, మరుసటిరోజు ఆంధ్రపత్రికను చదవడం మొదలెట్టాను.

"సార్, టైమ్ ఎంతయింది?" ఎవరో ఒక అపరిచిత వ్యక్తి ప్లాట్‌ఫారమ్‌మీద నుండి యింగ్లీషులో ప్రశ్నించాడు.

ఈ వ్యక్తిని యింతకుముందెన్నడూ నేను చూచి యుండలేదు. నన్ను కాక, యింకెవరినైనా సంబోధించి, అడుగుతున్నాడేమోనని వెనుకకు తిరిగిచూచాను.

'సార్, టైమ్ ఎంతయింది?' తిరిగి అడిగాడు ఆ వ్యక్తి. ఈసారి నిశ్చయంగా నన్నే ఉద్దేశించి అడుగుతున్నాడు.

'నన్నేనా మీరు అడుగుతున్నది?'

'అవును, సార్.' అంటూ కిటికీ దగ్గరకు వచ్చాడు.

ఈ అపరిచిత వ్యక్తి పొట్టిగా, లావుగా ఉన్నాడు. కొంచెం ఎఱుపురంగు మనిషే అని చెప్పవలసియుంటుంది. కోలముఖం. అతని కళ్లద్దాలలోనుంచి అతని పిల్లికళ్ళు నిగనిగ మెరుస్తున్నాయి. ఒక కాకీపాంట్, ఒక నల్లచారలకోటు, సగం అరిగిపోయిన కాలిబూట్లు వేసికొనియున్నాడు. కుడి చేతిలో ఒక చేతి కర్ర ఉంది. ఎడమచేతికి ఒకరిస్టువాచీ కూడా ఉంది. వయస్సు ముప్ఫైయైదు సంవత్సరాలు పైబడుంటాయ్. పైకి 'జెంటిల్ మాన్' మాదిరే కనిపిస్తున్నాడు.

'మీవాచీ పనిచేయడంలేదా?' అని అడిగాను నేను

'లేదు ఇందాక ఒక అరగంటక్రింద ఆగిపోయింది లెండి.'

ఆ రిస్టువాచీ ఎప్పుడైనా పని చేసి చచ్చిందా అని నాకు సందేహం కలిగింది. కాకపోయినా, రైల్వే డిపార్ట్‌మెంటువారు దయ్యమంతటి గడియారాల్ని ప్రతిప్లాట్‌ఫారంమీద వ్రేలాడ గట్టిపెట్టారు. పని కట్టుకొని నాదగ్గరకొచ్చి టైము అడగడమేమిటంట?

'అదుగో, రైల్వే గడియారం కన్పించడంలేదా? ఎనిమిదిగంటల పదిహేను నిమిషాలయింది.' అన్నాను నేను.

'థాంక్స్, థాంక్స్.. సార్, అయితే ప్రయాణం ఎందాకా?' వీడు మామూలుగ వదిలేటట్లు లేడు వరసచూస్తే. కాని మనిషంత మనిషి అడిగినప్పుడు, కేవలంగా త్రోసివేయడమెందుకు పోనిద్దూ అని ముక్తసరిగా 'బెంగుళూరు వరకు.' అన్నాను.

నా చేతిలోని ఆంధ్రపత్రికను చూచాడు ఆ వ్యక్తి.

'మీరు తెలుగువారా?' అని యింగ్లీషులో అడిగాడు ఆయన.

'అవును.'

'నేనూ తెలుగువాణ్నే లెండి.' అలా అంటే నేనేదో పెద్ద మురిసిపోయి, వాడిని అమాంతంగా కౌగలించుకొంటాననుకొని యుంటాడు బహుశా. కాని నేనేమీ మాట్లాడలేదు.

'మీరు బ్రాహ్మణులా లేక బ్రాహ్మణేతరులా?' తిరిగి ప్రశ్నించాడు ఆయన.

వీడు జీడిపాకం మాదిరి గట్టిగానే పట్టుకున్నాడే! ఇటువంటి ప్రశ్నల పరంపర ముక్కూ, మొహం ఎరగని మనిషి నన్ను అడుగుతోంటే, చికాకు కలిగింది. మద్రాసులో అప్పుడప్పుడు యిటువంటి స్థితి పట్టినపుడు 'నేను బ్రాహ్మణుడ్ని' అని చెప్పేవాడిని. ఆపైన ఒక్క ప్రశ్న అడిగితే ఒట్టు. ప్రశ్నవరకూ ఎందుకు, అసలు తిరిగి జన్మలో నాతో మాట్లాడేవారుకారు. అదే బ్రహ్మాస్త్రం యిక్కడ కూడా ప్రయోగించాను.

'నేను బ్రాహ్మణ్ణి' అన్నాను నేను యీ దెబ్బతో శని విరగడవుతుందేమోనని.

'నేనూ బ్రాహ్మణ్ణేలెండి.' అన్నాడు ఆయన, అక్కడికి నన్నేదో ఉద్ధరించినట్లు.

'అఘోరించినట్లే ఉంది లేవోయ్, నీవూ నీ బ్రాహ్మణత్వమున్నూ' అని లోపల అనుకొని, "అవును, మీవాలకం చూస్తే బ్రాహ్మణుల మాదిరే ఉన్నారు లెండి మీరు." అని పైకి అన్నాను.

ఆమాట ఏదో పెద్ద కాంప్లిమెంట్ క్రింద తీసికొని ఆ పెద్దమనిషి కంపార్టుమెంటులోనికి ఎక్కి, నాప్రక్కనున్న ఖాళీస్థలంలో వచ్చి కూర్చున్నాడు.

'వీడెవడోయ్, లక్షింపతి - ఇక్కడ వచ్చి తిష్ఠవేశాడు?' అన్నట్లుగా గోపాలం నావైపు చూశాడు.

'మీస్వగ్రామం బెంగుళూరేనా?' అని మళ్ళీ అడిగాడు ఆపెద్ద మనిషి.

'కాదు లెండి'

'మాది కూడ బెంగుళూరు కాదులెండి.'



ఎపోలో పోజ్

ఫోటో: శ్రీ ఎస్. వి. సుబ్బారావు(ఏలూరు)




## మద్రాసులో క్రొత్తరకం బస్సు—"విజయ"

ట్రాములు నిలిపివేయటంతో, మద్రాసులో ఏర్పడిన రవాణా సమస్యను పరిష్కరించటానికిగాను రాష్ట్రప్రభుత్వం రు. 68 వేల వ్యయంతో యీ 'హాఫ్ డెక్కర్' రకం బస్సులను నిర్మిస్తున్నది. దీంట్లో తడవకు 60 మంది ప్రయాణీకులు సుఖంగా కూర్చొని ప్రయాణం చేయవచ్చు.

'ఏడ్చినట్లే ఉందిలే మన సామ్యం' అని అందామను కొన్నాను. కాని అనలేదు.

'అయితే మాపిల్లలు ముగ్గురూ బెంగుళూరులోనే ఉంటున్నారు లెండి.' అని అన్నాడు ఆయన.

"మీ భార్య ఎక్కడ ఉన్నట్లు? ఆవిడ కూడ బెంగుళూరులోనే ఉంటున్నారేమిటి?' ఎక్కడలేని ఉత్సాహంతో అడిగాడు గోపాలం.

'మా ఆవిడ పోయి అప్పుడే మూడేళ్ళయింది లెండి. అయ్యో, ఆవిడ ఉంటే చెప్పవలసింది ఏముంది?'

తన భార్య జ్ఞప్తికి వచ్చి, కొంపదీసి యిక్కడ శోకన్నాలు మొదలెడతాడేమోనని భయపడ్డాను. కాని అటువంటిదేమీ జరగలేదు. దానికి బదులు తన చరిత్ర అంతా చెప్పడం ప్రారంభించాడు.

"నేను బెంగుళూరు సెక్రటేరియట్‌లో పనిచేస్తున్నానులెండి. నెలకు రెండువందల యాభై రూపాయలు జీతం. ఏదో పనిమీద మద్రాసు ఒక వారంరోజుల క్రిందట వచ్చాను. మూడు రోజుల క్రిందట ఎవడో దౌర్భాగ్యుడు నా మనీపర్సు కొట్టా కాజేశాడు." అని చెప్పి మావైపు చూశాడు ఆయన, ఏమైనా సానుభూతి చూపిస్తున్నామేమో అని. కాని మేము మాట్లాడలేదు.

"చేతిలో దమ్మిడి లేకుండా నేను యిక్కడ పడుతున్న అగచాట్లు చెప్పేందుకు వీల్లేదు. మూడు రోజులనుంచి కటికి ఉపవాసం చేస్తున్నానంటే నమ్మండి."

"నమ్మేందుకు కేలా వీలుపడుతుందోయ్. నీ వాలకం చూస్తే ఉపవాసం చేసినవాడి మాదిరి నువ్వు లేవే!" అన్నట్లుగా గోపాలం అతనివైపు చూచాడు.

ఇంతలో జీడిపప్పు పొట్లాలు రెండు కొని, ఒకటి గోపాలానికిచ్చి, ఒకటి నేను తీసికొన్నాను. తనకేమైనా కొంచెం జీడిపప్పు రుచిచూపిస్తామేమో అని మావైపు ఆదుర్దాగా చూచాడు. కాని ఏమీ ప్రయోజనం లేదని ఆయన గ్రహించడానికి ఆట్టే సేపు పటలేదు. ఆయన అక్కడ లేనట్టే మేము జీడిపప్పు తినడం చూచి, మళ్ళీ తన కథ మొదలెట్టాడు ఆయన.

"నేను కొంటన్‌మెంట్‌లో ఒక బంగళా అద్దెకు తీసికొన్నాను. అది క్వాడ్రాంట్ స్క్వేర్ రోడ్డుమీద ఉందిలెండి." అని యింకా ఏవేవో కోతలు కోసివేస్తున్నాడు.

మేము అతనివైపు చూడడం లేదు. ఇంతలో నేను రెండు ఆరెంజ్ క్రష్ సీసాలు తీసికొని, ఒకటి గోపాలానికిచ్చి, నే నొకటి తీసికొన్నాను. మేము దానిని త్రాగినంతసేపూ మావైపు ఎగాదిగా చూశాడు ఆ క్రొత్త స్నేహితుడు. మేము త్రాగినతర్వాత మళ్లా లంకించుకొన్నాడు.

"బెంగుళూరు సెక్రటేరియట్‌లో మన పేరు చెబితే, ఏ పనైనా సెకన్లమీద జరిగిపోవల్సిందే అనుకోండి. మీకే సహాయం కావల్సినా చేసియుండేవాణ్ణి!"

'నీ బోడిముండ సహాయం మాకేమి అక్కర్లేదు పోవోయ్.' అన్నట్లు చూచాడు గోపాలం అతనివైపు.

'ఇప్పుడు చూడండి నా స్థితి. చేతిలో దమ్మిడీ లేదు, భోజనం లేదు. దయచేసి యీపూట భోజనానికి మాత్రం ఒక రూపాయి

(56–వ పేజీ చూడండి)

సీరియల్ నవల

# దత్రత

## 14

ఎనిమిదేళ్లు గడచిపోయాయి. ఇప్పుడు ధర్మయ్య కుటుంబ జీవితంలో చాలా మార్పులొచ్చాయి. ఉపాధ్యాయ వృత్తి ఊడిపోయి రెండు సంవత్సరాలు కావస్తోంది. లక్ష్మి పెద్దమనిషై, పెళ్ళికి సిద్ధంగా యింట్లో కూర్చొనివుంది. చేతిలో డబ్బు నిలవలేని ధర్మయ్యకు ఒక సంవత్సరం పాటు శాంతమ్మ దగ్గరున్న మొత్తం ఆ కుటుంబాన్నంతా కాపాడింది. ఇక శాంతమ్మదగ్గర కూడా ఏమీ లేదు.

రవి కూడా పెద్దవాడయ్యాడు. ఎనిమిదవ తరగతి వరకే ఆ పాఠశాలలో వుంది. లక్ష్మి రవీ కూడా అంతవరకే చదివి, ధర్మయ్యతోబాటు ఆ పాఠశాలకు స్వస్తి చెప్పారు.

ధర్మయ్య వేరనే భావం శాంతమ్మకు గాని, రవికి గాని లేకపోవడంవల్ల, ఒకే కుటుంబంగా యింతకాలం జీవించడం వల్ల, శాంతమ్మను కష్టకాలంలో ధర్మయ్య కాపాడ్డంవల్ల, మొత్తం కుటుంబ బాధ్యతంతా రవిమీద పడింది.

ఉద్యోగం చేసి ధనాన్ని సేకరించగల విద్య రవిలో లేదు. అందుచేత ఒక సంవత్సరం స్థిరచిత్తం లేకుండా అనేక వృత్తుల్లో మారుతూవచ్చాడు.

మొదట్లో ఎప్పుడూ బట్టలు తెల్లగా ఉంటే సున్నితమైన కార్మిక వృత్తి ఏదా అని ఆలోచించాడు. ఒక దర్జీవాని దగ్గర చేరాడు. పని చెప్పకుండా కాఫీలు మోసే కుర్రాడిగా రవిని ఉపయోగించడంతో రవికి కోపం వచ్చింది.

ఒకసారి రవి విసురుగా కాఫీ తీసుక వచ్చి, కటింగ్ బల్లమీద గిరాటు వేశాడు. బట్టలన్నీ కాఫీరంగుతో డాగులు పడ్డాయి. మేస్త్రీకి కోపం వచ్చి రవిని చెంపకాయ వేశాడు. రవి దగ్గరున్న కత్తెర తీసి, దర్జీకు చూపిస్తూ "మరో దెబ్బ వేశావంటే ఇదిగో" అన్నాడు. దర్జీ నోరావలించి చూశాడు.

"నేను పని నేర్చుకోడానికి వచ్చాను గాని, నీకు కాఫీలు మోయడానికి రాలేదు. కాఫీలు మోస్తేనే ఆ పని వచ్చేపక్షంలో ఈలాంటి వెధవపని నా కక్కర్లేదు" అని రవి తీక్షణంగా మాట్లాడి తిరుగుమొగం పట్టాడు.

కొంతకాలం వడ్రంగి పనిలో చేరాడు. కొత్త తెలివిగానే పనిచేస్తున్నాడు. రోజుకో రూపాయి సంపాదించే పనివాడు కూడా అయ్యాడు. కాని ఒకరోజు మేస్త్రీ మీద చాలా కష్టం కలిగింది. వచ్చే రూపాయిలో పావలా కమీషను తీసుకోవడం ప్రారంభించాడు మేస్త్రీ.

ఒకనెల జీతంగా యిరవైరెండున్నర రవి చేతులో పెట్టాడు మేస్త్రీ.

**శ్రీ పినిశెట్టి**
**శ్రీరామమూర్తి**

"మిగతా ఏడున్నర" చేయిచాచి నిర్లక్ష్యంగా అడిగాడు రవి. ప్రక్కనున్న కుర్రాళ్ళు రవి ధైర్యానికి విస్తుపోయి చూస్తున్నారు.

"అది నాకు వస్తుంది" మేస్త్రీ చెప్పాడు.

"ఎందుకు?"

"కష్టపడి పని నేర్పినందుకు."

"కష్టపడి చాలాకాలం ఉచితంగా కొన్ని వందల రూపాయలు నీకు సంపాదించి పెట్టాను.—ఇంక యిలాంటివి పొసగవు. చేతిలో పడేయి" బిగ్గరగా కోపంగా అన్నాడు. మేస్త్రీ ఏమనుకున్నాడో, మిగతా డబ్బు యిచ్చి "ఇక నా పనిలోకి రావద్దు" అన్నాడు.

రవి నిర్లక్ష్యంగా నవ్వి వెళ్ళిపోయాడు.

ఆ మరునాడే చేతిమిషను కార్ఖానాలో చేరాడు. మలినమైన గుడ్డలు వేసుకొని మిషన్లుకోయడం బాగుచేయడం మొదట్లో బాధగా తోచినా — అక్కడ ఉన్నవాళ్ళ హృదయంలో మలినం అంతగా లేకపోవడం వల్ల రవి నిలవగలిగాడు. కొద్దికాలంలోనే ఒకరిద్దరితో గాఢమైన స్నేహం కూడా చేయగలిగాడు.

రవి ప్రవర్తన, రవితో పరిచయంఉన్న ప్రతివాళ్ళనూ మొదట్లో చాలా కంగారు పెట్టేది. ఎప్పుడూ కోపిష్టిగా ఉండే అతని మొగం, మాట్లాడే విషయంలో, ఒంపులూ సొంపులూ చేర్చక నిక్కచ్చిగా, నిర్లక్ష్యంగా మాట్లాడే విధానం. "అహంభావి"గా మొదట్లో నిర్ణయించుకొనే వారు. కాని కొద్దిరోజుల్లోనే, నీతివంతమైన నిష్కల్మషమైన అతని హృదయాన్ని చూసి, తమ అభిప్రాయం పొరపాటని సరిదిద్దుకునే వారు.

ఇప్పుడు రవి పెద్దపనివాడే అయ్యాడు. నెలకో ఎనభైరూపాయలు తీసుకవచ్చి శాంతమ్మచేతిలో పోస్తున్నాడు. ఏలాంటి దురభ్యాసాలూ అతనిలో లేవు. కుటుంబం తిండికి బాధపడేదుస్థితిని తప్పించిన రవికి, ధర్మయ్య మానసికంగా ఆశీస్సులు కురిపిస్తున్నాడు.

ధర్మయ్య ఇంకా పది సంవత్సరాలు పని చేయగల ఓపికా వయస్సూకూడా ఉన్నా, రెండు సంవత్సరాలకు ముందే తన ఉద్యోగం హఠాత్తుగా ఊడిపోడానికి కారణం ఎవరో తనకు తెలుస్తున్నా, ఆ విషయం గురించి శాంతమ్మదగ్గర ఎప్పుడూ ప్రస్తావించలేదు. ప్రస్తావించి ఆమెకు బాధ గలిగించడంతప్ప మరేమీ ఉపయోగంలేదని అతనికి తెలుసు కాబట్టే నిర్లిప్తుడుగానూ ఉదాసీనంగానూ ఊరుకున్నాడు.

ఏ లోపంతో ఏ విధంగా ధర్మయ్య ఉపాధ్యాయవృత్తిని విరమించాడో వివరణగా శాంతమ్మకు తెలీకపోయినా — తన గురించే ఈలాంటి త్యాగానికి ధర్మయ్య తలపడి ఉంటాడని ఆమె ఊహించుకోగలిగింది.

అతనినిస్వార్థ, పరార్థజీవితానికి శాంతమ్మ ఎంతగానో బాధపడేది. అందుకే తనదగ్గరున్న డబ్బు అయాచితంగా కుటుంబ ఖర్చుకు వినియోగించింది. అతన్ని జీవితాంతం కాపాడే బాధ్యత తనకుందని గుర్తించింది.

జమిందార్ గంగాధరంలో క్రూరత్వం ఉందని ఎవరూ అనలేరు. అతను అతిగంభీరుడూ పరార్థ చింత గలవాడని కూడా లోకులు చెప్పుకుంటారు. కాని రెండు సంవత్సరాలక్రితం ధర్మయ్యకు ఉద్యోగాన్నుండీ తిలోదకాలు యిప్పించడంలో, తప్పటడుగువేశాడని ఎవరన్నా అనుకున్నా - అది తన లోపం కాదని ఆలోపం చేసింది ధర్మయ్యే అని గంగాధరం ఆత్మవిశ్వాసంలో ఉన్నాడు.

ఒకరోజు రాము కాస్త ఆలస్యంగా యింటికి చేరుకున్నాడు. గంగాధరం ఆలస్యానికి కారణ మడిగాడు.

"మాష్టారింటిదగ్గర్నే యింతవరకూ ఉన్నా" అని రాము సమాధానమిచ్చాడు. రాముని ఏలాంటి ఆకర్షణ ధర్మయ్యయింటికి లాక్కు వెళుతుందో, నిజంగా గంగాధరానికి తెలీదు. కాని శాంతమ్మను తల్లిగా గుర్తించే అవకాశాన్ని ధర్మయ్య కలగ చేస్తున్నాడనీ, శాంతమ్మ అందుకే ఈ గ్రామంలో సుస్థిరంగా నిలచిపోయిందనీ జమిందారు ఊహించాడు.

"తరచు అక్కడికి వెళ్ళడం మంచిది కాదేమో" అని జమిందారు సూచించాడు. లోపలకు వెళ్ళబోతున్న రాము ఆశ్చర్యంగా తండ్రికేసి చూశాడు "ఎందువల్ల" అని కూడా విధేయతగా అడిగాడు.

ఈమాటకు జమీందారు బాధాపూరితంగా వాడిన నవ్వు నవ్వి, సమాధానం యివ్వకుండా ప్రక్కకు మొగంపెట్టాడు.

ఆ నవ్వులో ఏలాంటి శక్తి ఉందో, రాము స్తంభించిపోయాడు. మెల్లగా కాస్సేపు చూసి లోపలకు వెళ్ళాడు అయితే రాము అలా స్తంభీభూతుడు కావడానికి, తను ఆంతరంగికంగా, గుప్తంగా దాచుకుంటున్న భావన తండ్రి ఏలా పసికట్టకలిగాడా? అనేదే అతని ఆశ్చర్యం భయంకూడా.

లక్ష్మి పట్ల తనకున్న ప్రేమాభిమానాలు ప్రస్తుతం ఎవరికీ తెలీకూడదని రాము నిర్ణయం. బాల్యంనుంచీ అన్యోన్యంగా అల్లుకుంటూ వచ్చిన స్నేహలతిక ప్రాయం వచ్చేసరికి అనురాగలతగా హృదయాన్ని ఇంతగట్టిగా పెనవేయడం, ఆమెను రోజు కొక్కసారేనా ఏలాగైనా చూడాలనే కుతూహలం పొందడం మొదట్లో ఆశ్చర్యపడ్డాడు. కాని తర్వాత అలవాటుగా ప్రతిరోజూ మాష్టారుయింటికి వెళ్లి, ఏ తలుపు ప్రక్కనో ఉన్న లక్ష్మిని ఒక్కసారి ఛాయామాత్రంగా చూసి సంతృప్తితో లేచి చక్కగా వచ్చేవాడు.

మరునాడు గంగాధరం ధర్మయ్యకు ఉదయాన్నే కబురుచేసి తన విశ్రాంతి గదిలోకి తీసుక వెళ్ళాడు.

"ధర్మయ్యగారూ! నేను చాలామందికి సహాయం చేశాను. కాని ఎవర్నీ ఎప్పుడూ సహాయంగురించి అర్థించలేదు మీకు తెలుసుకదూ?" అని ధర్మయ్యను సూటిగా చూస్తూ అడిగాడు.

ఈ ప్రశ్నలో వ్యంగ్యం ఏమిటో




"సౌందర్యమునకు అద్భుతమైన సహాయము ఇదిగో. మీగడవంటి లక్స్ టాయిలెట్ సబ్బు మరగను చర్మము మీద బాగా రుద్ది తరువాత కడిగి వేయండి. నియమము తప్పకుండ వాడినచో లక్స్ టాయిలెట్ సబ్బు మీ చర్మమునకు ఒక క్రొత్త అందమును ఇచ్చును" అని లలిత చెప్పుచున్నది.

లక్స్
టాయిలెట్ సబ్బు

సినిమా తారలకు
సౌందర్యమునిచ్చు సబ్బు




LTS. 375-X30 TL

# ★ దత్తత ★

ధర్మయ్య ఆలోచిస్తున్నాడు.

"మీరు నాకు ఒక సహాయం చేయాలి" ఈమాట కొంత బిగ్గరగా ధ్వనించింది. దీనిలో యాచనలేదు. కాని ఏదో పట్టుదల ఉన్నట్టు ధర్మయ్యకు స్ఫురిస్తూంది.

"చెప్పండి" వినమ్రంగా అన్నాడు ధర్మయ్య.

"మీ యింట్లోఉన్న శాంతమ్మ..." అంటూనే గంగాధరం ధర్మయ్య మొగం లోకి చూసి ఆ భావాలు చదువుతున్నాడు.

"శాంతమ్మ" అని మళ్ళీ అడిగాడు. ధర్మయ్య నుదుటి విరుపులో ఒక ఆశ్చర్యం భయం కూడా కనిపించింది.

"నిజంగా మీకు చెల్లెలేనా?"

"వరసకు నిజంగా చెల్లెలే. కాని దూరపు బంధువు" జమిందారు నవ్వాడు. ఆ నవ్వు కోపంతో మిళితమైన నవ్వు. "ధర్మయ్య గారూ! యుక్తిగా మాట్లాడుతున్నారే."

జమిందారన్న ఈ మాటవిని, దానిలో యుక్తి అనే ఉత్ప్రేక్షకుస్థానం ఎక్కడుందా అని ధర్మయ్య ఆలోచిస్తున్నాడు.

"స్వంత చెల్లెలుగా ఎప్పుడో చెప్పారే?" కొంత వెటకారంగా తల పంకించి అడిగాడు.

ధర్మయ్య స్వంతం అనేపదం ఎప్పుడూ, ఎవరి విషయంలోనూ వాడటానికి అలవాటు పడలేదు. చిన్నతనంలో రవి చాకు యిచ్చినప్పుడు కూడా అలా అనలేదు.

"స్వంతమని తమతో ఎప్పుడూ చెప్పినట్లు గుర్తులేదే."

"పరాయిదానిపట్ల అంత బాధ్యత తమ కెందుకు?"

"పూర్తిగా పరాయిది కానందువల్లనే. ఆమె భర్తృవిహీనురాలు..." ఇంకా ధర్మయ్య ఏదో చెప్పబోతుండగానే చటుక్కున "మీరు భార్యావిహీనులు"... అన్నాడు.

దీనితో ధర్మయ్య మొగం ముందు తెల్లబడి ఆ వెంటనే ఎఱ్ఱబడింది. అయితే జమిందారు దానిలో అపార్థముందని ఊహించి ఆమాటనలేదు. ధర్మయ్య మొగం చూసినమీదట ఆలోచనలేకుండా, ధర్మయ్య నైతికప్రవర్తన తెలిసికూడా, ఈలా అన్నానే అనే పశ్చాత్తాపంకూడా కలిగింది.

"మీ రేమీ అనుకోవద్దు. మీరు పరిశుద్ధులే నాకు తెలుసు... కాని ఒక విధవా స్త్రీని యింటిలో పెట్టుకుంటే లోకం ఏమనుకుంటుంది?" అని ప్రశ్నించాడు జమిందారు.

ఈలాంటి మలినభూయిష్టమైన ప్రచారం తన్నెరిగిన ప్రజల్లో గాని, తన కుటుంబాన్ని పరిశీలించినవాళ్ళలో గాని జరగదనే నమ్మకం ధర్మయ్య కున్నది. 'అందుకే "అలాంటి ఆలోచన తమకు కలిగినందుకు బాధపడుతున్నా - నన్నెరిగిన ఎవ్వరూ అంత సులభంగా అనుకోలేరని నాకు తెలుసు" అన్నాడు.

ఈ నిరాడంబర పదాలతో కూడిన వాక్యాల్లో ఉన్న భావం, తీవ్ర శరాఘాతంగా జమిందారుహృదయానికి తాకింది.

జమిందారు లేచాడు. "నేనంత తేలిగ్గా ఊహించేవాడిగా మీకు కనిపించడం... నేను బాధపడను. కాని వయసు మీరకొద్దీ ఉపాధ్యాయులందరికీ మెదడు బలహీనమౌతుందా అని విచారిస్తున్నా......" కొంత అటుయిటు పచారు చేస్తూ తిన్నగా వచ్చి ఆగి "సరే... స్వయానా చెల్లెలు కానప్పుడు మీ యింట్లో ఉంచుకోవలసిన బాధ్యతేముంది?" అని ప్రశ్నించాడు.

జమిందారు యీరోజు మాట్లాడే మాటల్లో, పెద్దతనం ఎక్కడా స్ఫురించడం లేదు. యాభయ్యోపడిలోనే పంతుళ్ళకు మతి మందగిస్తే; తనకన్నా అయిదేళ్ళు మించిఉండి అనేక బాధ్యతలు నెత్తిమీద ఉన్న జమీందారుకు నిజంగా మతే పోవాలేమో!

నిజంగా ఆలా జరగలేదుకదా అనే అనుమానం కూడా ధర్మయ్యకు కలిగింది.

"తమరు అనే మాట నాకర్థం కావడ ల్లేదు"

ఈమాటంటూ ధర్మయ్య కూడా లేచాడు. దాని క్కారణం జమీందారు నిలచి ఉండటం కొంత కారణం కావచ్చు.

"కాదు. కాదని నాకు తెలుసు... కాని నేను మాట్లాడే భాష తెలుగని మీరు మర్చిపోవద్దు" ఈ మాటలు చాలా ఉద్ధృతంగా వచ్చాయి.

ఈ వాగ్వాదం వినేవాళ్లు ఎవరన్నా ఉంటే చాలా విచిత్రంగా కనిపిస్తుంది. పండుని ఆకుల గుంపులో మధ్యపర్చి, లావుపాటి కొమ్మను రాళ్ళతో కొడుతున్నాడు జమిందారు. కొమ్మ నిశ్చలంగా నిలబడే వుంది. ఆ అదురు పండుకేమీ తగలలేదు. బహుశా తన్ను రాల్చడానికి ఒక బలిష్టుడు ప్రయత్నిస్తున్నాడన్న సంగతి కూడా దానికి తెలీలేదు.


సర్వగ్రస్తమైనా, కాకపోయినా
చంద్రబింబం ఎల్లప్పుడు శోభాయమానం
గానే వుంటుంది. కాని, వనితల వదనబింబం
మాత్రం కృష్ణ సర్పాలవంటి వినీలకుంతలాలతో కూడా
కూడుకున్నప్పుడే శోభిస్తుంది.




కేశవర్ధని అ 14; షాంపూ అ. '14 అందరు డీలర్లవద్ద లభిస్తాయి.
లేక సౌత్ఇండియా కెమికల్స్. క్రాస్కట్ రోడ్. కోయంబత్తూరుకు వ్రాయండి.

సూటైనరాళ్ళతో కొమ్మగంటులు పడకుండా ఉండలేరు. అయితే తను ఆతిథ్యమిచ్చి పోషించిన పండును కాపాడ్డంకోసం ఏలాంటి దెబ్బలు తినడానికైనా సిద్ధంగానే వుండాల్రాను.

"మీరు ఆమెన్ను యింట్లోంచి పంపించి వేయడానికి ఏమన్నా సంశయముందా ?"

"నేరం లేకుండా పంపించివేసేంత పాపం నేనెందుకు చేయాలి"

దీనితో జమిందారుకు కోపం వచ్చింది. "ఆమెను పంపించివేయాలని నేను అనుజ్ఞ యిస్తున్నా" తీవ్రంగా అన్నాడు. ధర్మయ్య జమిందారుకేసి చూశాడు. ధర్మయ్య మొగంలో అలాంటి మార్పు బహుశా జమిందార్రాకితం చూచి ఉండడు. "బాధగావుందా?" మళ్లీ జమిందారే అన్నాడు.

"బాధగానే కాదు...ఆలా చేయకూడని బాధ్యతకూడా ఉంది"

"ధర్మయ్యా ?" ఎర్రగా చూస్తూ ఏక వచనంతో పిలిచాడు.

అవును ధర్మయ్య అధర్మంగా ప్రవర్తించలేదు. ధర్మయ్య ఆపరిస్థితిలో అక్కడ నుండి వెళ్లిపోవడం మంచిదిగా తోచింది. వెనక్కు తిరిగాడు.

"ధర్మయ్యగారూ" మళ్లీ జమిందారు స్వరం తగ్గించి మర్యాదగా పిలచాడు. ధర్మయ్య ఆగాడు.

"గతాన్ని మరవడం మానవుల ధర్మమైతే, మీ ధర్మయ్య అనే పేరు అలాంటి అర్థంతోనే నిండిఉంటుంది..."

"మరవలేరు. ఎవరన్నా దౌర్జన్యంగా మరిపించాలని ప్రయత్నించినా—ఆ గుర్తు హృదయంలో గంటుపడి, లేని గొడవలు తీసుకవస్తుంది...క్షమించండి—మీరు చెప్పిన పని చేయలేకపోయినా—మీ వుద్దేశ్యాన్ని గుర్తించిన ధర్మయ్య! మీ భావానికి వ్యతిరేకంగా వెల్లడిచేయడని గ్రహించండి శలవ్" ధర్మయ్య గది దాటి వెళ్లిపోయాడు.

తాను ధర్మయ్యపోషణకు ఆధారంగా చూపిన బడిపంతులు ఉద్యోగం వేలుపెట్టి చూపి గతాన్ని విస్మరించవద్దని హెచ్చరించబోతే, ఆమరుపు అనేపదాన్ని ఆధారంగానే తనలో నిలిచిన కురుపును ఆ వేలుతోనే చూపించి, కనిపించని ఆ గాయాన్ని ఉందని వెల్లడి చేయనులే అని వ్యంగ్యోక్తితో భరోసాయిచ్చి వెళ్లిన ధర్మయ్య తెలివికీ, గంభీరతకూ, జమిందారు ఆశ్చర్యపోయాడు. పైగా తాను ఏది రహస్యంగా ఉంచాలని తలచాడో అది ధర్మయ్యకు తెలిసిపోయింది. ఆలాగే కుర్చీలో కూర్చుని ఆలోచనలో పడిపోయాడు.

మరునాడే ధర్మయ్య ఉద్యోగానికి భిన్నం ఏర్పడింది. గంగాధరంగారినుండి చిన్నలేఖ అందినది. "ఈ యాభయ్యో సంవత్సరంలో మనస్సు స్థిమితంగా ఉండని మాట నిజం. పైగా పాతిక సంవత్సరాలు ఉద్యోగంచేసిన మీకు ధర్మప్రకారం ఉచిత విశ్రాంతి నివ్వడం పాఠశాలాధికారులకు ధర్మం - ఆ ధర్మంతోనే తమరు యిక పాఠశాలలో విద్యాబోధన చేయవద్దని - చేయకూడదని - తెలియ చేస్తున్నా" ఈ ఉత్తరం చూసిన ధర్మయ్య ఆశ్చర్యపడలేదు. కాని బరువుగా నిట్టూర్చాడు.

ఇందులో ఎవరికి మతి లేదో, భగవంతుడు అర్థం చేసుకోకుండా ఉండడని ధర్మయ్య నమ్మకం. అయితే ధర్మయ్య అధర్మంగా సంచరించడనే సంగతి వెల్లడి చేసినదానికిగాను - ఇదికూడా ఒక ధర్మంగానే జమిందారు చూపిస్తూ లేఖ వ్రాయడంలో, అతని మేధాశక్తిని అభినందించలేదుగాని, తెలివి అనే పదార్థం ఉపకారానికి ఎంత పని చేస్తుందో - అపకారానికి కూడా అంతే చేస్తుందని అనుకున్నాడు.

ఈ పై సంఘటన జరిగిందల్లా సరిగ్గా రెండు సంవత్సరాల క్రితమే.

అప్పటికే రాము కాలేజీలో మొదటి సంవత్సరం చదువుతున్నాడు. తండ్రి ద్వారా ఆ మాట విన్నతర్వాత అంత తరచుగా ధర్మయ్య యింటికి పోవడల్లేదుగాని, ఎక్కడో ఒకచోట లక్ష్మిని చూడ్డం జరుగుతూనే వుంది.

ధర్మయ్యకు ఉద్యోగం లేకపోవడం గురించి రాము చాలా విచారించాడు. అయినా ఈ విషయంలో ఉదాత్తంగా తండ్రిని అడిగి సహాయంచేయగల ధైర్య అతనిలో లేకపోయింది.

## 15

రవిలో ఈ మధ్య వచ్చిన విచిత్రమైన మార్పుయింటిల్లిపాదీ గమనిస్తూనేఉన్నారు. కాని అతనితో ఎక్కువగా మాట్లాడడానికి ఎవరూ సాహసించలేకపోతున్నారు. ఎంతో చనువుగా వుండే లక్ష్మికూడా అతనంటే ఒకవిధంగా భయపడుతూనే వుంది. కాని యింటి కంతటికీ ఆధారభూతుడుగా ఉన్న అతని మార్పునుగురించి తరచి అడగడం ద్వారా ఏలాంటి విపత్తు ఏర్పడుతుందో అనే అదురు శాంతమ్మకు కూడా లేకుండా పోలేదు.

ఆవేళ ప్రొద్దుతిరిగిన తర్వాత రవి భోజనానికి వచ్చాడు. లక్ష్మి చిరిగిన ధర్మయ్య చొక్కాను కుడుతూ వుంది. శాంతమ్మ కళ్ళజోడు పెట్టుకు భగవత్‌గీతను పఠిస్తూ వుంది.

"ఇంత ఆలస్యమైందేం బాబూ" అని పుస్తకం మూసి లేస్తూ శాంతమ్మ అడిగింది.

"అవును" ఇంతే సమాధానం ఇచ్చి, చొక్కా తీసి, భోజనంగదిలోకి వెళ్ళాడు.

శాంతమ్మ భోజనం పెట్టింది. ఆత్రంగా తింటూఉన్న రవిని దూరంగా ఉండి పరిశీలిస్తోంది.

"ఆదివారం కూడాను...పని లేదుగా" అని శాంతమ్మ అన్న వెంటనే, తలెత్తి చూశాడు.

"కాస్త నెమ్మదిగా తినమంటున్నా" అంది మెల్లగా.

"మజ్జిగ" అని అడిగాడు.

భోజనమై లేచినతర్వాత చావిట్లో చేయి తుడుచుకుంటూ, శ్రద్ధగా చొక్కా

(54-వ పేజీ చూడండి)




ఉబ్బసము
నుండి విముక్తి పొందుడు
MULTIMIX
మల్టిమిక్స్ యీ దుబ్బను, దగ్గును నివారించి, శ్వాసను క్రమపరచును



THE INDO FRENCH PHARMACEUTICAL CO.
MADRAS.



# విజ్ఞాన వీధులు

"డాక్టర్"



## 118. తిరిగే బొంగరము ఎలాగ నిలుస్తోంది?

"సైకిలు చక్రమూ, నాణెమూ, బొంగరమూ తిరుగుతున్నప్పుడు పడిపోకుండా ఎలాగ ఉండగలుగుతున్నవి?" అని గొల్లప్రోలునుంచి దరిశి భీమేశ్వరరావుగారు అడుగుతున్నారు.

బొంగరాన్ని చేత్తో పట్టుకుని నిలబెట్టితే నిలబడదు. పడిపోతుంది. అలాగే రూపాయి కూడా అంచుమీద నిలబడకుండా పడిపోతుంది. కాని గిర్రున తిప్పినప్పుడు మాత్రం పడిపోకుండా నిలుస్తాయి ఈ రెండూనూ. 'ఏ కారణమువల్ల?' అని ప్రశ్న.

సాసరులాగ ఉన్న అల్యూమినపు ప్లేటు ఒకటి పట్టుకుని 15 అడుగుల దూరంలో ఉన్న మీ స్నేహితుడికి అందేలాగు విసరండి. మధ్యలోనే కింద పడిపోతుంది కాదూ. దొర టోపీ అయితే ఇంకా నయం. ఐదారు అడుగులేనా పోరకుండా పడిపోతుంది. ఇప్పుడా దొర టోపీనే గిర్రుని తిప్పుతూ విసరండి. సరిగ్గా అందు



తుంది. పటములో టోపీమీద గీసిన గీత టోపీ తిరిగే అక్షము (*Axis*). టోపీ ఇటునుంచి అటు వెళ్ళేవరకూ, ఈ అక్షము నిటార్గా నిలిచే వుంటుంది. అంటే ఏమన్న మాటా? బొంగరములాగ తిరిగే వస్తువులు తమ అక్షాన్ని నిలవరించుకుంటా యన్న మాట కాదూ? పదార్థాలకి జడత్వము సహజము. జడత్వము అంటే మారడానికి బద్ధకము. స్థిరంగా ఉన్న వస్తువు కదలాలన్నా, కదులుతూన్న వస్తువు ఆగాలన్నా ఏదో శక్తి కలగజేసుకోవాలి. ఇక్కడ బొంగరము గిర్రున తిరుగుతోందంటే, గాలి రాపిడి తప్ప దాని భ్రమణాన్ని నిరోధించే శక్తి వేరేదీలేదు. భూమ్యాకర్షణశక్తి బొంగరపు తలని దిగువకి లాగుతుంది. కాని, గిర్రున తిప్పే శక్తి ఎక్కువది. కనక బొంగరము గిర్రున తిరుగుతూనే బుర్రని వాల్చివాల్చి, గిర్రున తిప్పే శక్తి గాలిరాపిడివల్ల తగ్గిపోగా తగ్గిపోగా, తల వాల్చేసి, భూమికి తగిలి దొర్లిపోతుంది, గాలిలేని శూన్య ప్రదేశములో తిప్పి వదలిన బొంగరము చాలా కాలము తిరుగుతూనే నిలిచి తన అక్షాన్ని నిలవరించుకుంటుంది. అప్పటికీ ములికికీ నేలకీ గల రాపిడి ఆ బొంగరాన్ని కొంత ఆటంకపరుస్తుంది.

'బొంగరము తన అక్షాన్ని నిలవరించుకుంటుం'దన్న సూత్రం గైరోస్టాటిక్ కొంపస్ అనే దిక్సూచిలో చక్కగా ఉపయోగానికి వస్తోంది. నిన్న మొన్నటిదాకా అయస్కాంతపు ముల్లుని వ్రేలాడదీసి అది చూపే ఉత్తర దక్షిణాలవల్ల దిక్కులు తెలుసుకునేవారు నావికులూ వైమానికులూ కూడా, నేడు ఏం చేస్తున్నారూ బొంగరము వంటి సాధనాన్ని గిర్రున తిప్పి దాని అక్షము ఉత్తరదక్షిణాలని చూపేటట్లు ఏర్పాటు చేస్తున్నారు. ఇక ఆ ఓడ ఎన్ని మలుపులు తిరిగినా, విమానము ఎన్ని పల్టీలు కొట్టినా, ఆ 'బొంగరపు' అక్షము ఉత్తర దక్షిణాలే చూపిస్తుంది. ఓడ పేల్చే ఫిరంగుల అదురు దీనికి అందదు! ఇంకా సొగసు ఏమిటంటే, మహాసముద్రములో ఓడ తిన్నగా ఋజురేఖమీదుగా పోవడానికని, ఓడ చుక్కానికీ, ఈ గైరోస్టాటిక్ దిక్సూచికీ జత కలుపుతారు. గాలి తాకిడికీ, కెరటాల తాకిడికీ ఓడ ముక్కు పక్కకి తిరిగితే, గైరోస్టాటు చుక్కానిని లాగి ఓడని మళ్ళీ ఋజురేఖ మీదికి లాగుతుంది. ఈ ఏర్పాటువల్ల ఏడెనునుంచి బొంబాయికి వచ్చే ఓడ, ఏడెనునుంచి బొంబాయికి గీసిన గీతమీదినించి ఇటూ అటూ పది అడుగులు దాటి పోదు!

తుపాకి గుళ్లు గొట్టమునుంచి దూసుకు వచ్చేటప్పుడూ, టార్పెడోలు ఓడలుమీదికి పేల్చబడి నీటిలోనుంచి దూసుకుపోయేటప్పుడూ గిర్రున తిరుగుతూ పోయే



ఏర్పాటుచేస్తారు. అందువల్ల వాటి అక్షము గురి తప్పిపోకుండా నిలుస్తుంది.

## 119. ఉదయాస్తమయాల్లో సూర్య చంద్రులు పెద్దగా కనిపిస్తారేం?

ఉదయించేటప్పుడూ, అస్తమించేటప్పుడూ సూర్యచంద్రుల బింబాలు ఎర్రగానూ, పెద్దవిగానూ కనబడతాయి. సూర్యచంద్రులనుంచి భూమిని రాసుకుంటూవచ్చే వెల్తురు కిరణాల్లోని రంగులు, ఎరుపు మినహాగా తక్కినవి, భూమిమీద గాలిలో తేలియాడే ధూళికణాలవల్ల విరజిమ్మబడి పక్కలకి పోతే, ఆ మిగిలిన ఎరుపురంగు వెల్తురే మనకి చేరడమువల్ల సూర్యచంద్రులు ఎర్రగా కనబడతారని ఇదివరలో చెప్పినాము. అయితే సూర్యబింబము పెద్దదిగా కనబడుతుందేమి?




ఏవస్తువు సైజేనా, ఆ వస్తువు యొక్క అంచులు మన కంటిదగ్గర పొడిచేకోణాన్ని తప్పిబట్టి వుంటుంది. పటములో 'యర', 'మయ' అన్నవి రెండు చెట్లు. 'యర' అన్నది చిన్నదీ, దగ్గరగా నున్నదీను. ఇది కంటిదగ్గర పొడిచే కోణము 'యలర' అన్నది.

'మయ' అనే దూరపు పొడుగునెట్టు పొడిచేపడాలి, నేను ఇంకా ఈ సంగతి సోదా చూడలేదు. ★

'మలయ' అన్న కోణముకంటె పెద్దది. కనక 'యర' మనదృష్టికి పెద్దదిగా కనబడుతుంది.

ఇక సూర్య చంద్రబింబాలు 'ఉదయిస్తూన్నప్పుడూ, నడునెత్తిన వున్నప్పుడూ కూడా సైజు అసలులో మారవు కనక అవి మనకంటె మీద పొడిచే కోణము కూడా మారదూ, వాటి సైజు మారినట్టూ కనబడ కూడదు. కాని ఉదయిస్తూన్నప్పుడు పెద్దవిగా కనబడుతున్నాయి! దీనికి కారణము సూర్య చంద్ర బింబాల సైజు కాదట. అవి మరుగు పరిచే నీలాకాశపు మేర యట!

'ఆకాశము' అని మనము అనే నీలికప్పు గోళాకారపు కప్పులాగ కాక, నీలి బూరెల మూకుడు బోర్లించినట్లు నడునెత్తిని దగ్గరగా నున్నట్లూ, అంచులదగ్గర దూరంగా వున్నట్టూ కనబడుతుంది. కనక చంద్ర బింబము నడునెత్తిన ఉన్నప్పుడు మన కంటికి కనపడకుండా అది మరుగుపరిచే నీలాకాశపు మేర, - 'న' అన్నది, - ఉదయిస్తున్నప్పుడు మరుగుపరిచే 'అ' అనే మేర కన్న చిన్నది. చంద్రబింబపు సైజు, అది మరుగుపరిచే నీలాకాశపు మేరనిబట్టి ఊహించుకుంటాం మనము. అంటే ఉదయిస్తున్న చంద్రబింబాన్ని 'అ' అనే మేరనిబట్టీ, నడు నెత్తినవున్న బింబాన్ని 'న' అనే మేరనిబట్టి నిర్ణయించుకుంటాము. కనక ఉదయించే బింబము ఆకాశంలో ఎక్కువ మేరని కప్పేస్తూ పెద్దదిగానూ, నడునెత్తినున్న బింబము తక్కువ మేరని కప్పుతూ చిన్నదిగానూ కనబడుతుంది. కాని వాస్తవానికి ఆ బింబపు సైజుగానీ, దూరముగానీ మారదు. ఇది భ్రమమాత్రమే.

దీనినిబట్టి, 'తెర దూరంగా పెట్టినకొద్దీ తెర ముందటి వస్తువు పెద్దదైనట్టు కనబడాలి కదా!' అని అడుగుతారేమో! తప్పకుండానూ. కాని మనము కలుగజేసికోగల దూరాలు చిన్నవి. కనక మార్పు అట్టే కనబడదు.

అయితే నాకొక సందేహము పుట్టుతోంది. పలచని మబ్బులోనుంచి ఉదయించే చంద్రబింబము, - ఆకాశపు మేరని మరుగుపరచదు గనక - చిన్నదిగానే కన

—ప్రభూతయుగాలలో మట్టిలో పూడిపోయి శిలలవలె గట్టిపడిపోయిన జంతువులూ, జంతువులభాగాలూ, జంతువుల కాళ్లముద్రలూ, ఆకుముద్రలూ, వీటిని ఫాసిల్సు అంటారు. మైలతుత్తపు ద్రావణములో చాకును ముంచి కొంతసేపు ఉంచితే, చాకుకి రాగిపూత పట్టుతుంది. చాకులోని ఇనపకణాలు మైలతుత్తములో ప్రవేశించి, అందులోని రాగికణాల్ని తొలిగించేస్తాయి. ఈ రాగికణాలే 'పూత'. ఇదే రీతిగా, నీటిలో కరిగిన శిలావస్తువుని జంతువుల కణాలు ఆ నాటినుంచి శతాబ్దాల కాలములో తొలిగించి, ఆ జంతుకణాల స్థానములో కుదురుకుంటాయి. ఇలాగ జరగ్గా జరగ్గా జంతువంతా రాయిగా 'మారి' పోతుంది. అదే ఫాసిలు. జంతువుల పాద చిహ్నాలు మెత్తని మట్టిలోపడి, ఆ మట్టి అదే రీతిగా దిగిపోయి, పైనవున్న ఒత్తిడికి మాత్రలలాగ —గట్టిపడిపోయి నల్లశేనపురాయిలాగ అయిపోయి ఆ పాదముద్రని అలాగే చూపిస్తాయి. ఇవీ ఫాసిల్సే.

—భూమి, వ్రేలాడదీసిన అయస్కాంతాన్ని ఉత్తరదక్షిణాలకి తిప్పుతుంది. కనక భూమిలో ఉత్తరపుదిక్కున, అయస్కాంతపు ఉత్తరధృవాన్నిలాగే దక్షిణ ధృవతత్త్వమూ, దక్షిణదిక్కున దీనికి వ్యతిరేకమైన ఉత్తర ధృవ తత్త్వమూ ఉన్నాయని తేలుతుంది. దక్షిణ దిక్కునుండి, ఉత్తరదిక్కుకి అయస్కాంత శక్తిరేఖలు ప్రసరిస్తూంటాయి. ఉత్తర దిక్కుకి తలపెట్టుకుని పడుకుంటే ఈ రేఖలు మన కాళ్ళకడ శరీరములో ప్రవేశించి తలవైపు సాగి ఉత్తరానికి సాగిపోతాయి. ఇది శరీరానికి మంచిది కాదని కొందరు మహానుభావులు ఊహచేసుకుని, 'మన పెద్దలు ఉత్తరతలాపిగా పడుకోవద్దనడానికి కారణము ఇదుగో ఇది!' అని డాబులు చెప్తారు. నిజానికి పెద్ద అయస్కాంతములతో పనిచేసే శాస్త్రజ్ఞులు ఏ వ్యాధినీ పట్టుకున్నట్లు సాక్ష్యము లేదు. అంత పెద్ద అయస్కాంతాలకు లేని అపాయశక్తి అతి బలహీనమైన భూకాంత శక్తికి ఎలాగు ఉండగలదూ? విఘ్నేశ్వరుడికి బుర్ర కావలసి ఉత్తరతలాపిగా పరున్న ఏనుగు తల కొట్టినారట శివభటులు! అలాగ మన తలకొట్టకుండానూ, ఉత్తరపు దిక్కుకి తలాపి పెట్టకపోడము!

—విశ్వాంతరాళంలో రేగే కాశ్మిక్ కిరణాల తాకిడినుండి భూమిని సంరక్షించడానికి గట్టికప్పుభూమిచుట్టూ కలదంటారా?

తోటమాలి: "బాబూ! బియ్యం కొనుక్కోవటానికి డబ్బులులేక యింటిల్లపాదీ వుపవాసం వుంటున్నాం బాబూ!"

యజమాని : "అయ్యో! పాపం! నా దగ్గిర కూడా డబ్బులు లేవు; ఒక మానెడు బియ్యం యిస్తాను; పట్టుకుపో!...అన్నట్లు రేపు గుర్రపు పందేలు ప్రారంభమౌతాయి కాబోలు. నేనిచ్చే బియ్యం అమ్మేసి, ఆడబ్బులు గుర్రపు పందేలకు తగలబెట్టక, చక్కగా ఇంటికి పట్టుకుపో!"

తోటమాలి: "ఆబియ్యం ఎందుకు అమ్ముతాను బాబయ్యా? గుర్రపు పందేలకి డబ్బులు యిదివరకే విడిగా పెట్టి వుంచాగా!"

అవును; భూమిచుట్టూ గాలి కప్పు కలదు. అయితే, గాలి లేకపోతే కాస్మిక్ కిరణాల తాకిడికి భూమి దెబ్బ తింటుందన్న వాదము మాత్రము ఇంకా ఎవరూ ఒప్పుకోరు. ఏమంటే, అతిశక్తివంతమైనా, కాస్మిక్ కిరణాలు చాలా పలచగా వస్తున్నాయి. నిమిషానికి మన బుర్రలోనుంచి ఏడు కణాలు ప్రసరించి కిందికి పోతున్నాయట! వీటివల్ల జరిగే నష్టమో, లాభమో ఇంకా తేలలేదు.

—సూర్యబింబముమీది మచ్చలు, సూర్యగోళములోనుంచి వాయువులు పైకి వచ్చేసే బిలములు; సుడిగుండములో మధ్యనున్న బిలములవంటివే. ఇవి హెచ్చుగా నున్నప్పుడు సూర్యబింబమునుండి ఎలక్ట్రాన్లనే విద్యుత్కణాలు అంతరాళములోకి విరజిమ్మబడి, భూమిపై పుకూడా వస్తాయి. ఈ కణప్రవాహమును విద్యుత్ప్రవాహముని కూడ అనవచ్చును. విద్యుత్ ప్రవాహమునకు చుట్టూఏర్పడే అయస్కాంత క్షేత్రము ఇక్కడకూడా ఏర్పడి, అయస్కాంతాల్ని ఉపయోగించే సాధనాల్ని కొంత తారుమారు చేస్తాయి. ★

కాకినాడ కాలువలో పడవల రేవు

కె. వేణుగోపాల్ గారి (గుడివాడ) తైలవర్ణ చిత్రం.



# మూడు తైలవర్ణ చిత్రాలు

## సింహాచలం కొండమెట్లు

కె. వేణుగోపాల్ గారి (గుడివాడ) తైలవర్ణచిత్రం.



## మృగరాజు కుటుంబం

కె. నరసింహంగారి (శ్రీకాకుళం)
తైలవర్ణచిత్రం.




# అందాల మా పాప

★

శ్రీ చిట్టా దామోదరశాస్త్రి

పాపాయి ఒళ్లంత బంగారు పసిమి
పాపాయి ఒళ్లంత రంగారు మిసిమి
పాపాయి బుగ్గల్లొ తేనె లుంటాయి
పాపాయి నవ్వితే తొణికిపోతాయి
పాపాయి నవ్వుల్లు పోసి నవ్వుల్లు
చందమామాలోని చలువ వెన్నెల్లు
కొలబోసి పోసినా మల్లె పువ్వుల్లు
అమృత భాండములోన చిందునురుసుల్లు
పాపాయి నగుమోము బాల భాస్కరుడు
మోముపై నాడు ముంగురులె మేఘుండ
పాపాయి మాటల్లు తేనె ఊటల్లు
కలకండ సోనల్లు కండచక్కెరలు
పాపాయి ఆడేటి ఆటయే ఆట
పాపాయి పాడేటి పాటయే పాట
దేవలోకములోని దివ్యులందరిని
పవళించి పాపాయి పలుకరిస్తాడు
అందాల పాపాయి కెందరో ఉన్నా
అందాల మాపాప అందరికి మిన్న.





# జంతుకోటిలో మానవలక్షణాలు



(గత సంచిక తరువాయి)

కేవలం వినోదం కోసమే మనం అంతా ఆటలాడుకొన్నట్లుగా జంతువులు కూడా ఆడుకోగలవా అనేది శాస్త్రవేత్తలకి అంతుపట్టని సమస్య.

ఈప్రశ్న మన మనస్సులో పుట్టగానే, జంతువులు చేసే చేష్టలు చాలా మటుకు కేవలం వినోదం కోసం ఆడే ఆటలుగానే తోస్తాయి. యజమాని ఎప్పుడైనా ఒక కర్రముక్కను నదిలోకి విసిరేస్తే, ఆకర్ర పుల్లను పట్టుకు రావటం కోసం కుక్కలు ఒక దానితో ఒకటి పోటీలుపడి నీళ్లల్లో యీదుకొంటూ పోవటం మనం చూస్తూన్నదే! ఆటకాయితనంగా చిటారు కొమ్మలమీద ఒకదాన్ని ఒకటి వెంటబడి తరుముకొనే వుడత పిల్లలూ, మనం చూస్తూ వున్నవే. పసితనం వదలని ఎలుగుబంటి వెల్లకితలా పడుకొని గంటల తరబడీ గాలిలో కాళ్లూ చేతులూ ఆడిస్తూ వుండటం కూడా పరిపాటిగా జరిగేదే. మేక పిల్లలు, లేడి పిల్లలూ వుత్తిత్తి పుణ్యానికి చెంగు చెంగున ఎగురుతూ వుండటం మామూలుగా మనకంట పడే దృశ్యమే.

'బాడ్జర్' అనే రకం జంతువు గాలిలో పిల్లి మంత్రాలు అవలీలగా కొట్టేస్తుంది. ఈశక్తి మిగిలిన జంతువుల్లో వేటికీ అంతగా లేదు. వెనుక ఒకసారి ఎవరో ఒకాయన తనయింట్లో ఒక కుక్కనీ ఒక బాడ్జర్‌నీ కలిపి పెంచుతున్నాడట. ప్రతిరోజూ మధ్యాహ్నం యీ రెండూ కలిసి వేళాకోళంగా కుస్తీ పట్లు పట్టుతుండేవట. ఆకుస్తీ వినోదం చూడటానికి మిగిలిన జంతువులెన్నో సరిగ్గాఆసమయానికి అక్కడ సమావేశమౌతూ వుండేవట.

కేవలమూ యితరులను ఏడిపించే ధోరణిలో రకూన్ అనే రకం జంతువు దారిని పోయే కోడిపుంజల యీకలను వూడపీకుతూ వుంటుంది: లేదా వాటిమీద గులకరాళ్లు విసిరి వేధిస్తుంది.

చింపాంజీలు కూడా యిలాటి కొంటె కొక్కిరాయి వేషాలు వేస్తుంటాయట. ఒక 'జ్యూ'లో చింపాంజీల బోనుకి దగ్గరగా కోడిపిల్లలు తిరుగుతూ వుండేవి. మామూలుగా అయితే తాను అసహ్యించుకొనే నాను రొట్టెముక్కలనే, యీ చింపాంజీ, కేవలం ఆ అమాయకపు కోడిపిల్లలని వుడికించటం కోసమే, ఎంతో ఆప్యాయంగా తింటున్నట్లు వాటికి కనిపించేట్లుగా కూర్చుని ఒక్కొక్క ముక్కే పెద్ద చప్పుడు చేస్తూ చొంగ కారుస్తూ తినటం మొదలు పెట్టేదట. ఆశపడిన కోడి పిల్లలు బోను దగ్గిరకు వచ్చేదాకా అలాగే పూరించి, తీరా దగ్గిరకు వచ్చాక, రొట్టెముక్క వాటి ముక్కులకి అందకుండా పైకి ఎత్తిపట్టుకొనేది. అప్పుడప్పుడు దీనికి తోడుగా మరొక చింపాంజీ కూడా చేరేది. మొదటి చింపాంజీ రొట్టెముక్కలు చూపెట్టి కోడిపిల్లలను ఆశపెట్టి బోను దగ్గిరకు రప్పిస్తే, యీ రెండో చింపాంజీ చిన్న కర్రపుల్ల పుచ్చుకొని, ఆకోడిపిల్లల కళ్లలోకి పొడిచేది. దీన్నిబట్టి, ఆ రెండు చింపాంజీలు కలసి అప్పటికప్పుడు క్రొత్తరకమైన ఆట నొకదానిని

# ★ జంతుకోటిలో మానవలక్షణాలు ★

సృష్టించుకో గలిగాయని బోధ పడుతున్నది.

జంతుకోటి అంతట్లోకీ ఆటకారి, 'ఆట్టర్' అనే ఒకరకం జంతువు. ఇది చాలా భాగం నీటిలోనే నివసిస్తూ, చేపలను ఆహారంగా స్వీకరిస్తూ వుంటుంది. వీటికి ఆటలు అంటే వుండే సరదా అంతా యింతా కాదు. భూమిమీద పడ్డ మరునటి రోజునుంచే యివి ఆటల్లో పడిపోతాయి. మనుష్యులు, మిగిలిన జంతువుల్లాగా యీ ఆటలు ఆడటం అనేది ఏవో కొన్ని ఏళ్ల పాటు ఆడి, ఆతరువాత విరమించటం అంటూ యివి ఎరుగవు. పుట్టింది మొదలు, చచ్చేదాకా ఆటల్లోనే గడుపుతాయి. రెండు 'ఆట్టర్లు' ఒక్కచోట తారసిల్లితే, రెండూ కలిసి ఏదో ఒక కర్రను పట్టుకొచ్చి, చెరొక వైపునా ఆకర్రని పట్టుకొని లాగుతూ, ఒకదానిబలం మరొకటి పరీక్షించుకొంటాయి. లేదా-నీటిలో తేలే బిరడాల్లాంటిది ఏదైనా కనిపిస్తే, దాన్ని నీటిలోకి ముంచటానికి ప్రయత్నిస్తూ, పైకి రాగానే అణిచి పెట్టుతూ, ఆబిరడాతో పాటు తామూ 'డాన్సు' చేస్తాయి. అన్ని ఆటల్లోకీ వీటి కిష్టమైన ఆట, పైనుంచి కిందికి స్పష్ట భాగంతో జారటం. నీటిఅంచు తగిలేటట్టుగా వున్న గట్టుమీదికి ముందుగా ఒక 'ఆట్టర్' ఎక్కి అక్కడి నుంచీ కిందికి జారుతుంది. దాని వెనకాల మరొక ఐదారు ఆట్టర్లు ఒకదాని వెనుక ఒకటిగా జారివచ్చి నీళ్లల్లో పడుతాయి. ఇన్నీ వెంట వెంటనే జారిన కారణంచేత, అంతమేరా, నేల చదును అవుతుంది. అప్పటికి డజన్లకొద్దీ 'ఆట్టర్లు' వచ్చి గట్టుమీద చేరిపోతాయి. అన్నీ ఒక్కసారిగా ఎగబడకుండా ఒకదాని తరువాత మరొకటిగా యిన్నీ కలిసి కిందికి జారిపోయి నీళ్లల్లోపడి, వొళ్లు శుభ్రం చేసుకొని మళ్లీ గట్టుమీదికి వచ్చి నిలబడుతాయి. మళ్లీ చదునుమీదగా జారే అవకాశం వచ్చేదాకా, గట్టుమీద చేరిన యీ జంతువులన్నీ కలిసి కుస్తీ పట్లు పట్టుతూ వుంటాయి.

ఇదంతా అవి ఎందుకు చేస్తున్నాయని శాస్త్రవేత్తలు ప్రశ్నించుకొన్నారు. వాటి మనస్సుల్లో ఏదో చెప్పలేని ఆనందం పుట్టుకొచ్చి, అదంతా యీ మాదిరి చేష్టలుద్వారా వ్యక్తమౌతూ వుండవచ్చునని ఒక శాస్త్రవేత్త సమాధానం యిచ్చాడు.

కానీ జంతువులు యిల్లాంటి ఆటలు ఆడటం అనేది కేవలం వినోదం కోసమేనని ఒప్పుకోవటానికి శాస్త్రవేత్తలు నిరాకరిస్తున్నారు. పసితనం వదలని దశలో జంతువులు వేసే గంతులకి కారణం, వాటిలో పూర్తిగా వినియోగపడని అదనపు శక్తి వుత్సాహాలు వుండటమే కావచ్చుననీ, లేదా వాటికి స్వతస్సిద్ధంగా అలవడే కొన్ని శక్తులకి అవి యీ రూపేణా పదును పెట్టుకోవటమైనా కావచ్చుననీ శాస్త్రవేత్తలు అభిప్రాయపడుతున్నారు.

పిల్లిపిల్లలు నేలమీద దొర్లే దారపు వుండలమీదికి కుప్పించి ఎగిసిపడుతూ గంటల తరబడి గడిపేస్తుంటాయి. కదిలే వస్తువు ఏది కనిపించినా దానిమీదికి దూకటం పిల్లులకు పుట్టుకతో వచ్చే బుద్ధి ఏనాటికో ఒకనాటికి యీ పిల్లి పిల్లిలే పెరిగి పెద్దవై, ఎలికల మీదికి ఎగిరి దూకి పట్టుకోవలసి వస్తుంది కాబట్టి ప్రకృతిశక్తి, పిల్లి పిల్లలచేత చిన్నసాటినుంచీ ఆపని చేయించి, వాటికి అందులో మంచి తీర్ఫిదు వచ్చేలా చూస్తుంది. పిల్లలు కలిగిన పిల్లి, తానొకచోట పడుకొని, తోకను అతి వయ్యారంగా ఆడిస్తూ, అందుమీదికి తనకూనలు ఎగిరెగిరివచ్చి పట్టుకోబోతూ వుంటే, అది చూసి మురిసిపోతూ వుంటుంద. అలా కొంత కాలం గడిచాక, సగం చంపిన ఎలుకలని పట్టుకొచ్చి, తన పిల్లలకి అప్పగించి, వేట అంటే ఏమిటో కొంతమటుకు 'ప్రాక్టికల్ ట్రైనింగ్' యిస్తుంది. చిరుతపులులు పులులు, అడివి పిల్లులు అన్నీ యింతే!

ఇంచు మించుగా జంతువులన్నీ కూడా పెరిగి పెద్దవౌతున్న కొద్దీ ఆటల ధోరణి తగ్గిచ్చేస్తాయి. జీవి పరిణామ దశలో స్తన్యం త్రాగే జంతు వర్గాలకంటె తక్కువ తరగతికి చెందిన జీవాలు ఏవి అసలు ఆటలు ఆడవు. అల్లా ఆడగల తెలివి తేటలుకూడా వాటికిలోపమే.

(ఇంకావుంది)

రాజా - పేదా

వెల: 2-0-0

ఆంధ్రగ్రంథమాల, మద్రాసు-1

# చీకట్లో చిందులాట

శ్రీ మంధా లక్ష్మణరావు

"ఒరేయ్; సిద్ధాంతా లన్నీ ఒకసారి తిరగేశావ్రా" అన్నాడు అర్జున.

"అప్పుడే నేను రెండోసారి తిరగేస్తున్నా" అని నేనన్నాను.

"నాకింక నిద్ర వొచ్చేస్తోందిరా!" అన్నాడు ఆవులిస్తూ.

ఆమాటకోసమే నేనూ అరగంటసేపటి నుంచీ ఎదురు చూస్తున్నాను — నాకూడా నిద్రొస్తున్నప్పటికీ, వాడికంటే ముందు తెలిపోటం యిష్టలేక.

అర్జునరావూ, నేను థర్డుఫారం నుంచీ "క్లాసుమేట్సు"మే కాకుండా, "డివిజను మేట్సు"మి గూడాను. ఏది ఎల్లావున్నా, మేమిద్దరం మాత్రం ఎప్పుడూ స్నేహంగానే వుండే వాళ్ళం. సాలుసరి పరీక్షలయినా, అర్ధసంవత్సరము పరీక్షలయినా దగ్గర పడ్డాయి అంటే కంబైన్ స్టడీస్ ప్రారంభించే వాళ్ళం. ఏ శుభ ముహూర్తాన యీ స్టడీస్ మొదలు పెట్టామోగాని, ప్రతీ సంవత్సరమూ యిద్దరమూ ప్యాసవుతూనే వచ్చాం. ఏలా అయితే నేం 'స్కూల్ ఫైనల్' క్లాసులో అడుగు పెట్టాం. రోజులూ వారాలూ, నెలలూ దొర్లి పోయాయి. పబ్లిక్ పరీక్షలు కూడా దగ్గిర పడ్డాయి. కంబైన్ స్టడీస్ ప్రారంభించాం. ఈసారి మా చిరకాల మిత్రులు కామేశ్వర రావు, అర్జున రావు అన్నయ్య రమణమూర్తి కలిసి మొత్తం నలుగు రమయ్యాం. నేనూ, అర్జునా, ప్రక్కనే ఉన్న వాళ్ళ బావగారింట్లో చదువు కొంటున్నాం. మిగతా వాళ్ళిద్దరూ అర్జున రావింట్లో చదువుకొనేవారు. ఎప్పుడైతే రెండుగా చీలి పోయామో, అప్పట్నుంచీ పట్టుదల కొద్దీ వాళ్ళిద్దరికన్నా ఎప్పుడూ మేమిద్దరం ఎక్కువ సేపు చదివే వాళ్ళం.

"సరే బిచాణా వేసెయ్. పడుకుందాం" అన్నాను నేను. ఇద్దరం పుస్తకాలు మడిచి గూట్లో పెట్టి, లైటు ఆర్పేసి పడుకున్నాం. నిద్ర పట్టింది.

నేను సెకెండ్ ఫారం చదివి నప్పుడు లెక్కలు చెప్పిన మాష్టారు, హోమ్‌వర్కు లెక్కలు చేయ సందుకు నా చెవి గూబలు పట్టుకు నలిపి బెంచీ ఎక్కించారు. నా చెవిగూబలు మండిపోతున్నాయి. తెలివొచ్చింది. కళ్ళువిప్పి చూశాను. అంతటా గాఢాంధకారం. ప్రక్కనే అర్జునరావు పడుకొని వున్నాడు. తెలివొచ్చినా గూడా, ఎవరో నా చెవిగూబలు పట్టుకు వదిలి పెట్టకుండా గట్టిగా మెలి పెట్టేస్తున్నట్లేవుంది. నా వొళ్లంతా చెమటలు దిగ్గారి పోతున్నాయి. కదలకుండా మెదలకుండా అల్లాగే పడుకొని "ఇదేంట్రా భగవాన్లూ" అని లోలోపలనే బాధ పడుతున్నాను. గుండెల్లో "పంజాబ్ మెయిల్" పరుగెత్తుతున్నది. 'బాబోయ్' అంటూ హటాత్తుగా పక్కమీదనుంచి లేస్తూనే స్విచ్ నొక్కేను. కానీ లైటు వెలగలేదు. ఈ హడావిడికి అర్జునరావు గాడు కూడా లేచాడు. జరిగిందంతా వాడితో చెప్పాను. వాడుమాత్రం నిర్లక్ష్యంగా "కలలో జరిగిన దానికింత భయంఎందుకురా పడుకో?" అన్నాడు.

"పడిశావ్, తెలివొచ్చినా గూడా ఎవరో చెవి గూబపట్టుకొన్నట్టయిందిరా అంటే!"

"నువ్వూ, నేనూ తప్ప ఇంకెవరున్నార్రా ఇక్కడ? కాకపోయినా వెధవ్వేసి చెవ్వితో ఎవడికి పనివచ్చిందోయ్? పడుకో! మాట్లాడకుండా!" అన్నాడు విసుగ్గా.

"ఒరేయ్ మీ బావగార్ని లేపరా, మెయిన్ స్విచ్ తీసేసి ఉంది. లైటు వెలగటం లేదు" అన్నాను.



# ★ చీకట్లో చిందులాట ★

"ఈమాత్రం దానికి అందర్నీ లేపటం ఎందుకు? పడుకోవోయ్ పిరికిపందా!" అన్నాడు వాడు వేళాకోళంగా.

ఇక విధిలేక పడుకొన్నాను. కాని నిద్ర పట్టటం లేదు. అర్జునరావు మాత్రం నిర్విచారంగా నిద్రపోతున్నాడు.

ఇలాగ ఒక అరగంట జరిగిందను కొంటాను. ఇంతలో "ఒరేయ్! అర్ధరాత్రప్పుడు అంకమ్మ శివాలనీ, యిప్పుడు వేళాకోళా లేంట్రా? ఇంకోసారి నాజుత్తు పట్టుకు పీకావంటే లాగి లెంపకాయ కొడ్తాను" అన్నీ అంటున్నాడు అర్జునరావు. నిద్దట్లో ఏదో కలవరిస్తున్నాడనుకొన్నాను నేను. ఆలాగే కాస్సేపు ఆలోచిస్తూన్నాను. ఇంతట్లో నే అర్జునరావు గబగబా లేచి నన్నొక్క లెంపకాయ కొట్టనే కొట్టేశాడు.

"నన్నెందుకురా కొట్టావ్?"

"ఎందుకో తెలీదేం?"

"ఏం? ఎందుకూ?"

"నాజుత్తు పీక వద్దని మొదటిసారి వార్నింగ్ ఇచ్చానా? మళ్ళీ ఎందుకు జుత్తు పీకావ్. అర్థరాత్రప్పుడు వేళాకోళా లేంట్రా?" ఇంకా యిలాగే ఏవేవో ప్రశ్నల వర్షం కురిపించేస్తున్నాడు.

"నీ కేమైనా మతిపోయిందా? నీజుత్తు ఎవడు పీకాడ్రా? ... నీకేమైనా దయ్యం పట్టిందేంటి?" అంటూ నేనూ ఎదురు తిరిగాను.

"ఏంట్రోయ్, ఈచీకట్లో చిందు లాటలు?" అంటూ మాగొడవంతా వింటూన్న వాళ్ళ బావగారు తలుపుతీసుకొని వచ్చారు. మెయిన్ స్విచ్ వేసి లైటు వెలిగించారు. ఆశ్చర్యం అర్జునరావు క్రాఫింగు ముందుభాగం చాలా వరకూ కత్తిరించుకు పోయింది. అర్జునరావు నాచెవికేసి ఆశ్చర్యంగా చూస్తూ "అదేంట్రా-చెవి గూబనుండి రక్తం వస్తోందే?" అన్నాడు.

వాళ్ళ బావగారు మాయిద్దరికేసీ ఆశ్చర్యంగా చూస్తున్నారు. అప్పటి మాముగ్గురి హృదయాల్లో వీర, శృంగార, భయ, రౌద్ర, విస్మయ భావాలు ఒకదాని తరువాత ఒకటిగా ఆవహించాయి. అక్కడ మేం ముగ్గురమూ తప్ప ఇంకెవ్వరూ లేరు. ఏదయ్యమైనా ఇట్లో చేరిందేమో నన్న అనుమానం చేత అర్జునరావు తలగడవద్ద గుట్టగా పడివున్న జుట్టును మాత్రం

(52-వ పేజీ తరువాయి)

# చీమలు చేసిన ద్రోహం



శ్రీ యజ్ఞా సుబ్రహ్మణ్యం

నాన్న అప్పుడే ఆఫీసు నుంచి వచ్చేరు. వీధి గుమ్మంలో కూర్చుని చదువు కొంటూన్నాను. బావగారి దగ్గిరనుండి ఉత్తరం వచ్చింది. అమ్మా నాన్న ఏదో విసుగ్గా మాట్లాడు కొంటూన్నారు. "బొత్తిగా డబ్బులేని యీ రోజుల్లో పెద్దెత్తున సూడిదలు జరపటం,నాకు యిష్టంలేదని" నాన్న ఉరుము తున్నారు.

అక్కయ్య అంటే అమ్మకు పంచప్రాణాలు గనుక, నాన్నగారి కోపానికి అమ్మ సమాధానం ఏడ్పు!

పుస్తకం మూసి ఇంట్లోకి వచ్చేను. అమ్మ ఏడుస్తోంది. నాకు జాలివేసింది. నాన్నగారితో "ఏమైనా లడ్డూలు చేయించి పంప కూడదా?" అన్నాను, ఆఫీసులో విసుగు, కడుపులో మంట, అమ్మ మీద మంట, వీటన్నిటి మూలంగా మంచిగా చెప్పిన నామాటలకి ఆయన మరింత మండిపోయి నావీపు మర్దన చేశారు.

వీపుమీద పడిన ఆనాలుగు దెబ్బలతో నాకు చెప్పలేనంత బాధ వేసింది. ఏడుస్తూపోయి అమ్మ కొంగు పట్టుకొని వేళ్లాడ బోయాను. ఆవిడ నాన్నగారిమీద కోపం కొద్దీ "అయినా ఈ వెధవకు యీ పెద్దకబుర్లెందుకు" అని నాదవడ మీద రెండు వేసింది. గోరు చుట్టు మీద రోకటి పోటయింది. నాన్న మెల్లగా అవతలకి జారుకున్నారు.

నాఏడుపు వినిపించింది కాబోలు-మా పక్కింటి వెంకాయమ్మత్తయ్య గారికి నా మీద జాలివేసింది. ఆవిడ నన్ను చేరదీసి అమ్మని నాలుగు చీవాట్లు వేసింది. నేను ఏడ్చినప్పుడే మా చెల్లాయీ కెవ్వుమని ఏడ్చి బెక్కుతూ మంచం మీదపడి నిద్రపోయింది. అత్తయ్య నన్ను వాళ్ళింటికి తీసుకెళ్ళి అన్నం పెట్టింది. ఇంటికి తీసుకొచ్చి చెల్లాయి పక్కనే పడుకోపెట్టింది. దుప్పటి ముసుగు వేసుకుని పడుకున్నాను. అమ్మ దీపం ముందు (దెయ్యంలాగా) కూర్చుని ఏదో గొణుక్కొంటోంది.

పాపం-మా అత్తయ్య వీపుకు నూనె రాసినా, మంట తగ్గలేదు. దుప్పటిలోంచి అమ్మవేపు కోపంగా చూస్తూనే ఉన్నాను. బయట కెళ్ళిన నాన్న ఎప్పుడొస్తారా అని ఎదురు చూస్తూన్నాను. అంతట్లో జోళ్ళ చప్పుడు వినిపించింది. దుప్పటి పూర్తిగ ముసుగుపెట్టి చెవులు మాత్రం దోరగా బెట్టుకొని నిద్రపోతూన్నాను. నాన్న స్నానికి నీళ్లు పెట్టమన్నారు. అమ్మ నీళ్లు పెట్టింది. అన్నం పెట్టమన్నారు. అమ్మ ఏమి మాట్లాడకుండా ఆయనకి అన్నం పెట్టి, గుమ్మం దగ్గరే కూర్చున్నది. కాస్సేపయిన తరువాత నాన్నగారు గొంతు సవరించి మెల్లిగా "సూడిద పంపిద్దామనుకుంటూన్నావా?" అని మొదలు పెట్టేరు.

"అది పుట్టింటి నుంచీ అంతే నోచుకున్నది. ఏదో పారేయండి, దాని మొఖాన్ని" అని గట్టిగా చెప్పేసింది.

నాన్న ప్రకాశం గారిని వదిరూపాయలు అప్పుఅడిగి తెచ్చేనన్ని, ఏదో త్వరగా తెల్చి పంపేద్దామని అన్నారు. లడ్డూలు చేసి పంపితే బాగుంటుందని తీర్మానించి కావలసిన వన్నీ పూస గుచ్చినట్టు ఒక లిస్టు చెప్పింది. నాన్న వ్రాసుకున్నారు. మళ్ళీ ఏం జరుగుతుందో అనే గుండె దడ తగ్గింది. దుప్పటి లేత వెలుగులో చెల్లాయి, అమ్మా నాన్న మాట్లాడుకొనే మాటలు ఎప్పట్నుంచీ వింటుందో, ఏమో, నావేపు చూచి నవ్వింది. 'నాకూ భలే నవొచ్చింది. వీపుమంట ఎలా తగ్గిందో తెలీకుండా కాస్సేపటికి నిద్రపోయాను.

ప్రొద్దున్నే లేచాను. అమ్మతోను నాన్నతోను మాట్లాడాలని లేదు. మార్నింగ్ క్లాసులు ప్రారంభించారు. త్వరగా వెళ్ళిపోవాలి. చెల్లాయి కాఫీ తెచ్చిపెట్టింది. త్రాగిబడికి పోయేను. బుద్ధి మాత్రం పాఠాలమీద లేదు. రెండు పీరియడ్లయ్యాయి. నాన్న బజారుకి



# ★ చీమలు చేసిన ద్రోహం ★

వెళ్ళుంటారనుకున్నాను. నాలుగో పీరియడయింది. నాన్న భోజనంచేసి ఆఫీసుకు పోయుంటారు. అమ్మ పాకాలు సిద్ధం చేస్తుంటుందనుకొన్నాను. అప్పటికే కడుపులో మండుతోంది. లడ్డూలు తయారౌతున్నప్పుడు అమ్మ ప్రక్కగా కూర్చొనివుంటే ఎంత బాగుండుననిపించింది. అయిదో పీరియడ్‌లో లెక్కల మాష్టారుకి ఏదో పాచిక వేసి ఇంటికి వచ్చేశాను.

అత్తయ్యా, అమ్మ పొయ్యి దగ్గర కూర్చున్నారు. పాకాలు చురుగ్గా సాగుతున్నాయి. అన్నం పెట్టే ఉంది. అయిదు నిముషాల్లో తినేసి అత్తయ్య పక్కన చేరేను. ఎంతసేపు కూర్చున్నా అమ్మ నా ఆశ గమనించనే లేదు. అంతా ఆఖరయ్యే వరకూ అలానే కూర్చున్నాను.

చివరకెప్పుడో "బొత్తిగా కొంచెం చేసేం; ఎత్తుకు పోకు" అంటూ అమ్మ నాకు ఒక లడ్డూ ఇచ్చింది. అత్తయ్య "అక్కయ్యకు కూతురు పుడితే నీకే ఇస్తుంది లేరా" అని నవ్వింది. అమ్మకి తెలియకుండా అత్తయ్య చెల్లాయికీ నాకు చెరొక లడ్డూ ఇచ్చింది. అమ్మమీద చాల కోపమొచ్చింది.

బిందె మూతికి గట్టిగా ముడేసి కిటికీపక్క పెద్దఅలమరాలో లడ్డూలు భద్రం చేసింది మా అమ్మ. కిటికీ ఇవతల పుస్తకాల బల్ల. సరే అన్నీ బాగానే అమిరివున్నాయి.

"రాత్రి నాన్న పెందలాడే భోం చేస్తున్నారు. నెమ్మదిగా కిటికీలోకి ఎక్కి బిందె గుడ్డకి చేతికి సరిపోయే కన్నం తయారుచేశాను. ఆరు లడ్డూలు తీసి అరుగు మీదికి తీసుకెళ్లాను. బాబూరావు తయారయ్యేడు. "విల్లు, బాణాలు కట్టి ఇస్తావా?" అని అడిగి, లడ్డూలు బేరం పెట్టేను. "రేపటికి విల్లు, మేకుతో మొనలు కట్టిన మూడు బాణాలు ఫష్టాసుగా చేసి ఇస్తానన్నాడు వాడు. సరే వాడికి ఆరు లడ్డూలు ఇచ్చి పంపేశాను.

రెండోసారి కిటికీమీదకి ఎగబడి ఒకచేయి బల్లమీద మరో చేయి అలమారు మీద వేసి నిలబడ్డా. రెండు లడ్డూలు పంట్లాం జేబులో ఎక్కించా. మరి రెండు తీస్తున్నా. అమ్మ ఏదో పనిమీద యీ గదిలోకి వచ్చి, "ఏమిట్రా అలా ఎగబడుతున్నావ్?" అని కేక వేసింది.

"అబ్బే ఏం లేదు! పెన్ను కని పించక పోతేను, పైఅరలో ఏ

(43-వ పేజీ చూడండి)

**బొమ్మరిల్లు సీరియల్**

**...ద్దె బోటులో–**

# ముచ్చటగా ముగ్గురు

## (కుక్క సంగతి సరే సరి!)

వేము అసలు ముగ్గురంకాదు; నలుగురం! జార్జి, విలియం శామ్యూల్ హారిస్సు, నేనూ, మాంటీ మొరెన్సీ. ఆ రోజు మేము నలుగురమూ నా గదిలో సమావేశమై చుట్టలు కాల్చుకొంటూ కూర్చున్నాం. ఏదో మాటల సందర్భంలో - ఎందుకు వచ్చిందో, ఎలా వచ్చిందో కానీ,—మా హీనస్థితిని గురించిన ప్రసక్తి వచ్చింది. 'హీనస్థితి' అంటే మరేదో అనుకోనేరు—మా శరీరాలకి సంబంధించిన హీనస్థితి మాత్రమే!

అదేమిటో కాని—మేం నలుగురమూ కూడా యీ మధ్య మహా యిదిగా తయారయ్యాం. ఈ పరిస్థితి చూచి మాకు మేమే చాలా హడిలిపోయాం. హారిస్ వున్నాడంటే—వాడికి తరుచు ఎక్కడ్లేని తల దిమ్మూ వికారమూ వచ్చేస్తుంటాయట. అలాంటి సమయాల్లో వాడేం చేస్తున్నాడో, ఏం చూస్తున్నాడో వాడికే తెలియకుండా పోతూవుంటుందట. ఈ మాట అనేసరికి, జార్జి, తనకూ అప్పుడప్పుడు అలాగే తల దిమ్ము వస్తూంటుందనీ, అది వచ్చినప్పుడు తనేం చేస్తున్నదీ, ఏంచూస్తున్నదీ తనకీ పూర్తిగా తెలియకుండా పోతున్నదనీ ఫిర్యాదు చేశాడు. ఇక నా విషయం చూడబోదామా అంటే,—అంతకంటె అధ్వాన్నంగా వుంది. ఐతే వాళ్లకీ నాకూ ఒక్క వ్యత్యాసం వుంది. వాళ్ళ శరీరాల్లో చెడిన భాగం బుర్ర అయితే, నా వొంట్లో చెడిన భాగం 'లివర్' (కాలేయం). ఈవిషయమైనా నాకెల్లా బోధపడిందీ అంటే—యిటీవల నేను ఏదో లివర్ మాత్రల ఎడ్వర్టైజ్‌మెంటు కరపత్రం చదవటం సంభవించింది. ఆ కరపత్రంలో కంపెనీ వాళ్లు, లివర్ చెడిపోయినప్పుడు మనిషి నడవడికలోనూ, ఆలోచనల్లోనూ, అవయవాలలోనూ ఏవే వికారాలైతే సామాన్యంగా వస్తుంటాయో, అవన్నీ ఏకరువు పెట్టుతూ ఒక పెద్ద జాబితా వ్రాశారు. అది సాంతం చదివే సరికి, అందులో వాళ్లు ఏవే లక్షణాలైతే పేర్కొన్నారో అవన్నీ, ఒక్కటికూడా బీరుపోకుండా, నాలో వున్నట్లు నాకే తెలిసిపోయింది.

నేను చెపితే నమ్ముతారో నమ్మరో కానీ, ఏ మందు తాలూకు కరపత్రం చదివినా, నేను యిలాగే జరుగుతుంటుంది. ఏయే లక్షణాలు కనిపిస్తున్నప్పుడు ఏ మందు వాడటం మంచిదని ఆ కంపెనీవాళ్లు అంటారో, ఆ లక్షణాలన్నీ మహావుధృతంగా నాలో వున్నట్లే తోస్తూవుంటుంది. మనిషి అయినవాడికి ఎన్ని రకాల రోగాలు రావటానికి అవకాశంవుంటుందో, అన్నిరకాల రోగలక్షణాలు నాలో వున్నట్లే అనిపిస్తుంటుంది.

ఈ సంగతి చెప్పతూవుంటే నా కొక విషయం జ్ఞాపకం వస్తున్నది. వెనుక నాకొకసారి వొంట్లో

మూలం :
జెరోమ్ కె. జెరోమ్
★
అనువాదం :
విశ్వాత్ముల నరసింహమూర్తి

# ముచ్చటగా ముగ్గురు

కొంచెం వుష్ణం తగిలింది. వుష్ణం అనేది అసలు ఎందుకు వస్తుందో, ఎల్లాపోతుందో తెలుసుకోవాలన్న బుద్ధిపుట్టి, బ్రిటిష్ మ్యూజియంకి వెళ్లాను. వెళ్లి, వైద్య గ్రంథమొకటి తీసుకొని జ్వరాలకు సంబంధించిన విషయం చదవటం మొదలుపెట్టాను. చదవటం మొదలుపెట్టినవాణ్ణి, ఆ వుష్ణానికిమాత్రం సంబంధించినంతమటుకు చదివేసి యివతలకు వచ్చినా సరిపోయేదేమో! అంతటితో ఆగక, వుబుసుపోకకోసం మిగిలిన అన్నిరోగాల విషయమూ తెలుసుకొందామన్న కుతూహలం కొద్దీ పేజీలు తిరగెయ్యటం మొదలుపెట్టాను. అలా చదువుకుపోగా, కొంతసేపటికి నాకు అసలు వచ్చిన రోగం ఏదో దాని పేరే మరచిపోయాను. ఆ విషయం మరచిపోయి, రుగ్మత అనేది శరీరంలో ప్రవేశించబోయేముందు మనిషితత్వంలో ఏయేరకాల లక్షణాలు కనిపిస్తాయో, ఆ లక్షణాలనుగురించి ముందుగా తెలుసుకోవటం మంచిదని, అవి చదవటం ప్రారంభించాను. సగమైనా చదివానో లేదో, అప్పటికప్పుడే నాకు వచ్చిన జబ్బు ఏదో అతిభయంకరమైనదే ననే దృఢమైన నమ్మకం నా మనస్సులో నాటుకుపోయింది.

నాకు యిక కాలూ చెయ్యీ ఆడ లేదు. ఉఛ్వాస నిశ్వాసాలు ఆగిపోయాయి. కూర్చున్న చోటనే గడ్డ, కట్టుకుపోయినట్లు, వొళ్లంతా బిగుసుకుపోయింది. అటువంటి నిర్జీవ స్థితిలో కూడా పేజీలు తిరగెయ్యటంమానలేక, అల్లా ఆపకుండా చదువుకుపోతూనే వున్నాను. ఒక పేజీలో టైఫాయిడ్ జ్వరాన్నిగురించి వ్రాసివుంది. ఆ రోగలక్షణాలు



గుండె పని చెయ్యాకపోగా, అందినంతమటుకు రొమ్ముమీదా, పన్నుమీదా ఫెడీఫెడీ బాదుకొన్నాను.

చదివాను. చదివేసరికి—నా వొంట్లో టైఫాయిడ్ జ్వరమనేది నాకు తెలియకుండా నే కొన్ని నెలలతరబడిగా గూడుకట్టుకొని కాపురంచేస్తున్నదని అనిపించింది. నా వొంట్లో ఇంకా ఎన్నిరకాల జబ్బులు యిలా దాక్కొనివున్నాయోనని భయంవేసింది. చంటిబిడ్డగుణం కూడా వున్నదేమో ననే అనుమానంవేసి దాని లక్షణాలు చదివాను. ఆ రోగమూ వున్నది!! నా తత్వం నాకే చమత్కారంగా తోచింది. ఇంకా ఏ జబ్బులు వున్నాయో తెలుసుకుతీరా లనుకొన్నాను. ఆ పుస్తకంలో రోగాలన్నిటినిగురించీ, ఏ, బి, సి, డి క్రమంలో వ్రాయబడివున్నది. ఆ క్రమం ప్రకారమే ఒకదానితరువాత మరొకటిగా అన్నిరోగాలనుగురించీ చదువుకొంటూపోయాను. ముందు "ఆగ్" (శీతపైత్య జ్వరం) జ్వరాన్నిగురించి చదివాను. నాలో ఆ జ్వరం ప్రవేశించివుండటమేకాదు; తక్షణమే దానికి తగిన మందు పడకపోతే మరొక పక్షంరోజుల్లో చాలా ప్రమాదం వచ్చేస్తుందని తేలిపోయింది. 'బ్రైట్స్ డిసీజ్' (రక్తపుపోటు,) అనేదిమాత్రం, దానితల్లి కడుపచల్లగా, నన్ను యింకా పూర్తిగా ఆవహించలేదు. నా వొంట్లో వుండేది యీ ఒక్కరోగమే అయితే, నాకింకా కొన్ని ఏళ్లపాటు జీవించే అవకాశం లేకపోలేదు. ఆ తరువాత కలరానుగురించి చదివాను. ఇంకా ఏవేవో ప్రాణాంతకమైన యితరరోగాలనికూడా, యీ కలరా తోడు తెచ్చుకొని నా వొంట్లో ఎప్పుడో ప్రవేశించినట్లు అప్పుడు పసిగట్టాను. 'డిఫ్తీరియా' (అంగుడువాపు)—నేను పుట్టటమే ఆ వ్యాధితో పుట్టినట్లున్నాను!!... ఈ వరసని ఇంగ్లీషు అక్షరాలు యిరవైఆరింటిలోనూ ఏ ఒక్కటీ వదిలిపెట్టకుండా, అన్నిరోగాలని గురించీ అతి శ్రద్ధగా చదివాను. అన్నీ చదువగా, సూతికా వాతం అనే ఆ ఒక్క వ్యాధితప్ప మిగిలిన సమస్తమైన రోగాలూ నా వొంట్లో వున్నట్లు రూఢి అయిపోయింది.

ఇన్ని రోగాలూ రాగా లేనిది, ఆ ఒక్క వ్యాధి మాత్రం ఎందుకు రాకుండా మిగిలిపోయిందా అని నా మనస్సుకి చాలా కష్టంతోచింది. ఆ వ్యాధి నాకు

ఎందుకు రాలేదు? ఈ ఒక్క వ్యాధి విషయంలో మాత్రం యీ పక్షపాతం ఎందుకుజరగాలి అని మహా బాధపడ్డాను. ఆ ఆవేదనతో కుతకుత వుడికిపోయాను. అల్లా కొంతసేపు ఎనలేని ఆవేదన పడినమీదట, మళ్ళీ నాలోనాకే అనిపించింది—వైద్య శాస్త్రానికి యింత మటుకు అందిన అన్ని వ్యాధులూ యిదివరకే వచ్చేసి నప్పుడు, యీ ఒక్కవ్యాధి రాకపోయినంత మాత్రం చేత ఎందుకు అంతగా పట్టించుకోవాలిలే, అని. లోకంలో వుండే రోగాలన్నీ నాకు ఒక్కడికే వచ్చేయాలని అనుకొనేటంత స్వార్థం ఏవరికీ పనికిరాదనీ కూడా నాకా క్షణంలో అనిపించింది.

పుస్తకం మూసేసి బల్లమీద పడేశాను. తీరిగ్గా కూర్చొని దీర్ఘంగా ఆలోచించాను. వైద్య శాస్త్ర దృష్ట్యా, నాలాంటి వ్యక్తి ఒక్కడు అందుబాటులో వుంటే వైద్య కళాశాలలవారికీ, వైద్య విద్యార్థులకూ ఎంత వుత్సాహంగా వుంటుందో వూహించుకొన్నాను. నాలాంటివాడు ఒక్కడు వున్నా, వైద్యకళాశాలల విద్యార్థులు రోగులని వెతుక్కొంటూ ఆస్పత్రుల చుట్టూ తిరగవలసిన అవసరం తప్పిపోతుంది. అన్ని రోగాలకీ ఆటపట్టయిన నేనే ఒక ఆస్పత్రిలాంటివాణ్ణి కావటంచేత, వైద్యవిద్యార్థులు అంతంత శ్రమపడి ఆస్పత్రులచుట్టూ తిరిగి ప్రతిరోగినీ చూసి, ఆ యాతన లన్నీ పడేబదులు, రోజుకొకసారి నాచుట్టూ నాలుగు ప్రదక్షిణాలు చేశారంటే చాలు — సునాయాసంగా డాక్టరు పట్టాన్ని సంపాదించుకోవచ్చునే !!

ఈ మాటలకేంవచ్చెగానీ, యీ లెక్కని చూస్తే, ఇక ఎంతకాలం బ్రతికి వుండగలననే ఆలోచన నా మెదడులో కదిలింది. ఆ ప్రశ్నకి ఏదో విధంగా నేనే సమాధానం చెప్పుకోవాలని చూశాను. నా నాడి నేనే పట్టుకు చూడబోయాను. మొదట్లో అది అందనేలేదు. అలాంటిది, వున్నట్లుండి ఒక్కసారిగా నిద్రలేచి పనిచేయటం ప్రారంభించినట్లు, దడ దడా కొట్టుకోవటం మొదలుపెట్టింది. నాకు కంగారేసింది. జేబులోంచి గడియారంతీసి బల్లమీద ఎదురుగా పెట్టుకొని, టైంచూస్తూ నాడి లెక్కపెట్టడం మొదలు పెట్టాను. నిమిషానికి 147 సార్లు కొట్టుకొన్నది! గుండె ఆగినంత పనయింది. అసలు గుండె అయినా సరిగ్గా కొట్టుకొంటున్నదో లేదో చూద్దామని బుద్ధిపుట్టి, రొమ్ముమీదికి చెయ్యిపోనిచ్చాను. అదీ ఎప్పుడో ఆగి పోయింది!! ఆగిపోయిన గడియారాన్ని జబ్బపుష్టి కొద్దీ ఆడిస్తే అప్పుడప్పుడు ఆడుతూవుంటుందిగా? అలాగే నా గుండెకాయనికూడా గట్టిగా ఆడిస్తేఅయినా ఆడుతుందేమోననే వెర్రిఆశ ఒకటి నాలో పుట్టుకొచ్చింది. నడుము అనబడే భాగందగ్గిరనుంచీ నడినెత్తిపైదాకా పిడికిలిబిగించి గుద్దుకొన్నాను. అక్కడికీ గుండె పని చెయ్యకపోగా, రొమ్ముమీదా అందినంతమటుకు వెన్నుమీదా ఫెడీ ఫెడీ బాదుకొన్నాను. ఊహూ! అప్పటికీ గుండె కొట్టుకోలేదు. చాలా నిరుత్సాహపడి పోయి, ఏంచెయ్యటానికీ తోచక తికమకపడ్డాను. పోనీ, నాలిక అయినా ఎలావుందో చూసుకొందామనిపించి, నాలిక అనేది నోట్లోనుంచీ ఎంతపొడుగు బయటకు రాగలదో అంతవరకూ బయటకు జాపిపెట్టుకొని, ఒక కన్నుమూసి రెండోకంటితో చూసుకోవటానికి ప్రయత్నించాను. కుడికన్నుమూసి ఎడమకంటితోనూ, ఎడమకన్నుమూసి కుడికంటితోనూ చూశాను. చూడగా, చూడగా చివరికెప్పుడో నాలిక చివరికొస మాత్రం కనిపించినట్లు అనిపించింది. ఆ కాస్తనే వీలైనంత పరీక్షగా చూశాను. అంతకష్టపడి చూసినందు వల్ల చివరకువచ్చిన ఫలితం ఏమిటంటే—పొంగువచ్చిందేమోననే నా అనుమానం మరింత దృఢపడింది.

జీవితం ఎంత చిత్రమైందో చూశారా?—బ్రిటిష్ మ్యూజియంలోకి కాలుపెట్టే క్షణాన నిక్షేపంలావున్న మనిషిని, అంతలో ఎందుకూ కొరగాని రోగిష్టిగా తయారయ్యాను! ఆ స్థితిలోనే బయలుదేరి నాకొక డాక్టరుమిత్రుడువుంటే, ఆయన దగ్గరకు వెళ్లాను.

ఇదివరలో నేను ఎప్పుడు యీ మిత్రుడి దగ్గరకు పోయినా, అతను అవసరంవున్నా లేకపోయినా కూడా, నా నాడి పరీక్షచేసేవాడు. నాలిక జాపమని, దాన్నంతా ఏమిటో అతి పరీక్షగా చూసేవాడు. ఇవన్నీ పూర్తి అయ్యాక కానీ, మామూలు విషయాలైనా మాట్లాడేవాడు కాదు. నా ఆరోగ్యాన్నిగురించి మామూలు రోజుల్లోనే అంతగా శ్రద్ధతీసుకొనే మిత్రుడికే నాకేసు గనుక యిప్పుడు అప్పగించేస్తే, అది యిద్దరకీ లాభదాయకమనిపించింది. “డాక్టరనేవాడికి కావలసింది ఏమిటీ?—ప్రాక్టీసు! అతడికి ఎంత ప్రాక్టీసు

# ★ ముచ్చటగా ముగ్గురు ★

కావాలంటే అంత ప్రాక్టీసూ, నా ఒక్కడి మూలంగానే వచ్చేస్తుంది. ఆ మాటకొస్తే — ఒకటి, అర చొప్పున చిల్లర మల్లర జబ్బులతో బాధపడే వెయ్యి మంది మామూలు రోగుల ద్వారా ఆతనికి రాగల ప్రాక్టీసుకంటే, నా ఒక్కడివల్ల అంతకు రెండింతలు అనుభవం లభిస్తుంది.' ఈ విధంగా నాలో నేనే తర్కించుకొన్నాను. సరాసరి అతని బసకే వెళ్ళి, అతన్ని చూశాను.

"ఏమిటి విశేషం ?" అన్నాడు మా డక్టరు మిత్రుడు.

"విశేషాలకేం ? కావలసినన్ని! అవన్నీ ఏకరువు పెట్టి నీ కాలాన్ని వృధాచేయటం నాకు యిష్టం లేదు. 'జీవితం బుద్బుదప్రాయం' అన్నారు పెద్దలు! నేనివన్నీ సాంతం చెప్పేలోగానే నీకు నూరేళ్ళూ నిండి పోవచ్చు. అందుకని నాకు వచ్చిన వ్యాధులపేర్లు ఏకరువు పెట్టడం మానేసి, నాకింకా రానివ్యాధి ఒక్కటే వుంది కాబట్టి దాని పేరుమాత్రం చెప్పేస్తాను...

"సూతికావాతం ఒక్కటి తప్ప మిగిలిన అన్ని వ్యాధులూ యీ క్షణాన నా వొంట్లో వున్నాయి. 'అదికూడా ఎందుకు రాలేదు'అని నీవు అడిగేట్లయితే మాత్రం, నేనేమి సమాధానం చెప్పలేను!" అన్నాను.

ఇన్నిజబ్బులూ వున్నాయన్న విషయం నాకు ఏ సందర్భరీత్యా తెలిసొచ్చిందోకూడా మా మిత్రుడికి ఎరుకపరిచాను.

వెంటనే నా మిత్రుడు నన్ను బల్లమీద పడుకో బెట్టి చొక్కా, కోటు, బనీను అన్నీ విప్పించేసి, నా మీదికి వంగి ఏమిటో అతిశ్రద్ధగాచూశాడు. ఉన్నట్లుండి నా మణికట్టు ఒక చేత్తో పట్టుకొని, నేను పరధ్యాసగా వున్నప్పుడో రెండో చేత్తో నా ఎదురురొమ్ము మీద బలంగా కొట్టాడు. ఎంతశత్రువైనాకూడా వైద్య పరీక్ష నెపంతో పరాయిమనిషిని పడుకోబెట్టి, యిల్లా గుండెలమీద కొట్టటం చాలానీచమైనపని అనిపించింది. అతగాడు అంతటితో ఆగలేదు. నా డొక్కలోకి తలతో కుమ్మటం మొదలుపెట్టాడు. ఇదంతాపూర్తి అయ్యాక ఎప్పుడో నన్ను వదలిపెట్టి దూరంగాపోయి టేబుల్ ముందు కూర్చొని, ఒక కాగితంమీద మందువాకులు ఏవో వ్రాసి, ఆ కాగితాన్ని మడిచి నా చేతికి యిచ్చాడు. ఆ కాగితంలో ఏం రాశాడో అనైనా చూడకుండా, దాన్ని ఆపళంగానే జేబులో భద్రంగా పెట్టుకొని బయటికి వచ్చేశాను.

ఏకాయెకిని, సమీపంలో మందులు అమ్మే అంగడి ఒకటివుంటే, అందులోకి వెళ్లి, మడిచినచీటిని అంగడి మనిషికి అందించాను. ఆ పెద్దమనిషి కాగితం మడతలన్నీ విప్పి పై నుంచీ కిందివరకు చదివి, నా వంక ఎగాదిగా చూశాడు: ఆ కాగితాన్ని మళ్లీ అన్నిమడతలూ జాగ్రత్తగాపెట్టి నా చేతికి అందించేడు. నేను తెల్లబోయాను. "అదేమిటి ? మీది మందులు అమ్మే దుకాణంకాదా !"అని అడిగాను.

"అవును మాది మందులదుకాణమే. ఇదేగనుక అపరాలు అమ్మే అంగడి అయివుండి, దీనికి అనుబంధంగా ఒక హోటల్కూడా నడుస్తూవుంటే, ఆ చీటిలో వ్రాసివున్న ప్రకారం చెయ్యగలిగేవాళ్లం. కానీ— మాది ప్రస్తుతానికి మందులుషాపుమాత్రమే. కాబట్టి, మీకు ఏ విధంగానూ వుపయోగపడలేము" అన్నాడు అంగడిమనిషి.

ఆ కాగితం మడతలువిప్పి, అప్పుడు చదివాను. అందులో యిలా వ్రాసివున్నది.

"1 పౌను ఎద్దుమాంసం;

1 పౌను బీరు—ప్రతి 6 గంటలకూ ఒకసారి చొప్పున పుచ్చుకోవాలి.

ప్రతి వుదయమూ 10 మైళ్లు నడవాలి,

ప్రతి రాత్రీ 11 కొట్టేసరికి నిద్రపోయి తీరాలి.

అర్థంకాని విషయాల జోలికిపోయి బుర్ర పాడుచేసుకోకుండా వుండటం చాలా అవసరం !!"

పైన పేర్కొన్న చికిత్సా విధానాన్ని తు. చ. తప్పకుండా కొంతకాలంపాటు పాటించాను. ఫలితం సంతృప్తికరంగానే వుంది. పోవలసిన ప్రాణంపోకుండా నిలిచింది. మీ దయవల్ల ఇప్పటికింకా బ్రతికేవున్నాను.

ఇంతకీ చెప్పవచ్చిన లివర్ మాత్రల కరపత్రం విషయం సాంతం చెప్పనేలేదు. మళ్లీ ఆ విషయానికి వద్దాం. ఆ కరపత్రంలో పేర్కొన్న అన్ని రోగ లక్షణాలూ పొరపాటు పడటానికి వీలులేనంత ప్రస్ఫుటంగా నాలో కనిపిస్తున్నాయని చెప్పాను కదూ ?— అందులోనూ ముఖ్యంగా ఒక్క లక్షణం మరీ ప్రస్ఫు

టంగా వుంది. అదేమిటంటే — "ఏ పనిచేయటానికి ఉత్సాహం లేకపోవటం" అనేది.

ఏ పనిమీదికీ మనస్సుపోకపోవటంవల్ల నేను ఎంతగా బాధపడుతున్నానో, మామూలు మనిషి ఎవ్వడూ మాటల్లో వర్ణించి చెప్పలేడంటే, అందులో అతిశయోక్తి ఏమీ లేదు. చిన్నప్పటినుంచి నన్నీరోగం


# సౌందర్యమునకు ఆధారము మీ చర్మము





## మీ ముఖసౌందర్యమును కాపాడుకొనండి

ఎండ మరియు దుమ్ము. వేడిమి మరియు చల్లదనము. తేమ మరియు వాన . . . ఇండియాలో వీటినుండి మీ చర్మమును మీరు కాపాడుకొనవలయును. హిమాలయా బుకే స్నో విపరీత శీతోష్ణస్థితుల నెదుర్కొనుటకై ప్రత్యేకముగా తయారు చేయబడినది. మీ చర్మమును మీగడవలె మెత్తగాను, మృదువుగాను, స్వచ్ఛముగాను నుంచేటందుకు ప్రతిదినము దానిని వాడండి. పౌడరు రాసుకొనుటకు ముందు దీనిని వాడుటకు మీరు మిక్కిలి ఇష్టపడుతారు. దాని సువాసనను మీరు మెచ్చుకొంటారు.






# హిమాలయా బుకే స్నో

మరియొక దివ్యమైన ఇరాస్మిక్ సరకు

HBS. 8-X52 TL

ఇరాస్మిక్ కంపెని లిమిటెడ్, లండన్ వారి తరఫున ఇండియాలో తయారుచేయబడినది

 

# ముచ్చటగా ముగ్గురు



పట్టుకు పీడిస్తోంది. లివర్‌లో ఏదో దోషం వుండబట్టే నాకు ఏపని చెయ్యటానికీ బుద్ధిపుట్టకుండా వున్నదనే విషయం మా పెద్దవాళ్లకి ఎవ్వరికీ తెలిసేది కాదు. అదంతా నా సోమరితనం క్రింద జమకట్టి, వాళ్లు నన్ను గురించి అనేక రకాలైన అపోహాలు పెంచుకొనేవారు. అందుకు వాళ్లను అనవలసిన పనికూడా లేదనుకోండి— ఆ రోజుల్లో వైద్యశాస్త్రం యింతగా అభివృద్ధికాలేదు.

"ఏంరా? సోమరి వెధవలా అల్లా అస్తమానం కూర్చోకపోతే, కాస్త వొళ్లువొంచి బతుక్కి—పనికొచ్చే పని ఏదైనా చేసుకోరాదట్రా?" అంటూ నాకు బుద్ధి చెప్ప వచ్చేవారు. నాకూ ఒక లివర్ వున్నదనీ, ఆ లివర్ చెడిపోయిందనీ, ఆ కారణంచేతనే నేనిల్లా తయారయ్యాననీ వాళ్లు అర్థం చేసుకొనేవారు కాదు.

ఇది ఏమైనా బోధపడివుంటే — పాపం — వాళ్లైనా నాకేవో మందులు, మాకులు వేసేవాళ్లే! అజ్ఞానంచేత మందులు వెయ్యటం మానేసి, తలమీద మొట్టికాయలు మాత్రం మహా విరివిగా తగిలించేవారు. అదేమిచిత్రమో కానీ—మొట్టికాయ పడంగానే నా రోగం తక్షణం మటుమాయమయ్యేది. (మళ్లీ కాస్సేపటిలోనే యథాప్రకారం బద్ధకం వచ్చి పడేదనుకోండి - అది వేరే విషయం!) ఏమైనా



—యిప్పుడు నాకు ఆలోచించి చూస్తే—యీరోజున పెట్టెడు మాత్రలు పుచ్చుకొన్నా కనుపించని గుణం, ఆ రోజుల్లో ఒక్క మొట్టికాయ తింటేనే కనిపించేదనిపిస్తోంది. అది తిని తినకముందే కూర్చున్న చోటినుంచీ లేచి గంతేసి పోయి, చెప్పిన పని చక్కగా చేసుకు వచ్చేవాణ్ణి.

మనమంతా ఏమిటో అనుకొంటాం కానీ— నిజానికి వైద్యశాస్త్రం యింతగా అభివృద్ధి అయ్యాక యీరోజున డాక్టర్లు వేసే యింతింత ఖరీదైన మందులకంటే, మన పెద్దవాళ్ళూ, ముసలమ్మలు ప్రయోగించిన యీమాదిరి చిటకా వైద్యమే బాగా పనిచేసేది.

ఈ మాటలకేం వచ్చె గానీ—అసలు విషయానికి వద్దాం. నా గదిలో మేం నలుగురమూ కూర్చొని బాగా ఒక గంటసేపు మా అనారోగ్యస్థితులని గురించి చెప్పుకొన్నాం. ప్రొద్దున ప్రక్కమీదనుంచి లేచేసరికి నా వొళ్లు ఎల్లా వుంటుందో జార్జికీ, హారిస్సుకీ వివరించి చెప్పాను. రాత్రి పక్కమీద పడుకోబోయేటప్పుడు తన కెట్లా వుంటుందో హారిస్సు మాకు చెప్పాడు. ప్రక్కమీద పడుకోబోయేటప్పుడు, ప్రక్కమీది నుంచి లేచేటప్పుడు ఎల్లా వుంటుందో ఆ విషయం అల్లా వుంచి, ప్రక్కమీద పడుకొని వున్నప్పుడు తనకు ఎల్లా వుంటుందో అదంతా, జార్జి అభినయపూర్వకంగా వివరించాడు.

జార్జి చిత్రమైన మనిషి. వాడు తను చాలా జబ్బు మనిషి ననుకుంటాడు. నిజానికి వాడికి ఏ జబ్బూ రాదు.

మా ప్రసంగాలు యీదశకి వచ్చేసరికి మా యింటి యజమానురాలూ, మా అన్నదాత అయిన మిసెస్ పోపెట్స తలుపుతట్టి, 'భోజనం పట్టుకురమ్మంటారా?' అని అడిగింది. భోజనం మాట వినేసరికి, ఆ క్షణంవరకూ రుగ్మతలతో బాధపడిపోతున్నామనుకొంటున్న మా మనస్సుకి ఎంతో హాయి అనిపించింది. ఒకరినొకరం చూసుకొని చిరునవ్వులు నవ్వుకొన్నాం. కడుపులోకి యింత ఆధరవు పడేస్తేనే ఎందుకైనా మంచిదని అందరమూ లోలోపలనే తీర్మానించుకొన్నాం. 'కాకపోయినా కడుపులో ఎప్పుడూ ఏదో ఒకటి పడేస్తుంటేనే ఎంతలావు వ్యాధి అయినా అణిగి మణిగి వుంటుంద'ని మా హారిస్ బహిర్గతంగా సూత్రీకరించి చెప్పాడు.

మిసెస్ పోపెట్స్, ట్రేలో భోజనం పట్టుకొచ్చి మాముందు పెట్టింది. అందరమూ టేబిల్ముందుకి

(52-పేజీ చూడండి)

# చీమలు చేసిన ద్రోహం

(౩౬-వ పేజీ తరువాయి)

ఉందేమో అని వెదుకుతున్నా" అని తప్పించుకున్నాను. అమ్మ మళ్లీ వంటయింట్లోకి వెళ్లిపోయింది. ఇదే సమయముగదా అని యింకొక రెండు లడ్డూలు తీసి మరొక జేబు నింపేను. మరొకటి నోట్లో వేసుకొని గబగబ మింగేశాను.

రేపటికోసం తెలుగర్థాల పుస్తకంలో ఆఖరు కాగితం చింపి మూడు లడ్డూలు అందులో పొట్లాం కట్టి పై అరలోనే కనిపించకుండా దాచిఉంచేను. మరి రెండు చేతితో తీసి క్రిందికి దిగేను. అంతలో నాన్నగారి భోజనం పూర్తి అయినట్లుంది. నా వేపే వస్తూన్నారు. చేతిలోనివి మాయం చేయవలసిన అవసరం వచ్చింది. నాన్నగారు విప్పినకోటు అక్కడే తగిలించిఉంది. చేతిలోవి కోటు చేబులోకి జారవిడిచి, గాటుజేబులోవి కనిపించకుండా పక్కవాటుగా అరుగుమీదికి జారుకున్నాను. నా జేబులోవి చెల్లాయి పసికట్టింది. దానికి రెండు వాటా పెట్టక తప్పింది కాదు. 'అమ్మకు తెలీ కూడదు, జాగ్రత్త' అని చెప్పేను. అవి రెండూ పుచ్చుకొని మంచంమీదికి పోయి పడుకొంది చెల్లాయి.

తరువాత అమ్మ సరాసరి నా దగ్గరికే వచ్చింది. "అత్తయ్య చూస్తుంటుంది గానీ, చెల్లాయీ, నువ్వూ కొట్టుకోకుండా ఉండండేం! నాన్నగారు, నేను తెల్లవారుఝాము బండికి అక్కయ్యగారింటికి వెళ్ళి, రెండురోజుల్లో తిరిగి వచ్చేస్తాం" అన్నది. 'సరే' అన్నాను. "చాలవేళయింది నిద్రపోకూడదూ" అన్నది నా జట్టు సవరిస్తూ. "పెద్ద పరీక్షలు దగ్గరకొచ్చేస్తున్నాయి ఇంకా చదువుకోవాలి, తెల్లవారుఝామున కూడ లేవమ"ని బుద్ధిమంతుడులా చెప్పేను. కాస్సేపు పైపైనంత గట్టిగా తెలుగర్థాలుచదివేను. అంతలో నిద్రఆవరించింది. మత్తుగా నిద్రపోయాను.

తెల్లవారేక అమ్మ లేపింది. జేబులో వేసుకొన్నలడ్లు రెండూ పిండి పిండిఐపోయేయి. ఇంతలో అమ్మ లడ్డూ బిందె తీసింది కాబోలు - బిందె జోసి పోడం, గుడ్డకొక కన్నం వుండటం, లోపల ఒక ఎలుక లడ్డూలు భక్షిస్తూండడం చూసింది: "మాయదారిముండా ఎలకలు! కాపరాన్నిలా పాతం జేస్తున్నాయి" అని గుండెలు బాదుకోడం వినిపించింది.

జేబులో పొడి వాకిట్లోకి విసిరేసి అమ్మదగ్గరకు వెళ్ళి "రాత్రంతా బొడ బొడ ఒకటే శబ్దం! మరేమో అనుకున్నాను. ఈ ఎలకలేకాబోలు!" అని ఎలకలమీద అమ్మకు ఏర్పడ్డ అనుమానం మరింతబలపడేలా చేశాను.

అవతల నాన్నగారు కోటు తొడుక్కొని "ఇంకా ఎంతసేపు? ఆడాళ్లతో ప్రయాణం ఇంతే!" అని జేబులు తడుముకోవటం మొదలుపెట్టారు. చేతిమీద ఏదో కుట్టినట్లున్నాయి; కంగారుగా చీమలు పట్టిన లడ్డులు బయటికి తీసి పారేశారు. "ఇవి ఇందులో కెలాగొచ్చాయి చెప్మా" అని తొడుక్కొన్న కోటు విప్పేసి దులుపుకోవడం ప్రారంభించేరు.

నా గుండెల్లో రాయిపడింది. అరుగుమీదికి జారుకున్నాను. ఇదంతా ఎలుకలపనే నని అమ్మ అంది. నాన్న 'వాడిపనే' అన్నారు. "ఆ వెధవాయిన్ని ఇలా తీసుకురా" అని కూడా అన్నారు. అమ్మ నన్ను ఇంట్లోకి తీసుకెళ్లింది. నాన్న ఎదుటకూడా ధైర్యంగా అది ఎలుకలుచేసిన పనే అన్నాను. ఎంత ధైర్యంగా చెప్పినా లాభం లేకపోయింది. నావీపు మళ్ళీ మోగింది. "ఈ కోతిపనులుకూడా ఆరంభించావ్" అంటూ అమ్మకూడా కొట్టింది. బాధఎక్కువయినా నిన్నటంత గట్టిగ ఏడ్వలేదు. కాని ఏడవకతప్పిందికాదు.

తెల్లవారింది. అత్తయ్య వచ్చి "ఇంకా వెళ్ళలేదేం?" అని అమ్మని అడిగింది. అమ్మ జరిగినకథ అంతా చెప్పింది. ఇద్దరూకలిసి వీధిలో విసిరిన లడ్డూల పొడి చూచేరు. చెల్లాయి తలదిండుక్రింద దాచుకున్న లడ్డూలపొడి చూచేరు. మరునటి లగ్నంలోనే చెల్లాయి పెళ్లి కూడ చేసారు. మార్నింగ్ క్లాసులకు టయమయింది. వెళ్లకతప్పదు. పుస్తకాలు సర్దుకున్నాను. అలమారుమీద లడ్డూల పొట్లాంనుంచి గోడమీదుగా చీమలు బారు సాకుతూన్నది. జరిగిందంతా తలుచుకొనేసరికి నాకు కడుపులో తిప్పినట్లు అయింది. తలొంచుకుని బడికెళ్తూంటే "వెధవా, చిన్న ఎలకలకి పెద్దెలకలు సాయమయ్యాయిరా" అని వెక్కిరించింది, అంత మంచి అత్తయ్యకూడా! ★



షోరీఫిలిమ్స్‌వారి "ఏక్ దో తీన్"లో మీనా.

# సెర్గీ ఐజెన్‌స్టీన్—2

## స్వదేశానికి తిరుగురాక

ఐజెన్‌స్టీన్ అమెరికన్ పర్యటన అమెరికన్ ట్రాజెడీగానే పరిణమించింది. తిరిగి స్వదేశానికి వచ్చేశాడు. కొన్నాళ్ళపాటు చిత్రనిర్మాణం మాటే తలపెట్టలేదు. ఫిలిం కాలేజీలో విద్యార్థులకు ఫిలిం థియరీని బోధిస్తూ గడిపాడు. అతని చేతికింద అనేకమంది ప్రతిభావంతులైన యువక దర్శకులు బయలుదేరారు. పత్రికల్లో ఫిలిం కళను గూర్చి వ్యాసాలు రాసేవాడు. అనేక పుస్తకాలు చదివేవాడు. ఐజెన్‌స్టీన్ విషయ పరిజ్ఞానం అనంతం. ఫ్రెంచి, జర్మన్, స్పానిష్, ఇంగ్లీష్, రష్యన్ భాషల్లో గొప్ప పాండిత్యం సంపాదించాడు. నవలలు, కవిత్వంనుంచి సాంఘిక, ఆర్థిక, తాత్విక శాస్త్రాలదాకా అన్ని విషయాలు తరిచి చూశాడు. ఏ పుస్తకం చదువుతున్నా మార్జిన్‌లో ఫిలిం నిర్మాణానికి పనికివచ్చే నోట్సు, ఆ పుస్తకంలోనుంచే గ్రహించి రాసుకునేవాడట.

ఈ పుస్తకాలు కొని చదవటం ఎంత విపరీతంగా పరిణమించిందంటే, అతని ఇల్లు ఇల్లంతా పుస్తకాలతో నిండి వుండేదట. (అతను పెళ్ళి చేసుకోనేలేదు. అందుచేత పిల్లా పీచు బాదర బందీ వుండేది కాదు.) ఎక్కడ చూసినా పుస్తకాలకట్టలు వుండేవిట. వాటి మధ్యనే పడుకునేవాడు. ఏదన్నా పుస్తకం కావల్సివస్తే అది ఇంట్లోనే ఉన్నప్పటికీ వెదకటం వృథా ప్రయాసగనుక, పోయి ఇంకో పుస్తకం కొనుక్కుని వచ్చేవాడట.

అతను ఇంకా నిర్మాణాత్మకకృషి ఏమీ లేకుండా గడుపుతుండగా మాస్కోలో చలనచిత్రోత్సవం జరిగింది. ఈ ఉత్సవంలో మిగతా ప్రసిద్ధ దర్శకులందరికీ సన్మానాలు జరిగాయి. బహుమతులు ఇవ్వబడ్డాయి. ఐజెన్‌సీన్‌కు మాత్రం ఏమీ జరగలేదు. దానితో అతనికి పౌరుషం వచ్చి మళ్ళీ చిత్రనిర్మాణానికి పూనుకున్నాడు. అదీగాక స్టాలిన్ అతన్ని ఉద్దేశించి "ఆ దుర్మార్గుడు మళ్ళీ ఏదన్నా మంచి చిత్రం తీస్తేనే గాని నేను బహుమ ఇవ్వదలుచుకోలేదు." అన్నాడట. ఈ సవాలును స్వీకరించి ఐజెన్‌స్టీన్ చిత్ర తీయ సంకల్పించాడు. "బెజిన్ మైదానం" అనే చిత్రం ప్రారంభమైంది. ఏ కా ణాలవల్లనో తెలియదుగాని ఈ చిత్రం రెండుసార్లు ప్రారంభించి రెండుసార్లూ మానివేశాడు. దానితో కమ్యూనిస్టుపార్టీ సెంట్రల్ కమిటీ అతన్ని ఫార్మలిస్టు అనీ స్వాతిశయ పరుడనీ తీవ్రంగా విమర్శించింది.

ఆ తరవాత ఐజెన్‌స్టీన్ మళ్ళీ కొంత కాలం ఊరికేనే ఉన్నాడు. ఇంతలోకే రెండో ప్రపంచయుద్ధం ప్రారంభమైంది. ఈ యుద్ధం అతన్ని మళ్ళీ ఒకసారి ఊగించింది. ఇంకొక చిత్రం ప్రారంభించాడు. జర్మన్లతో హోరాహోరి పోరాడుతున్న స్వదేశీయులను దేశభక్తితో ఉద్రిక్తులను చేయడానికి అనువైన కథను ఎన్నుకు

జూపిటర్ వారి "ఇన్స్పెక్టరు" తెలుగు చిత్రంలో పేరుపొందిన తమిళ నటుడు టి. కె. షణ్ముగమ్‌ను బాకుతో బెదిరిస్తున్న అంజలీదేవి.



# సెర్గీ ఐజెన్‌స్టీన్

...న్నాడు. ఏడు వందల ఏళ్ళ క్రిందట జర్మన్లు ఇలాగే రష్యాపై దండెత్తారు. అప్పుడు అలెగ్జాండర్ నెవ్‌స్కీ అనే రాజవంశీకుడు జర్మన్ల నెదుర్కొని రష్యాను రక్షించాడు. ఈ ఇతివృత్తం తీసుకుని ఐజెన్‌స్టీన్ చిత్రం తీశాడు. ఇదే అతని మొదటి టాకీ చిత్రం. ఈ చిత్రం మనదేశంలో "రష్యన్ వీరుడు" (వారియర్ ఆఫ్ రష్యా) అనే పేరుతో విడుదలయింది. ప్రసిద్ధ రష్యన్ సంగీతకారుడు ప్రోకోఫియవ్ దీనికి సంగీత దర్శకుడు. (ప్రోకోఫియవ్ ఇటీవలే రెండు నెలల క్రింద చనిపోయాడు.) ఈ చిత్రంలో యుద్ధదృశ్యాలలో ఐజెన్‌స్టీన్ చూపిన ప్రతిభ అపూర్వం. నేపథ్య సంగీతాన్ని ఎందుకు, ఎప్పుడు, ఎలా ఉపయోగించుకోవాలో ఈ చిత్రం చూసి నేర్చుకోవచ్చు.

ఐజెన్‌స్టీన్ తరువాతి చిత్రం "ఇవాన్ ది టెరిబుల్". ఇదికూడా "అలెగ్జాండర్ నెవ్‌స్కీ" లాగానే రష్యన్ చరిత్రనుండి తవ్వి తీయబడినది. ఐజెన్‌స్టీన్ ఈ చిత్రాన్ని మూడు భాగాలుగా సీరియలైజ్ చేసి తీద్దామనుకున్నాడు. మొదటిభాగం పూర్తయింది. రెండో భాగం కూడా పూర్తిచేశాడు కాని చారిత్రకంగా కొన్ని దోషాలున్నాయని విమర్శకులు విమర్శించారు. ఐజెన్‌స్టీన్ ఈ విషయమై స్టాలిన్‌తో ముఖాముఖి చాలసేపు చర్చించాడు కూడాను. ఈ చర్చ ఫలితంగా కొన్ని మార్పులు చేయ సంకల్పించాడు. ఇంతలోనే వ్యాధిగ్రస్తుడై మరణించాడు.

అతడు 1948 ఫిబ్రవరి 10 వ తేదీన, తన యాభైయవ ఏట మరణించాడు. తన లైబ్రరీ గదిలోనే కుర్చీలో కూర్చుని ఏదో పని చేస్తూనే మరణించాడు. మరణించినట్టు తెల్లవారిన తరవాత మిత్రులు వచ్చి చూసే వరకూ తెలియలేదు. బల్లమీద కలర్ చిత్రాలమీద, త్రీ డైమన్షనల్ చిత్రాలమీద అతడు రాస్తున్న పుస్తకం వున్నది. దాని పక్కన కొన్ని మార్క్సిస్టు గ్రంథాలు తెరిచి వున్నాయి.

ఐజెన్‌స్టీన్ గొప్ప మేధావి. అతడు రాసిన సిద్ధాంత గ్రంథాలు చదివితే మార్క్స్ ప్రవచించిన గతితార్కిక భౌతికవాదాన్ని కళాసృష్టికి కూడా జయప్రదంగా అన్వయించగలిగాడని తెలుస్తుంది. ముఖ్యంగా సినిమా కళలో గతితార్కికవాదం (డయలెక్టిక్స్) ఎలా పని చేస్తుందో చూపించాడు. వేర్వేరు షాట్లను అతికించటంలో ఒక షాట్ మరొక షాట్‌తో సంఘర్షించేలాగ (*Conflict*) అతికించాలనీ, ఈ సంఘర్షణ ఫలితంగా ఆ రెండుషాట్లలోని భావాలకు భిన్నమైన కొత్తభావం బయలుదేరి ప్రేక్షకుని పై ప్రసరిస్తుందనీ అతడు సిద్ధాంతీకరించాడు. ఈ సిద్ధాంతాన్నే మాంటేజ్ సిద్ధాంతం అంటారు. ఒక చిన్న ఉదాహరణ కావాలంటే - ఒక ధనికుడి భోగలాలసతను ప్రేక్షకునికి ఎరుక పరచాలంటే భోగలాలసతను చూపేషాట్ పక్కనే ఒక కటిక దరిద్రుని దుస్థితిని చూపే షాట్ చేరుస్తాము. ఈ రెండుషాట్లలోని భావాలకు గల వైరుధ్యంవల్ల ధనికుని లాలసతలోని అక్రమం వెల్లడి అవుతుంది.

1925 నుండి 1948 వరకూ ఐజెన్‌స్టీన్ అయిదు చిత్రాలు మాత్రమే తయారు చేశాడు. 'అయితేనేం, ఒకొక్కటీ ఒక ఆటంబాంబు.' ఈ చిత్రాలు కళ సర్కస్‌లాగ వినోదానికి పనికొచ్చే ఆటవస్తువు లాంటిది కాదనీ, మానవుడి ఆధ్యాత్మిక పురోగమనానికి ఉపకరించే సాధనమనీ చాటి చెబుతాయి. ఈ అయిదుచిత్రాల్లోను "నెవ్‌స్కీ", "ఇవాన్" చిత్రాల్లో మాత్రమే నికోలాయ్ చెర్కాసోవ్ మొదలైన ప్రసిద్ధ నటులు నటించారు. మొదటి మూడు చిత్రాల్లోను ఐజెన్‌స్టీన్ సామాన్య యథార్థవ్యక్తులనే పాత్రలుగా ఉపయోగించుకున్నాడు. ఈ పద్ధతి హాలీవుడ్ వారు, తదితరులు సాగించిన, సాగిస్తున్న స్టార్ సిస్టమ్‌కు ఎంతదూరంగా వున్నదో ఊహించుకోవచ్చును.

ఐజెన్‌స్టీన్ స్వయంగా తయారుచేసిన చిత్రాలు ఆరే అయినప్పటికీ చాలా రష్యన్ చిత్రాలకు అతడు పర్యవేక్షణ చేశాడు. యువదర్శకు లెందరో తాము తయారుచేసే చిత్రాలలో అతని సలహాకోసం అర్థించేవారు. ఇదిగాక ఐజెన్‌స్టీన్ కనీసం ఒక పాతిక చిత్రాలకైనా పథకాలు తయారుచేసి అట్టేపెట్టాడు. ఇవన్నీ చిత్రీకరించే అవకాశం అతనికి చిక్కకపోవటం నిజంగా దురదృష్టమే. ఇలా తయారుచేసిన పథకాల్లో "మాస్కో" ఒకటి. 15 వ శతాబ్దం నుంచీ మాస్కోనగర చరిత్రను, గతించిన సామ్రాజ్యాలను, దండయాత్రలను, రష్యన్ సంస్కృతిని, విప్లవాలను అందులో చిత్రించాలని అతడి ఆశయం. ఇది కొనసాగలేదు. కాని అతని మేధా ధైర్యానికి, ఆత్మవిశ్వాసానికి చక్కని నిదర్శనం ఇంకొకటివున్నది. కారల్ మార్క్స్ రాసిన "పెట్టుబడి" (కాపిటల్) గ్రంథాన్నే చిత్రీకరించాలని అతడు పథకం వేశాడు. ఈ ఆర్థికశాస్త్ర గ్రంథంతో ఏమాత్రం పరిచయం గలవారికైనా ఇదెంత దుర్ఘటకార్యమో బోధపడుతుంది. కాని ఐజెన్‌స్టీన్ ఫిలిం సిద్ధాంతాల నెరిగినవారికిది ఆశ్చర్యం కలిగించదు. "ప్రతికళా భావవ్యక్తీకరణకు ఒక విలక్షణమైన టెక్నిక్‌ను ఆలంబనంగా చేసుకుంటుంది. సినిమాకళకు 'అంతరంగ చిత్రణ', (*Inner monologue*) ద్వారా ఎంతైనా శక్తిని కలిగించవచ్చును. సారస్వతంలో జేమ్స్ జోయిన్స్ ఇదే పని చేయబోయాడు. వ్యక్తుల అంతరంగాలలో జరిగే యావద్విషయాలను కేవలం మాటల్లో చిత్రించ ప్రయత్నించాడు. కాని ఈ పని మాటలకు లొంగేది కాదు. అంతరంగ చిత్రణ సినిమాకళకొక్కదానికే లొంగే పని. సినిమా చెయ్యవలసిన పనే అది." - ఇదీ ఐజెన్‌స్టీన్ సిద్ధాంతం. ఈసిద్ధాంతాన్ననుసరించే "అమెరికన్ ట్రాజెడీ" లోని కొన్ని దుర్ఘట సన్నివేశాలకు సినేరియో రాశాడు.

ఐజెన్‌స్టీన్ పద్ధతిని హాలీవుడ్‌లోను, బ్రిటన్‌లోను అనుసరించి గొప్పదర్శకులైనవారు లేకపోలేదు.

*All quite on the western front* చిత్రం తీసిన లెవిస్ మైల్‌స్టన్‌వంటి దర్శకులెందరో ఐజెన్‌స్టీన్ మాదిరిగా వాస్తవిక చిత్రాలు నిర్మించారు. 1930 ప్రాంతాల్లో బ్రిటన్‌లో బయలుదేరిన డాక్యుమెంటరీ ఉద్యమానికి ఐజెన్‌స్టీన్ ప్రభావమే కారణం. రెండో ప్రపంచయుద్ధం తరవాత ఇటలీనుంచి వస్తున్న రోసిలినీ, డీసికా మొదలైనవారి చిత్రాలకు ఐజెన్‌స్టీనే మార్గదర్శకుడు. రష్యాలోకూడా అలెగ్జాండ్రోవ్, చియారెలీ మొదలైన దర్శకులు అతన్ని అనుసరించే ఉత్తమచిత్రాలు తయారు చేస్తున్నారు.

మనదేశపు సినిమాకళ ఇంతవరకూ అంతర్జాతీయ ఖ్యాతి పొందకపోవటానికి కారణం మనవారు హాలీవుడ్ అనుకరణ జాడ్యగ్రస్తులు కావటమే. అది వదిలించుకొని మనం స్వతంత్రించి కొత్తదారులు తొక్కాలి. లక్షలకి లక్షలు ఖర్చుపెట్టి తీసిన చిత్రాలన్నీ వరసన టపాకాయల్లాగ పేలిపోయి నిర్మాతలకు అపారనష్టం తెచ్చి పెడుతున్నాయి. ఇదివరకులాగ ఎవరుపడితే వారు చిత్ర నిర్మాణానికి సాహసించటంలేదు. వెనకా ముందు ఆలోచించుకుని మరీ దిగుతున్నారు. కొత్త నిర్మాతలు రంగంలోకి దిగటం చాలా తగ్గిపోయింది. ఈ క్లిష్టస్థితిలో మన నిర్మాతలు, దర్శకులు ఐజెన్‌స్టీన్‌లాటి వారిని ఆదర్శాలుగా పెట్టుకొని సినిమాకళ పట్ల భక్తిభావం పెంపొందించుకుని ఔన్నత్యం సాధిస్తారని ఆశించుదాం.

**(విషయసేకరణ, రచన : ఎన్నార్)**



జయంతీ వారి "బంగారుభూమి" లో ముత్తులక్ష్మి, సారంగపాణి, శ్రీనివాసన్.

క్లోజప్‌లో ఇంద్ర ధనుస్సు

# సినిమా ఎల్లా తీస్తారు?

(జెకొస్లొవాకియన్ రచయిత కారల్ చాపెక్ రచనకు అనుసరణ :
నండూరి రామమోహనరావు)

సినిమాలు ఎల్లా తీస్తారో రాయబోయే ముందు ముఖ్యంగా ఒక హెచ్చరిక చెయ్యాల్సివుంది :

ఏ ప్రత్యేక చిత్రాన్నీ, ఏ ప్రత్యేక నిర్మాతనీ, దర్శకుణ్ణీ, స్క్రిప్టు రచయితనీ, ఆ మాటకొస్తే ఏ ప్రత్యేకవ్యక్తినీ ఉద్దేశించి ఈ ముక్కలు రాయటంలేదని పాఠకులు గమనించగోరుతున్నాను. అన్ని వృత్తుల్లోనూ నిజమైన మనుషులు కొందరు ఉంటారు. ఆఖరికి సినిమా వృత్తిలో కూడా నిజమైన మనుషులు ఉండక తప్పదు. అయితే వీళ్ళు కొంచెం తక్కువ హోదాకు చెందినవాళ్ళు. అంటే క్లాప్ బోయ్, లైట్ బోయ్, అసిస్టెంటు డైరెక్టరు మొదలైనవాళ్లు. వీళ్లని గురించి తప్పితే మరి ఏ ఇతర యథార్థవ్యక్తులను గురించీ నేను రాయబోవటంలేదు. రాయకపోవటానికి కారణం వున్నది: నిర్మాత, దర్శకుడు వగైరా పెద్దహోదా మనుషులున్నారే, వారిది ఎంతవరకూ నిజరూపమో, ఎంతవరకూ కామరూపమో ఒక పట్టాన చెప్పటం కష్టం. రకరకాల ట్రిక్కులు, స్టంటులు జరిగే సినిమా ప్రపంచంలో వీరి స్వస్వరూపం తేలిగ్గా బయటపడదు. అదీగాక ఒక సినిమాకీ మరొక సినిమాకీ సవాలక్ష తేడావుంటుంది. నాలుగులక్షల రూపాయలతో ఒక సాధారణచిత్రం నిర్మించటానికీ, నలభై లక్షల రూపాయలతో ఒక అసాధారణ చిత్రం నిర్మించటానికీ — నక్కకీ నాగలోకానికీ ఉన్నంత తేడా వుంటుంది. ఎటొచ్చీ టెక్నికల్ సిబ్బంది మాత్రం దానికీ దీనికీ ఒకటే.

అయితే, అసిస్టెంటు డైరెక్టరు "సైలెన్స్ ప్లీజ్! సైలెన్స్!" అని నెత్తుమీద పోలికేక పెట్టటానికి ఇంకా వ్యవధి ఉందిగనక, ఈలోగా సినిమాల తాలూకు ఓనమాలు తెలుసుకుందాం.

అనుభవజ్ఞులైనవాళ్లు, అంటే సినిమా ప్రపంచపు జాగ్రఫీ, హిస్టరీ, ఎకనామిక్సు తలకిందులుగా అప్పచెప్పగలవాళ్ళు — సినిమాలు "లక్ష్మీదేవి" చరణకమలాలలోంచి ఉద్భవించాయని అంటారు. సినిమాకు అవసరమైన కథ కొనుక్కోవాలంటే డబ్బు కావాలి. డైరెక్టరు, తారలు, ఫోటోగ్రాఫరు, తదితర వగైరాలతో ఎగ్రిమెంట్లు రాసుకోవాలంటే డబ్బు కావాలి. ఓ స్టూడియోలో ఫ్లోర్ అద్దెకు పుచ్చుకోవాలంటే డబ్బు కావాలి. అన్నిటికీ డబ్బు, డబ్బు, డబ్బు! పైకం, పైకం, పైకం! ఈ పైకం పెట్టుబడి పెట్టగల పెద్దమనిషిని గాలంవేసి పట్టుకుని బుట్టలో పెట్టాలి. అయితే ఆ పెద్దమనిషి మన గాలానికి చిక్కాలంటే, దానికొక మంచి ఎర తగిలించాలి

# ★ సినిమా ఎల్లా తీస్తారు? ★

ఏమిటా ఎర? కథ! ("ఈ కథ చూశారా? ఇది సినిమా తీశామంటే ఈ సినిమా హాల్సు సరిపోతాయిటండీ? ఇంతకి రెట్టింపు హాల్సు కట్టించినా పట్టనంతమంది జనం వస్తారు. మీకెందుకు? మీరు పెట్టుబడి పెట్టండి. కనీసం రెట్టింపులాభం చూపించే పూచీ నాది...") అవును కథే! మీకు ఆశ్చర్యం వేసినా సరే, కథ లేందే ఏమీ లేదు. సినిమా వంటి అద్భుతమైన, అధునాతనమైన, టెక్నికల్ గా మహోభివృద్ధి పొందిన పరిశ్రమకి కూడా ఏ పేద రచయిత బుర్రలోంచో వచ్చిన వట్టి కథే మూలాధారం. ఏం చేస్తాం మరి? కథల్ని కూడా తయారుచేసి పారేసే యంత్రాలింకా రాలేదు!

## రెండు తప్పనిసరిముక్కలు

చిత్రనిర్మాణంలోకి దిగబోయేముందు ఈ నిర్మాణంతో కొద్దో గొప్పో సంబంధం కలిగిన మనుషులతో ఒక్క రవ్వ పరిచయం ఏర్పరచుకుందాము. ఆ మనుషులు ఎవరెవరయ్యా అంటే:—

(1) సినిమా కంపెనీకి పైన ఉండే మనుషులు:—తయారైన సినిమాలో తమ ఇష్టం వచ్చినచోట కత్తిరించటానికి అధికారంగల సెన్సార్లు; సెన్సార్ల ఆమోదం పొంది విడుదల చేయబడిన చిత్రాన్ని పూర్తిగా నిషేధించటానికి కూడా అధికారంగల కేంద్ర ప్రభుత్వ మంత్రులు మొదలైనవారు. వీరి దండయాత్రల పద్మవ్యూహంలోంచి నిర్మాతలు బయటపడటం కొంచెం కష్టమైన పనే.

(2) కంపెనీకి వెనకాలమనుషులు:— వీరే మన పెట్టుబడిదారులు; ప్రొడక్షన్ కంపెనీ మేనేజింగ్ డైరెక్టరు, డిస్ట్రిబ్యూటింగ్ కంపెనీ మేనేజింగ్ డైరెక్టరు, ఎగ్జిబిటింగ్ కంపెనీల మేనేజింగ్ డైరెక్టర్లు, మరికొందరు డైరెక్టర్లు, వీరుకాక కేవలం డైరెక్టర్లు, డిప్యూటీ డైరెక్టర్లు - మొత్తంమీద ఫిలిం మాగ్నెట్లు అనబడే యావన్మందినీ.

(3) కంపెనీచుట్టూ మనుషులు:—వీరికి సినిమా పరిశ్రమతో ప్రత్యక్ష సంబంధం ఉండదు. కాని సినిమాలోకాన్ని గూర్చి వీరికి తెలియనిది లేదనే పేరు ఉంటుంది. ఈ పేరునే పెట్టుబడిగా పెట్టి జీవనం సాగిస్తూ వుంటారు. వీళ్లు సాధారణంగా ప్రొడ్యూసర్ల సమక్షంలోనూ, డైరెక్టర్ల సన్నిధానంలోనూ కనిపిస్తారు. వీళ్ళకి పత్రికలతోనూ, తారలతోనూ, రచయితలతోనూ ముఖాముఖిపరిచయం వుంటుంది. ఏ కథతీస్తే బావుంటుందో, ఏది అద్భుత విజయం సాధిస్తుందో ఢంకా బజాయించి చెప్పేస్తారు. చెప్పటమే కాదు, ఒక్కోసారి సినేరియోలు రాసి చూపిస్తారు కూడాను. అయితే ఈ బండచాకిరీ అంతా కేవలం సినిమా కళమీద ఉండుకున్నటువంటి భక్తిశ్రద్ధలవల్లనే చేస్తారు. సినిమాకళ బాగుపడాలన్న యావ తప్ప వాళ్ళకింకొక యావే ఉండదు. ఈసంగతి వాళ్ళే చాటుకుంటారు.

(4) కంపెనీ లోపలిమనుషులు:— అంటే సినిమా తయారుచేసే అసలు మనుషులు; డైరెక్టర్లు, సినేరియో రచయితలు, నటీనటుల దగ్గర్నించి క్లాప్ బోయ్ వరకూ గల యావన్మందీ ఈ రకానికి చెందినవాళ్ళే. వీళ్ళని తరవాత నెమ్మదిగా క్లోజప్ తీసి పరిశీలిద్దాం.

(5) ఇకపోతే, కంపెనీకి వెలుపలి మనుషులు:— సాధారణంగా కథ రాసిన అసలు గ్రంథకర్త ఈ రకంలో చేరుతాడు. (పాపం!)

## కథకోసం వేట

సినిమా కథకీ మిగతా కథలకీ ఒక ముఖ్యమైన తేడా వుంది. మామూలు కథలమల్లే కాక, సినిమా కథ ఎప్పుడూ అర్జంటుగా కావల్సివస్తూ వుంటుంది.

"ఏమండీ గ్రంథకర్తగారూ! మీ కెప్పుడన్నా మంచి సినిమాకథ తట్టితే అది మాకు రాసి పెడతారా?" అని ఏ నిర్మాతా అడగడు. అడిగితే అది సినిమాకథ కాదన్నమాట. సినిమా కథని అర్జంటుగా వేటాడి పట్టుకోవాలి. రేపటికల్లా ఒక కథ తయారవ్వాలి. రేపటిదాకా టైము లేదు. ఇప్పుడే, ఈ క్షణంలోనే ఒకటి తయారవ్వాలి. తయారయినా అవటంతోటే, ఇంకా పచ్చి పచ్చిగా ఉండగానే పట్టుకుని సంచీలో వేసి బిగించాలి. అంతేకాని, సినిమాకథ అని పేరు పెట్టుకున్న ఓకథ తనంతట తను జంకుతూ జంకుతూ స్టూడియోలోకి ప్రవేశించి "ఏమండీ, నేను వచ్చానండీ, తలుపు తియ్యండీ" అని పిలిస్తే "ఏయ్, నీ కిక్కడేం పనీ? ఫోఫో. అవతలికి పో! వెధవమొహం నువ్వూను—" అని వెళ్ళగొట్టేస్తారు. ఎంచేతనంటే, సినిమాకథ బహు అపురూపమైన వస్తువు. ఎక్కడపడితే అక్కడ దొరకదు. చీమలు దూరని చిట్టడవుల్లో, కాకులు దూరని కారడవుల్లో, పొదలచాటున పొంచి పొంచి సినిమాకథ కనిపించగానే చటుక్కున పట్టెయ్యాలి, సారస్వతసముద్రాన్ని మధించాలి. నాటకరంగపు తెరలచాటున, ఒక్కొకసారి వార్తాపత్రికల పేజీలమాటున దానికోసం అన్వేషించాలి. దొరకగానే బోనులో పడెయ్యాలి.

అసలు ఏకథ అయినా సినిమా కథ కావటానికి కొన్ని అర్హతలూ, షరతులూ, పైషరతులూ ఉన్నాయి:

(1) సినిమా కథ ఈ మధ్య బాగా అమ్ముడుపోయిన నవలోరాజమో, నాటకరాజమో అయివుండాలి. ఎంత బాగా అమ్ముడైవుంటే అంత మంచి సినిమాకథ.

(2) అందులో ఏదో కొత్తదనం, ఇదివరకు ఏసినిమాలోనూ కనీవినీ ఎరగని కొత్తదనం, ఉండి తీరాలి.

(3) అయితే ఈమధ్య బాక్సాఫీసును బద్దలు గొట్టిన ఫలానా ఫలానా సినిమావుందే—కొంచెం దానిమాదిరిగా ఉంటే బావుంటుంది.

(4) మన ప్రసిద్ధనటుడు అజయనాథ్ కీ, ప్రసిద్ధతార గాయత్రికీ అందులో హీరో హీరోయిన్ వేషా లుండాలి.

(5) గాయత్రి ఇటీవల నటించి కీర్తి పొందిన ఫలానా చిత్రంలో ఏ పాత్ర ధరించిందో, అలాంటి పాత్రే మన కథలో కూడా ఉండాలి. అజయనాథ్ కి సాధ్యమైనంత తక్కువమాట లుండాలి. ఎందుకంటే ఆయన బాగా మాట్లాడలేడు. అయితే కథ మన ఇష్టంవచ్చినట్టు మార్చుకో వచ్చు గనక ఇదో పెద్ద చిక్కు కాదు.

(6) మన సినేరియో రచయితచేత మార్పించటానికీ, తీసేయించటానికీ వీలైన సన్నివేశా లుండాలి.

(7) మంచిమంచి సెట్టింగులకు వీలైనదిగా ఉండాలి. బ్రహ్మాండమైన కోట, స్వర్గలోకంలాంటి పడకగది, ఒక ముత్యాల మహల్, ఒక నాట్యశాల, వగైరా వగైరా—మామూలుగా వేటికోసం జనం విరగబడి వసారో, అవన్నీ ఉండాలి.

(8) సినిమాకు మాంఛి అందమైన పేరు పెట్టేందుకు వీలుగా ఉండాలి. "పేరులోనే వుంది పెన్నిధి!"

(9) ఆ కథలో "చూశారూ? అదేదో ఉండాలి." (అదేమిటో సినిమా నిపుణులకే తెలియాలి.)

(10) ఆ కథ బాగా ఇదిగా వుండాలి. (ఇది ఏమిటో నిపుణులక్కూడా తెలియదు.)

(11) కొంత ఉన్నతంగా, ఉదాత్తంగా, ఉత్తమంగా, ఒక్క ముక్కలో చెప్పాలంటే, ఆర్టిస్టిక్ గా వుండాలి. అయితే "మన ప్రేక్షకులున్నారే? వారినికూడా దృష్టిలో పెట్టుకోవాలి. ఏమంటారు?"

(12) కథలో సినిమాటిక్ లక్షణా

(50-వ పేజీ చూడండి)

# ప్రశ్నలు..సమాధానాలు

శ్రీ మాచర్ల—మహబూబ్ నగర్.

గుణసుందరి కథకు "మాటలు, "పాటలు-" వ్రాసినదెవరు ?

—శ్రీ పింగళి నాగేంద్రరావుగారు.

*　　　*　　　*

శ్రీకనుపర్తి విఠల్‌రావు—ఢిల్లీ.

అశోక్‌కుమార్ - నళిని జయవంత్, దిలీప్‌కుమార్ - కామిని కౌశల్, నశీర్ ఖాన్ - నూతన్ వంటి జంటలు తెలుగులో ఎవరైనా వున్నారా! వుంటే తెలుపండి.

—మన అదృష్టంకొద్దీ ఇంతవరకూ లేరు.

*　　　*　　　*

శ్రీ ఎ. వి. గోపాలకృష్ణమూర్తి—విజయవాడ.

ప్రస్తుతము దేశములో ఉన్న నిరుద్యోగ సమస్య ఆంధ్రరాష్ట్రము రాగానే చాలా వరకు పరిష్కారమగునని చాలామంది పెద్దల అభిప్రాయము. అలా జరుగుతుందంటారా?

—ప్రస్తుతం నిరుద్యోగులుగా ఉన్న కొందరు రాజకీయనాయకులకు పదవులు లభిస్తాయిగనుక వారి నిరుద్యోగ సమస్య వెంటనే తీరిపోతుంది.

*　　　*　　　*

శ్రీ నాగుబండి నర్సింహం — మిర్యాలగూడెం.

సినిమాకథ నటులనుబట్టి వ్రాసెదరా లేక కథనుబట్టి నటులను తీసుకొనెదరా ?

—రెండు విధాలుగానూ జరుగుతుంది. కథకంటే తారలే ముఖ్యమైతే తారలకు సరిపడిన కథే ఎన్నుకుంటారు. తారలకంటే కథే ముఖ్యమైతే కథనుబట్టి తారలను ఎన్నుకుంటారు.

*　　　*　　　*

శ్రీ ఎస్. ఎమ్. బాషా—బద్వేలు.

ప్రపంచంలో గొప్ప నాస్తికు డెవరు? నాస్తిక మతమునకు సంబంధించిన గ్రంథమేది ?

—నాస్తికుడు అంటే ఏమీ లేదనేవాడు. దేవుడు లేడనేవాడు కూడా మరొక ఏదో వుందని ఒప్పుకుంటాడు. అందుచేత నాస్తికుడు అంటూ ఉండటానికే వీల్లేదు. దేవుడు లేడని వాదించిన అనేకమంది గ్రీకు వేదాంతులు, యూరపియన్ తత్త్వవేత్తలు కూడా సృష్టికి కారణం పంచభూతాలనో, పరమాణువులనో, లేక ఒకభావం (*Idealism*) అనో, అన్నారు. అంటే వీరు మొత్తానికి ఏదో ఒకటి ఉందని ఒప్పుకున్నారన్న మాట. కనుక వీరంతా ఆస్తికులే.

*　　　*　　　*

శ్రీ గోలి కేశవరావు—వడ్లమూరు.

చదువుకున్నవాడు సామాన్య స్త్రీనైనా వివాహము చేసుకుంటాడు; కాని విద్యావంతురాలైన స్త్రీ చదువులేనివానిని పెండ్లి ఆడదే ?

—"ఆడది ఆడదే" అని 'చెంచులక్ష్మి' సినిమాలో ఒక పాట వుంది. తనకంటే శారీరకంగా, మానసికంగా అధికుడైనవాణ్ణే స్త్రీ ప్రేమిస్తుంది. పురుషుడు శారీరకంగా మానసికంగా తనకంటె తక్కువ అయిన స్త్రీనే ప్రేమిస్తాడు. అది స్త్రీలక్షణం. ఇది పురుషలక్షణం.



జూపిటర్ వారి "ఇన్స్పెక్టర్" తెలుగు చిత్రంలో టి. కె. భగవతి, పి. కె. సరస్వతి.



చంద్రకళా పిక్చర్సువారి "శుక-రంభ" హిందీ చిత్రంలో అంజలీదేవి, భారత్ భూషణ్.

# సినిమా ఎల్లాతీస్తారు?

(48-వ పేజీ తరువాయి)

ఉండాలి. ఇంకా ఉండవలసిన లక్షణా లేమైనా ఉంటే—కంపెనీ 'పనవాల' మనుష్యుల్లో కొస్త పెద్దగొంతిక గలవాడు లేచి "దీన్ని అద్భుతమైన సినిమాగా తీయవచ్చు," అని ప్రకటించగానే వాటంతట అవే వచ్చినట్టువస్తాయి.

ఈ జాబితాలో మరికొన్ని షరతులు చేర్చవచ్చు: ప్రతి కథనూ సినిమా తియ్యటానికి వీల్లేదు. నిజమైన సినిమా కథను వీరు అప్పటికప్పుడు కూర్చుని తయారు చెయ్యలేరు. దానంతట అది, యోగనిద్రలో ఉన్న భగవంతుడి సృష్టిసంకల్పం లాగ బయటపడవలసిందే. (సశేషం)

# సినిమా వార్తలు

## శుక - రంభ

చంద్రకళా పిక్చర్స్‌వారు (బొంబాయి) తీసిన హిందీ పౌరాణిక చిత్రం 'శుక - రంభ' యీ 14 న మద్రాసు అశోక్ టాకీస్‌లో పత్రికలవారికి, ప్రత్యేకం చూపించారు. ఈ చిత్రం 15 నుంచి మద్రాసులోనూ, ఆంధ్రదేశంలోని కొన్ని ముఖ్యకేంద్రాలలోను విడుదల అయింది.

కైలాస శిఖరంపై శివసాన్నిధ్యంలో బ్రతికే చిలుక ఒకటి, పార్వతీదేవి శాపం మూలంగా వేదవ్యాసమహాముని పుత్రుడుగా మనుష్యజన్మ ఎత్తుతుంది. మమకారాలకి, మాత్సర్యాలకి ఆలవాలమైన యీ మానవలోకంలో ప్రవేశించటానికి మనస్సొప్పక ఆ బాలుడు, తల్లిగర్భంలోనే 12 ఏండ్లపాటు వుండిపోతాడు. శ్రీ మహావిష్ణువు ఆదేశాన్ని అనుసరించి చివరికొకనాడు 12 ఏండ్ల బాలుడుగానే భూమిమీదికి వచ్చి, వెంటనే తపస్సు చేసుకోవటానికి యిల్లువిడిచి వెళ్ళుతాడు. ఈతని తపోనిష్ఠకు భంగం కల్గించటంకోసం దేవలోకంనుంచి దిగివచ్చిన రంభ, అతని సాన్నిధ్యంలో కొంతకాలంవుండి, అతనిని తన వైపుకి త్రిప్పలేక, తానే ఆయన

పాదపద్మాలకి అంకితం అవుతుంది. బ్రహ్మపదార్థాన్వేషణలో శుకమహాముని మహోన్నత పథాలను అందుకొంటాడు.

రంభగా నటించిన తెలుగునటి అంజలీదేవియే యీ చిత్రంలో అందరికంటే బాగా నటించినదనటంలో అతిశయోక్తి లేదు. శుకుడుగా భారత్ భూషణ్ నటన అంత ప్రశస్తంగా లేదు. శుకుని తల్లిగా నిరూపారాయ్ చాలా చక్కగా నటించింది.

అడవిసీనుల్లో చెట్లచాటున పెట్టిన లైట్లు ఫ్రేములో కన్పించిపోతున్నాయ్. ఇలాటి లోపాలు కొన్ని సవరించుకొని వుంటే బాబూభాయ్ వుదేష్ ఫోటోగ్రఫీ బాగా రాణించివుండేది. ధీరూభాయ్ దేశాయ్ దర్శకత్వంలో చెప్పుకోదగ్గ విశేషం ఏమీ కన్పించలేదు. మ్యూజిక్ డైరెక్టర్ మన్నాడే కూర్చిన కొన్ని పాటల వరసలు విన సొంపుగా వున్నాయి. అక్కడక్కడా బ్రహ్మాండమైన సెట్టింగులు కనిపించాయి.

## "ఏక్-దో-తీన్"

షోరీ ఫిలిమ్సువారి "ఏక్ దో తీన్" గత శుక్రవారంనాడు మద్రాస్ స్టార్ టాకీసులో విడుదల అయింది. మీనా, మోతీలాల్, మజ్నూ, యశోధర కట్జూ మున్నగువారు నటించారు. నిర్మాత, దర్శకుడు రూప్ కె. షోరీ. సంగీతం వినోద్. కథ కిషన్ చందర్. ఇది పూర్తిగా హాస్యభరితమైన చిత్రం. మోతీలాల్ అనే యువకునికి తండ్రి చనిపోతూ మూడు ఉపదేశాలు చేస్తాడు. ఏక్: మద్యం తాగవద్దు; దో: వేశ్యలవద్దకు పోవద్దు; తీన్: ఏ స్త్రీకీ రహస్యం చెప్పవద్దు. మోతీలాల్ మొదటి రెండు ఉపదేశాలలోని సత్యాన్ని అట్టే శ్రమలేకుండానే అనుభవపూర్వకంగా గ్రహిస్తాడు. మూడవదానిలోని సత్యం గ్రహించటానికి ఒక నాటకం ఆడతాడు. స్నేహితుడైన హీరాలాల్‌ను హత్యచేసినట్లు నటించి ఈ సంగతి తను పెళ్లిచేసుకోబోయే రోమాకు తెలియజేస్తాడు. రోమా ఈ రహస్యం పట్టలేక తన స్నేహితురాలు ఆశాదేవికి చెబుతుంది. ఆమెకూడా దాన్ని దాచలేక భర్తతో చెబుతుంది. ఆ భర్త పోలీసు ఇనస్పెక్టరు. అతడు వచ్చి హత్య చేశాడనే నేరానికి మోతీలాల్‌ను అరెస్టు చేస్తాడు. మోతీలాల్‌కు ఉరిశిక్ష పడుతుంది. ఉరికంబం ఎక్కి మోతీ మరణించటానికి సిద్ధంగా ఉన్న క్షణంలో, అంతవరకూ ఎక్కడో దూరంగావున్న హీరాలాల్‌ను రోమా తీసుకువచ్చి మోతీని రక్షిస్తుంది. మోతీ అప్పుడు తండ్రి చెప్పటం మరిచిపోయిన నాలుగవ సత్యం నేర్చుకుంటాడు: న్యాయచట్టంతో చెలగాటం ఆడరాదని.

ఈ చిత్రం ఇంటర్వెల్ వరకూ వినోదపూరితంగా ఉన్నది. కాని అసలు కథ అప్పటికే అయిపోయినందున, ఇంటర్వెల్ నుంచి చివరవరకూ కథకు ఒక దారీతెన్నూ లేకుండా పొడుగు పెరిగి విసుగుపుట్టిస్తుంది. రెండో భాగంలో రోమా బయలుదేరి, హీరాలాల్‌ను వెతికి పట్టుకురావటం తప్ప మరో సంఘటనే లేదు. దీనికోసం సగం చిత్రం ఖర్చు అయింది. హీరాలాల్‌ను వెదకటానికి రోమా బస్సులో, ట్రాక్టరులో, రైల్వే ట్రాలీలో, పడవలో ప్రయాణం చేస్తుంది. తిరిగి వచ్చేటప్పుడు ఒక రైలు కూడా దొంగిలిస్తుంది. ఇన్ని అభూతకల్పనలు ప్రవేశపెట్టినా దర్శకుడు ప్రేక్షకులను నవ్వించలేకపోయాడు. చిత్రం మొదటి భాగంలో కావలసినంత సెక్సు అప్పీలు ఉన్నది. కొన్ని బాక్సాఫీసు చిట్కాలు కూడా వున్నాయి. టెలిఫోనులో ప్రేయసీప్రియులు డ్యూయెట్ పాడటం, మీనా ఇద్దరు రౌడీలను చిత్తుచేసి తను అబలకానని నిరూపించుకోవటం, మోతీలాల్ ఆమెను మొయ్యటానికి నానా అవస్థ పడటం, ఆమె మోతీలాల్‌ను అవలీలగా ఎత్తి పడెయ్యటం వగైరా. ఇదంతా ఫిలిం ఎంటర్‌టెయిన్‌మెంట్ కింద చెలామణీ అయిపోతున్నా, ఇంత అసందర్భంగా ఎంటర్‌టెయిన్ అయ్యే ప్రేక్షకులు ఎంతమంది ఉంటారనేది ప్రశ్న.

* * *

శ్రీరామకృష్ణ ఫిలిమ్స్ (రాజమండ్రి) అనే పేరుతో స్థాపించబడిన కొత్త సంస్థ చిత్ర నిర్మాణానికి పూనుకున్నది. కథ, సంభాషణలు, దర్శకత్వం శ్రీ వాద్రేవు కొమరరాజు. సంగీతం శ్రీ గాలి పెంచల నరసింహారావు. కెమేరా కోట్నీసు. నటీనటులు జమున, సి. ఎస్. ఆర్., జూనియర్ లక్ష్మీరాజ్యం, వంగర, అడ్డాల, సీత, నల్లరామమూర్తి, జి. ఎస్. స్వామి, గుమ్మడి వెంకటేశ్వరరావు. ఈ చిత్రానికి పేరు ఇంకా పెట్టలేదు.



జూపిటర్ వారి "ఇన్స్పెక్టరు" లో పి. కె. సరస్వతి.



(34-వ పేజీ తరువాయి)

ముట్టుకోలేదు కానీ, మిగిలిన గది అంతా గాలించేశాం.

"కొంప తీసి ఏదయ్యమైనా ఇట్లా చేసిందేమో" అని పైకి అనేశాను. మిగతా ఇద్దరూ కూడా నాతో ఏకీభవించారు. వెంటనే నేను ప్రక్క వీధిలో నున్న మంత్రాల మరిడయ్యగారిని తీసుక వచ్చాను. పేరును బట్టే తెలుస్తుందిగా! ఆయన భూత వైద్యుడని. ఆయన్ని తీసుకొని వచ్చే సరికి ఇరుగు పొరుగు వాళ్ళందరూ అక్కడమూగేరు. అందరిచూపులూ భూతవైద్యుడి మీదనే వున్నాయి. మరిడయ్య వస్తూనే గదినంతా ఒక సారి పరిశీలించాడు. తలగడ దగ్గరున్న జుత్తును చూశాడు. "ఓం, హ్రీం, హ్రూం," అంటూ శాస్త్ర విభూతిని జుత్తుపై జల్లాడు. "ఇదిగో! ఈసీసాలో భూతాన్ని బంధించేస్తా" అంటూ శాస్త్ర జుత్తు తీశాడు.

ఆశ్చర్యం!! చూస్తున్న అందరి కళ్లూ జిగేల్ మన్నాయి. భూత వైద్యుడు వెల వెల బోయాడు. అందరూ కడుపు చెక్కలయ్యేటట్టు నవ్వుతున్నారు. ఈ రభసంతా ఎందు కనుకున్నారు! ఆజుత్తులోంచి చరచరా బయటికి వచ్చి గబగబా కటకటాల్లో నుంచి రోడ్డుమీదకు పోతున్న పీతను చూచి, నా చెవిగూబ గట్టిగా కరచినవారూ, అర్జునరావు జుత్తు కత్తిరించిన వారూ, ఆ పీతగారే నని అప్పటికి బోధపడింది మాకు. మమ్మల్ని పట్టింది దయ్యం కానందుకు మా యిరుగుపొరుగుల వారందరూ లోలోపల ఎంతో సంతోషించారు.



(42-పేజీ తరువాయి)

కుర్చీలు లాక్కొని, ఏదో నోటికి హితవైనంతమటుకు, కడుపు పట్టినంతమటుకు ఎక్కించటం మొదలుపెట్టారు.

మొదట ఒక అరగంటసేపు తిండి బాగానే లోపలికి పోయింది కానీ, ఆతరువాత మాత్రం నాకేమిటో ఒక్కటీ తిన బుద్ధిపుట్టలేదు. ఎంత తిన్నా యింకా తినాలనుకోవటమే ఎరుగుదును కానీ, యిల్లా భోజనం చేస్తూ చేస్తూ వుండగా అన్నహితవు తప్పిపోవటం నేనింతమటుకు ఎరుగను. అందులోనూ— నాకు అంత యిష్టమైన జున్ను చూస్తేనే నా కా క్షణంలో డోకు వచ్చినంత పనైంది. దీన్నిబట్టి అప్పటికప్పుడే నా వొంట్లో సుస్తీ బాగా పెరిగిపోతున్నదని అర్థమైంది.

ఎలాగో తిప్పలుపడి అందరమూ తిండి తిని, గ్లాసుల్లో సారా పోసుకు తాగాం. చిలుము గొట్టాలు పైకి తీసి వెలిగించాం.

ఇంతకీ—మమ్మల్ని పట్టుకు వేధిస్తున్న ఆ జబ్బులేమిటో మాలో ఎవ్వరికీ అంతుపట్టటంలేదు. మాకు ఫలాని ఫలాని జబ్బులు వచ్చాయన్న విషయం మాత్రం తేల్చి చెప్పలేకపోయాం కానీ, యీ అనారోగ్యం ఎందుకు రావలసివచ్చిందో అనే విషయంలో మాత్రం మాలో మాకు ఏద్విధమైన అభిప్రాయభేదమూ లేదు. ఇటీవల, మాకు వున్న ఓపికలకి మించి పని ఎక్కువగా చేస్తున్నందువల్లనే, యిలాంటి పరిస్థితి వచ్చిపడిందని నిశ్చయించుకొన్నాము.

అందుకే "మనం కొంతకాలంపాటు విశ్రాంతి తీసుకోవటం చాలా అవసరం" అని హారిస్ అన్నాడు.

"కేవలం ఉన్నచోటనే వుండిపోయి విశ్రాంతి తీసుకొంటే చాలదు. వాతావరణంలో మార్పుకూడా చాలా అవసరం" అని జార్జి అన్నాడు.

మా జార్జికి వేలు విడిచిన మేనమామ ఒకాయన వున్నాడు. ఆయన మహావైద్యుడు. అందుచేత వైద్య పరిజ్ఞానం అనేది మనవాడి రక్తనాళాల్లో జీర్ణించి వున్నది. కనుకనే వాడికి అంత అద్భుతమైన ఆలోచన తట్టింది.

నేను జార్జితో పూర్తిగా ఏకీభవించాను. పిచ్చెత్తించే యీ పట్టణపు హోరులోనుంచి తప్పించుకొని, ఎక్కడికో దూరంగా, అతి ప్రశాంతంగావుండేచోటికి పోయి, ఒక్క వారంరోజులపాటు గడిపి వద్దామని అన్నాను. నేను చెప్పిన ఆలోచన చాలా బాగుందని హారిస్సు నన్ను సమర్థించాడు. ఈ పట్నవాసపు కుళ్లులోనుంచి తప్పించుకు పోవాలంటే, సముద్రయానం కంటే సర్వోత్కృష్టమైన సాధనం లేదని కూడా వాడే అనేశాడు.

సముద్రంమీద ప్రయాణానికి మాత్రం నేను ఛస్తే ఒప్పుకోనన్నాను.

(ఇంకావుంది)



# శిథిల మందిరం



(14-వ పేజీ తరువాయి)

దగ్గరికి పరుగెత్తుకు వెళ్ళి—

"వెంకట్రావుగారూ! వెరీ గుడ్ న్యూస్!" అన్నాడు.

"అవును; నెహ్రూ చాలా బాగా చెప్పాడు. అబ్బ! ఎన్నాళ్ళకి ఆంధ్ర రాష్ట్రం! పొట్టిశ్రీరాములుగారు పుణ్యం కట్టుకుంటేనేగాని మూల విరాట్టులు కదిలారేకాదు-" అని చంకలోని ఆంధ్రపత్రిక తీసి భాస్కరానికియబోతూ ఇంకా ఏమో చెప్పబోతూంటే-

"ఉండవయ్యా! రాష్ట్రమూ, నువ్వూనూ, ఇప్పుడు మనిషికి నెల 1 కి 25 రూ. మిగిలాయి! ఇలా జరుగుతుందని మన జన్మలో అనుకోలేదు." అన్నాడు భాస్కరం.

"నెలకు పాతికరూపాయలే! అజేలా గండోయ్!"

"మన ఇంటికి కొత్త యజమా నిచ్చాడు. ధర్మాత్ముడిలాగున్నాడు, పాపం! మూడు భాగాలకీ మూడువందలే తీసుకుంటానని కబురుచేశాడు."

"నిజమా?"

"నిజమా, అని మెల్లగా అంటారేమిటి? కిందటినెల అద్దె మేము రెండువందలూ ఈ వేళే పంపించాం. తిరిగి వంద రూపాయలు మాకు పంపించేస్తూ ఈకబురు గుమస్తా రామయ్యద్వారా పంపాడు. ఇవిగో అతను పంపించిన రూపాయలు!" అని భాస్కరం, వెంకట్రావుకి, వందరూపాయల నోట్లు చూపించాడు.

"బాగావుంది. మనమందరం రేపటి ఆదివారం ఆయన ఇంటికి వెళ్ళి థాంక్సు చెప్పాలి."

"ఓ! అభ్యంతరం లేకుండా." అని భాస్కరం మనసారా అన్నాడు. వెంకట్రావు మేడమీదికి వెళ్ళిపోయాడు.

* * *

మేడకొత్త యజమాని అద్దె చెరిసగానికి తగ్గించిన సంగతి, ఆవేళ రాత్రే అద్దెకు ఉన్నవారందరికీ తెలిసింది. రాత్రి పది గంటలవరకూ అద్దెయిస్తూన్నవారందరూ ఒకే చోటికిచేరి, తమ కొత్త యజమాని కబుర్లే మాటాడుకున్నారు. ఉన్నట్టుండి, మొదటి అంతస్థులో అద్దెకు ఉన్నవారిలో ఒకడయిన, సుబ్బారావు, "ఇదేదో చిత్రంగా ఉంది. ఒక్కసారి చెరిసగం అద్దె తగ్గించాడంటే, ఏదో కారణముండి తీరాలి! మీరేమన్నా సరే; కాని, నాకు అనుమానంగానే ఉంది" అన్నాడు.

"చాల్లేవయ్యా! నీ అనుమానాలు ఎప్పుడూ ఉండనే ఉంటాయి. పుణ్యాత్ముడు పిలిచి భోజనం పెడితే, ఎంగిలి కూడేమో అనుకున్నాడట, నీలాంటివాడే" అని వెంకట్రావు, కసిరి కొట్టినట్టుఅన్నాడు.

"ఉండండి, ఉండండి, కాస్త ఆలోచించండి. కొత్త యజమాని అద్దె తగ్గించాడంటే ఏదో కారణం ఉండకపోదు; అందులోనూ, మనం అడక్కుండానే తగ్గించినాడు కాబట్టి తప్పకుండా ఆలోచించవలసిన విషయమే!" అన్నాడు పై అంతస్థులో ఉన్న ధర్మారావు.

"అలాగయితే, ఆ ధర్మసందేహమేమిటో చెప్పకూడదూ!" అని కొంచెం, కటువుగా భాస్కరం అనేసరికి - "నాకూ అనుమానంగానే ఉంది. మేమున్న రెండో అంతస్థులో స్నానాలగది, రెండు మూడు చోట్ల బీటలు పడింది. అది ఎప్పటికైనా మేడకు ప్రమాదమే! ఇది ముందుగానే తెలుసుకొని, మన కొత్త యజమాని, మనం పారిపోతామేమో అని భయపడి అద్దె తగ్గించి ఉంటాడే కాని, పట్టనే మనమీద, దయ తలచి కాదు"అని సూర్యారావు అన్నాడు. తన వాదానికి బలం కలిగిందికదా అనుకొని ధర్మారావు ధీమాగా కూర్చున్నాడు.

"స్నానాల గదిలో బీటలు పడినంత మాత్రాన మేడకూలిపోతుం దనుకోడం వెర్రితనం"అని భాస్కరం సమాధానమిచ్చాడు.

"ఆ బీటలు, వెల్లబీటలు. వెల్ల చిక్కగా కలిపి గోడలకు వేస్తే, గోడలకు బీటలు పడినట్టు కనబడుతుంది. అంతే గాని, దీనికే ఏదో తర్జన భర్జనపడి మనసు పాడుచేసుకోవడం పిచ్చితనమే అవుతుంది" అని వెంకట్రావు అన్నాడు.

"ప్రమాద మేదైనా వచ్చిన తర్వాత, మన తర్కాలెందుకు పనిచేస్తాయి? కాబట్టి తొందరగా మేలుకుంటేనే మంచిది. అంటిపెట్టుకొని ఉండడానికి ఇది గాని మన సొంత యిల్లా? యజమాని ఎప్పుడు పొమ్మన్నా పోవలసినవారమే!" అని పై అంతస్థులోఉన్న మోహనరావు అన్నాడు.

"మోహనరావు మాటలు తీసిపారవేయడానికి వీలులేదు. డబ్బు పారేస్తే బోలెడన్ని కొంపలు!" అన్నాడు వీరాస్వామి.

"మీ రేమనుకున్నా సరే, నేనుమాత్రం ఎల్లుండి నా భాగం ఖాళీచేస్తున్నాను. ప్రాణాలుంటే బలుసాకు తిని బ్రతకొచ్చు" అన్నాడు సుబ్బారావు.

"నేనుకూడా ఆవాడే వెళ్ళిపోతాను. మా బావమర్దిఉన్న ఇంట్లో భాగం ఖాళీగా ఉందట కూడాను." అన్నాడు ధర్మారావు.

"నేనేనా ఉండిపోయేవాణ్ణి? రేపు సాయంత్రానికి నేనూ ఏదో చూచుకుంటాను." అన్నాడు సూర్యారావు.

"మీ రందరూ బ్రతికేవాళ్ళైను, నేను చచ్చేవాణ్ణినా? అనుమానంతో ఇంట్లో ఉండడ మెందుకు? నేనూ వెళ్ళిపోతాను." అని వెంకట్రావు అన్నాడు. భాస్కరం కూడా వారి దారిలోనే పడ్డాడు. రెండు రోజుల్లో ఇల్లు ఖాళీ అయింది. అందరూ ఒక్కసారి ఇల్లు విడిచిపెట్టగానే ఆ వీధంతా అందరూ అన్ని విధాలగా చెప్పుకున్నారు. ఇల్లు ఖాళీఅయి సంవత్సరం దాటినా, ఒక్కళ్ళయినా అద్దెకు దిగిన పాపాన పోలేదు. నెలలు గడిచేకొద్దీ ఆ యింటిమీద కథలుకూడ పెరుగుతూనే ఉన్నాయి. ఏ లోపమూ లేకపోయినా, దానికి 'శిథిలమందిరం' అని పేరు వచ్చింది. దాన్ని యేమిచేయాలో మన కామేశ్వరావు మనస్సుకికూడ తేటపడలేదు.



రవి సోప్
మీ ముఖ వర్చస్సును కాపాడి విలాసమును పెంపొందించును.
సోల్ ఏజంట్లు:
ది న్యూ స్టార్ & కో
తండియార్పేట : మద్రాసు-21

రత్నపురుషవేషం
మవర్ణము, క్ష్వాష్టయుములు కలిపి తయారుచేయబడినది. శుక్లనష్టము, గుండెదడ, నరముల బలహీనము అతిమూత్రము మొ॥ మేహ వ్యాధులను హరించును. బలమును, కాంతిని, ధాతుపుష్టిని, యిచ్చును అనేక యోగ్యతా పత్రాలు కలవు. డబ్బా రు. 3-12-0 వి. పి. రు. 1-0-0.
ఇండియన్ మెడిసన్ హౌస్,
లక్ష్మీటాకీసు రోడ్డు - విజయవాడ-2.

కుష్ఠు ★ బొల్లి
వగైరా మేహమచ్చలు, సెగ, సవాయి వ్యాధులకు, గ్యారంటీ చికిత్స, క్యాటలాగు ఉచితం. జి వి. రెడ్డి అండ్ కో., (రిజిష్టర్డు) "భాస్కరాశ్రమము" గోపాలపురం, తూ. గోదావరి.

# ★ దత్తత ★

(25-వ పేజీ తరువాయి)

కడుతున్న లక్ష్మికేసి చూస్తూ నిలబడిపోయాడు.

"ఎల్లుండి నాన్నగారి తద్దినం."

"అయితే?" వెనక్కి తిరిగి చూశాడు.

"ఒక బ్రాహ్మణ్ని పిలవాలి"

"ఎందుకమ్మా ఆ మూఢ నమ్మకాలు" తీవ్రంగా చూస్తూ అడిగాడు. ఈలాంటి మాట రవినోటనించి రావడం యిదే మొదటి సారి. శాంతమ్మ స్తబ్ధంగా నిలబడిపోయింది. పనిచేస్తూ లక్ష్మి ఒకసారి రవికేసి చూసింది.

"మూఢ నమ్మకాలా?" కొన్నిపటికి తిరిగి అదేమాట అడిగింది శాంతమ్మ.

"అవును పరలోకంలో ఆయన ఆత్మ శాంతిస్తుందని ఇక్కడ బ్రాహ్మణులబొజ్జలు నింపాలి...పరలోకం...ఆత్మ" అంటూ చొక్కాను దండెంమీదనుంచి తీసి, తొడుక్కుంటూ అన్నాడు.

"బావ దృష్టిలో దేవుడు కూడా లేడు-" అంటూ లక్ష్మి కుట్టిన చొక్కా తీసుకు లేచింది.

"ఉంటే నువ్వు చూపించగలవా?"

వెళ్ళే లక్ష్మిని చూస్తూ ప్రశ్నించాడు. లక్ష్మి వెనక్కి తిరిగి చూసింది గాని సమాధాన మివ్వలేదు. ఈ ప్రశ్న వేయడం ఎంత సులభమో సమాధానం అందజేయడం అంత కష్టమని లక్ష్మికి కూడా తెలుసు.

శాంతమ్మ గట్టిగా నిట్టూర్చింది. ఆ నిట్టూర్పులో రవి మార్పును గమనించిన ధ్వని ఉంది. బల్లమీద కూర్చుంది.

"రవీ!"

గుమ్మంలోనుంచి వెళ్ళబోతున్న రవిని పిలిచింది శాంతమ్మ. రవి ఆశ్చర్యంగా చూసి తల్లిదగ్గరగా వచ్చాడు.

"నేను చచ్చిన తర్వాత కూడా నువ్వు ఇదే పని చేస్తావుకదూ?" కంఠం గద్గదంగా ధ్వనించింది.

ఇంత సులభంగా అన్న మాట తల్లికి ఏలాంటి బాధ కలిగించిందో కొంత అర్థం చేసుకున్నాడు. కాని, తల్లితండ్రులు మగ బిడ్డకు విశేష ప్రాధాన్యత యివ్వడంలో ఉండే మహత్తర సత్యాన్ని గాని, బ్రతికి నంతకాలం బిడ్డల పోషణకు బాధపడి, దూషణ తిరస్కారాలకు సహిస్తూ, చచ్చిన తర్వాత కొంత పిండోదకాలు విడుస్తాడనే నమ్మకంతో సంతృప్తితో జీవిస్తారనే ఊహ గాని, అతనికి కలుగలేదు.

నవ్వాడు. తల్లిదగ్గరగా కూర్చున్నాడు.

"ఎందుకమ్మా అంత బాధపడతావ్" అని అడిగాడు.

ఆమె కళ్ళు తుడుచుకుంది "భగవంతుడంటే నీకు నమ్మకంలేదా?"అని అడిగింది.

"ఇదివరకు ఉండేది. యిప్పుడు లేదు"

"కారణం?"

"నిజాన్ని తెలుసుకున్నాను కాబట్టి"

శాంతమ్మ కోపంగా బల్లమీదనించి లేచింది. లోపలకు వెళ్ళబోతోంది "అమ్మా" అని పిలచాడు రవి.

"నీలాంటి నాస్తికుడు నాకొడుకై పుట్టినందుకు, భగవంతుడు నాకేదైనా శాస్తి యిస్తే అనుభవిస్తాలే, వెళ్లు!" అని లోపలకు వెళ్ళిపోయింది.

రవి చాలా ఆశ్చర్యపడ్డాడు. భగవంతుని పట్ల తల్లికున్న ప్రగాఢ నమ్మకానికి, కొంత కష్టం కూడా అనిపించింది. ఆధ్యాత్మికంగా, ఆస్తిక భావాలతో, హిందూ దేశం ఎంతో పతనమైందని ఈమధ్యనే గ్రహించిన రవి, ఈలాంటి మూఢ నమ్మకాలు తుడిచిపెట్టే బాధ్యత తనలాటి వాళ్ళమీదనే ఉందని కూడా తెలుసుకున్నాడు.

మంచంమీద కూర్చొన్న తల్లి దగ్గరకు రవి వచ్చాడు. శాంతమ్మ ఒకసారి చూసింది కాని మాట్లాడలేదు.

"నీకు తెలీదమ్మా! భగవంతుడి పేరు చెప్పి దేశాన్నీ ప్రజల్నీ ఎంతో మోసం చేశారమ్మా" అన్నాడు.

శాంతమ్మ రవికేసి చూసింది. 'ఎవరు మోసం చేశారు' ఇదే ప్రశ్న ఆమె చూపులో ఉంది. కాని రవి అర్థం చేసుకోలేదు.

"కర్మ అనీ ధర్మమనీ, పేదవాళ్ళ కడుపు కొట్టి..."

"ఆగు—" శాంతమ్మ కష్టంగా అరచింది.

రవి ఇక మాట్లాడలేదు. "నేను మీ నాన్నగారి తద్దినం గురించి మాట్లాడాను గాని, ఈ ఉపన్యాసాలు నా కొక్కవాలని కాదు...సరే! నన్నిప్పు డేమీ మాట్లాడించకు వెళ్ళు."

రవి మంచంమీదనుంచి లేచాడు. తన ప్రాథమిక విజ్ఞానప్రచారం ఆమెపై ఏవిధంగానూ, ప్రసరించలేకపోయినందుకు కష్టంగానే వుంది.

"మూర్ఖుల్లో మార్పు రావడం కష్టం" మెల్లగా విసుగ్గా గొణుక్కున్నాడు.

శాంతమ్మ రవికేసి కోపంగా చూసింది. పదాల అర్థాన్ని కూడా మరచి మాట్లాడే దుస్థితివరకూ పోయాడే! అని ఆమె కోపం; కాని, వెంటనే శాంతించి "నేనూ అదే అనుకుంటున్నాను" అంది.

ఆ పదంయొక్క భావం తనకే వర్తించే విధానంలో అనిన తల్లిమాటలకు రవి ఉరిమి చూస్తూ "దేవు డెక్కడున్నాడు? న్యాయమెక్కడుంది?...కష్టపడేవాళ్ళకు కూడు లేదు......మోసగాళ్ళదే రాజ్యమైపోయి ఊరుకుంది......" అతని కళ్ళల్లో ఆవేశం శాంతమ్మ చూసింది. మాటల్లో ఆవేదన కూడా ఉంది. అయితే రవిని నీచుడుగా మాత్రం ఆమె ఎప్పుడూ అపార్థం చేసుకోదు. నిష్కల్మషమైన అతని హృదయంలో పేదవాళ్ళ నీడలు! దుర్మార్గుల మోసాలు! ద్వంద్వయుద్ధం చేయ ప్రారంభించాయి. ఏది సత్యం? ఇదే అతని మనోన్వేషణ.

"మనుష్యుల పోకడకు దేవుడు బాధ్యుడు కాడు బాబూ!" అంటూ శాంతమ్మ మెల్లగా లేచి "దేవుణ్ని నిజంగా చూసినా నువ్వు నమ్మే స్థితిలో లేవు" అంది.

రవికి ఆశ్చర్యం కలిగింది. కోపంగా కూడా ఉన్నాడు. "నమ్మడం కాదు. నాకు కనిపిస్తే జుట్టుపట్టుకొని, నీపాలనలో న్యాయానికి శిక్ష ధర్మానికి దగా ఎందుకు జరుగుతుంది? మంచివాళ్లు కష్టజీవులు కూడు లేక మాడటం......మోసగాళ్లు సోమరిపోతులు తెగతిని గలిచేయడం ఎందువల్ల?..."

శాంతమ్మ నవ్వు ఆపుకోలేకపోయింది. ధర్మయ్య కూడా వచ్చి నిలబడి రవి ఆవేశాన్ని చూస్తూ ఉండిపోయాడు.

"ఎందుకమ్మా నవ్వు?" తల్లిని చూస్తూ అడిగాడు. మళ్ళీ ధర్మయ్యను చూశాడు. ధర్మయ్యముందు ఎప్పుడూ అతను ఎక్కువగా మాట్లాడడు. తిన్నగా చావిట్లోకి వెళ్లిపోయాడు. లక్ష్మి గుమ్మందగ్గర నిలబడి ఉంది.

"బావా" అని పిలవడంవల్ల ఆగిపోయాడు.

"బెల్లమేలా ఉంటుంది?"

"తియ్యగా వుంటుంది."

"తీపి అంటే..."

"అంటే?"

"దాని ఆకారం..."

"నా కర్థం కావడంలేదు?"

అగమ్యంగా చూస్తున్నాడు. లక్ష్మి నవ్వుతూ అంది "దేవుడు కూడా నీ కర్థం కాడులే వెళ్లిరా!"

లోపలకు వెళ్లిపోయింది. ఈ ప్రశ్నలో వ్యంగ్యం ఏమిటో అర్థం చేసుకోడానికి కొన్నిపు అలాగే నిలబడిపోయాడు. ముందు వేసిన ప్రశ్నకు ఇదే సమాధానంగా లక్ష్మి

సూచించిందని అతను ఊహించుకోలేకపోయాడు. బైటకు వెళ్లిపోయాడు.

గదిలోంచి ఈ మాటలు వింటూ ధర్మయ్యా శాంతమ్మ అలాగే నిలబడిపోయారు. రవి బైటకు వెళ్లిపోయినట్లుగా గుర్తించిన శాంతమ్మ ఒక్కని శ్వాసం విడచిపెట్టింది. ధర్మయ్య ఆమెకేసి చూశాడు.

"రవిలో ఈలాంటి మార్పు వస్తుందని నే ననుకోలేదు." శాంతమ్మ భయంగా చూస్తూ మెల్లగా అంది.

ధర్మయ్య ఆమెకేసి చూశాడు. ఏమీ సమాధానం చెప్పలేదు.

"అన్నయ్యా! రవి పాడైపోతాడేమో?" కొంత ఆత్రంగా అడిగింది.

"ఎందువల్ల?" ధర్మయ్య ప్రశ్నించాడు.

"దేవుడిమీద వాడికే మాత్రం విశ్వాసం లేదు" అని మెల్లగా అంది.

ధర్మయ్య నవ్వాడు. ఆ నవ్వు ధ్వనించలేదు కాని సహజమైన నవ్వుగానే శాంతమ్మ గుర్తించింది.

"ఎవరో వెనకనుండి మనల్ని నడిపిస్తున్నారని కళ్లు మూసుకొనిపోతే; పాపమనే గోతిని గాని, పుణ్యమనే ఎత్తు గాని మనం పరిశీలించలేం, కాకుండా ఎప్పుడో ఒకప్పుడు పెద్ద అఘాతంలో కూడా పడిపోతాం. కాని భగవంతుడిచ్చిన ఇంద్రియ ధర్మాన్ని గుర్తించి కళ్లు తెరుచుక గమనిస్తే; గోతులూ గొప్పలూ స్పష్టంగా చూస్తూ - తోచిన మంచిదారినే నడుస్తాం" అని శాంతమ్మకేసి చూశాడు. ఈ ఉదాహరణలో ఏలాంటి భావం యిమిడుందో ఆమె ఆలోచిస్తున్నది. ధర్మయ్య వెళ్ళబోతూ ఆగి "నేను భగవంతుణ్ణి నమ్మాను...... కాని ఆయనకు ఆకార వికారాలు నేనేమీ అంటగట్టలేదు... అయితే నా యిన్నేళ్ల జీవితానుభవం చెప్పింది మాత్రం ఒకటే గుడ్డితనంతో కూడిన ఆస్తికత్వానికన్నా—విమర్శనతో కూడిన నాస్తికతయే చాలా మంచిదని..." మళ్లీ కాస్సేపు ఆగి తర్వాత ఆనందంగా నిట్టూర్చి "తాను లేడని వాదించినా - సత్యంకోసం - ధర్మంకోసం వ్యధపడే బిడ్డలను......భగవంతుడు హృదయపూర్వకంగా క్షమిస్తాడు...క్షమించడమే కాదు. అజేయమైన శక్తిని కూడా యిస్తాడు...కాని తాను వున్నాడని విశ్వసించి పూజలూ, పునస్కారాలు చేస్తూ తప్పును భగవంతుని పేర ఖర్చు వ్రాసి, ఒప్పును తన గొప్పగా జమ కట్టుకొనే బిడ్డల చేష్టలను ఎంతోకాలం సహించడు" ఈ మాట లని ధర్మయ్య వెళ్లిపోయాడు.

శాంతమ్మహృదయం కొంత తేలికపడింది. ఎదురుగా కృష్ణుని పటం కనిపిస్తే, చేతులెత్తి "ఓ భగవాన్! అజ్ఞానంలో కళ్లు మూసిన బిడ్డను విజ్ఞానంతో విర్రవీగే బిడ్డను కూడా సమానంగా క్షమించు బాబూ" అంది.

కనుచీకటిపడే సమయంలో వారం రోజుల తర్వాత ఈనాడే ధర్మయ్యగారి వీధిగుమ్మం ఎక్కాడు రాము. సంజదీపం వెలిగించి చావిట్లోకి తెచ్చిన లక్ష్మి గుమ్మంలో ఎవరో నిలబడినట్లుగా గుర్తించింది. దీపం బల్లదగ్గరున్న గూటిలో పెట్టి అలాగే చూస్తోంది.

"లక్ష్మి" రాము పిలచాడు.

సమాధానం యివ్వకుండా లక్ష్మి లోపలకు వెళ్ళిపోయింది. అలా జరగడం గురించి రాము ఆశ్చర్యపడలేదు. ఎక్కువ రోజులు లక్ష్మికి రాము కనిపించకపోతే; ఈలాగే జరుగుతుంద"ని అతనికి తెలుసు. గదిలోకి వెళ్లాడు.

"మాష్టారు ఏరీ?" గదంతా పరికించిన మీదట ఈ ప్రశ్న వేశాడు రాము.

"దేవాలయానికి వెళ్లారు" అని క్లుప్తంగా సమాధానం చెప్పింది. వారం రోజులనుంచి దేవాలయంలో పురాణ కాలక్షేపం జరుగుతూంది. వయస్సుమీరిన పెద్దలంతా, రాత్రి 9 గంటలవరకూ పురాణం వింటూ అక్కడే ఉంటున్నారు. అదే ఆలోచిస్తున్నాడు రాము.

"ఇన్ని రోజులుగా..." మాట పూర్తికాలేదు. ఆ ధ్వని క్షోభతో నిండివుంది. రాము ఆశ్చర్యంగా అటు చూశాడు.

"నీకు తెలీదూ?"

ఏమిటన్నట్లు చూసింది లక్ష్మి.

"పరీక్షలుగా - సరే! మీ అత్తేది?"

"వంట చేస్తోంది."

రాము ప్రక్కనున్న కుర్చీమీద కూర్చున్నాడు. లక్ష్మి ఆలాగే నిలబడిఉంది. వాళ్లి ద్దరి మనస్సులో ఏదో నిస్తబ్ధత ఏర్పడింది. మాట్లాడే విషయాలు చాలా ఉన్నాయని ముందు యిద్దరూ అనుకున్నా - ఇప్పుడు మాట్లాడే సంగతులే లేనట్లుగా ముభావంగా ఉన్నారు.

చిన్ననాటి చెలిమి, ఆట పాటలు ఇద్దరి మనస్సులో చిత్రరూపాలై చిరుగంతులు వేస్తున్నాయి.

ఆ నిశ్శబ్దాన్ని చీలుస్తూ లక్ష్మినుండి బరువైన ఒక నిట్టూర్పు వచ్చింది. రాము ఆమెకేసి ఆలాగే చూస్తున్నాడు.

"అత్తను పిలవనా?"

"అక్కర్లేదు."

వయోప్రాయంలో ఉన్న యువతీయువకులు జంటగా ఒకే గదిలో ఉంటే ఏలాంటి అపాయం వాటిల్లుతుందో రాముకి అంతుపట్టినట్లులేదు. లక్ష్మి మెల్లగా కదిలి చావిట్లోకి వచ్చింది.

"వెళ్ళిపోతున్నావేం?"

"పనేముంది" అని లక్ష్మి ఉదాసీనంగా సమాధానమిచ్చింది.

రాము ఆలోచనపరుడేగాని, అస్వతంత్రుడు. ఆ సంగతి తనకేకాదు లక్ష్మికి కూడా తెలుసనుకుంటాడు రాము. కాని లక్ష్మి అలా ఎప్పుడూ ఊహించలేదు.

ఈరోజు ఆదివారం కావడంవల్ల రవి పెందలాడే యింటికి వచ్చాడు. గుమ్మం ఎక్కడంతో ఎదురుగా లక్ష్మి కనిపించింది.

"రవీ"

ఈ మాటవిని గదివేపు చూశాడు. రాము కనిపించాడు. సంతోషంగా దగ్గరకు వస్తాడని రాము ఊహించాడు. కాని అలా జరగలేదు. కనీసం తిరిగి పలకరించలేదు రవి. లోపలకు వెళ్ళిపోయాడు.

రాము ఆశ్చర్యంగా చూస్తూ లేచాడు. చావిట్లోకి వచ్చాడు.

"లక్ష్మి! రవి మాట్లాడలేదేం."

"వినిపించలేదేమో."

"చెవుడు కాదుగా."

"నాకు తెలీదు." లక్ష్మి మెల్లగా అక్కడనించి వెళ్ళిపోయింది. రాము అలాగే నిలబడి ఆలోచిస్తున్నాడు.

రవిలో ఈ మార్పునకు కారణం అతని ఆలోచనకు తట్టలేదు. ధనికులపట్ల పేరుకుంటూ వచ్చిన రవిలోని కక్ష...పూర్తిగా గడ్డకట్టనూలేదు...నీటిరూపంలో పల్చగానూ లేదు...మధ్యస్థంగా మలినంతో కలిసి నిలిచిపోయి ఉంది.

బాల్యస్నేహితుడైన రాము అన్న అని రవికి తెలియకపోయినా, ధనికుని బిడ్డ అయినంతమాత్రాన్న అతను చేసిన నేరం ఏమిటో నిర్దుష్టంగా రవి చూపించలేదు.

"అత్త పిలుస్తూంది" తిరిగివచ్చిన లక్ష్మి ఈ మాట అనడంతోనే ఆలోచన్నుండి తేరుకొని రాము బరువుగా పాదాలు వేసుకుంటూ గదిలోకి వెళ్ళాడు.

"ఏం బాబూ ఎంతసేపయింది వచ్చి" పెరటి గుమ్మంలో నిలబడి ఆనందస్వరంతో అడిగింది శాంతమ్మ.

"పది నిమిషాలవుతుంద" అని ముక్తసరిగా చెప్పి డ్రాయరుకేసి చూశాడు. రవి అప్పుడే తీసుకవచ్చి బల్లమీదపెట్టిన భౌతికవాదం, జీవపరిణామం పుస్తకాలు కనిపించాయి.

"ఈపుస్తకాలు ఎవరివి?" అని అడిగాడు.

"రవి యిప్పుడే తెచ్చాడు" అని లక్ష్మి సమాధానం చెప్పింది. రాము ఒక పుస్తకం తిప్పి చూస్తున్నాడు.

"నువ్వు చదవ దగ్గవి కావు"



## దత్తత



స్నానానికి తుండు కట్టుకొని వచ్చిన రవి, రాముకేసి చూస్తూ అన్నాడు.

రాము ఆశ్చర్యంగా చూశాడు "రాసే వాళ్ల ఉద్దేశం అది కాదేమో" అన్నాడు.

"చూశాను కాబట్టి నా ఉద్దేశం అది" అని తిరిగి సమాధానం అందుకోకుండానే దొడ్డివైపునకు వెళ్ళిపోయాడు.

"రవిలో చాలా మార్పు వచ్చింది" పుస్తకం బల్లమీద విడిచి, మ్లానంగా నవ్వి "వెళతానన్నావ్?" అని శాంతమ్మ కేసి చూశాడు.

శాంతమ్మ మెల్లగా "వాడి తరహా మెచ్చుకున్నంచే అంతేగా, బాబూ! నువ్వేం అనుకోబోకు" అంది.

"మర్యాదనీ, స్నేహాన్నీ మరచిపోయే తరహా మంచిది కాదని రవికి తెలీదులే..." అంటూ ఒక్కసారి శాంతమ్మ కేసి తీవ్రంగా చూస్తూ "అయినా నేను రవికి చేసిన లోపం?" అని ప్రశ్నార్థకంగా చూస్తూ నిలబడిపోయాడు.

శాంతమ్మ సమాధానమివ్వలేదు. క్రోధం [illegible] అతని హృదయంలో నిండి, అవమాన భారంతో మండిపోతున్నట్లుగా శాంతమ్మ గుర్తించింది.

సమాధానం రాకపోవడంవల్ల "కాస్సేపటి వరకూ చూసి వెళతాను" అంటూ చావిట్లోకి తిరిగి వచ్చాడు.

లక్ష్మి వెనకాలనే వస్తుందని రాము గుర్తించాడు.

"నేను అంత ఎక్కువగా రాకపోవడం మంచిదేమో" అని తనలో గొణుక్కున్నాడు.

"రామూ" కాస్త బిగ్గరగా లక్ష్మి అంది. రాము వెనక్కు తిరిగి చూశాడు. లక్ష్మి కళ్ళల్లో నీళ్లు ఉన్నాయి.

"నిన్ను బాధపెట్టడం నా ఉద్దేశం కాదు. కపు వీలుంటే వస్తా" అని అన్నాడు

లక్ష్మి ఎందుకలా అరచిందో యిప్పుడు ఆలోచిస్తోంది. కళ్లు తుడుచుకుంది. కాని సమాధానమివ్వలేదు.

రాము మెట్లు దిగేసరికి ధర్మయ్య ఎదురుగా వచ్చాడు.

"వెళ్ళిపోతున్నావేం బాబూ?" అని సరళంగా అడిగాడు.

"వెళ్ళాలి" ఇంతకుమించి సమాధానమివ్వలేదు.

ధర్మయ్య గుమ్మం ఎక్కి అలాగే రాముకేసి చూస్తూ ఉండిపోయాడు. కాస్సేపాగి లోపలకు చూశాడు. లక్ష్మి చావిట్లో ఉంది. ఆ వెనకాల రవి షర్టు తొడుక్కుంటూ నిలచి వల్లే రాముకేసి చూస్తున్నాడు.

(ఇంకావుంది)



## సిటీ బెగ్గర్



(21-వ పేజీ తరువాయి)

యివ్వండి.' అని ప్రాధేయపూర్వకంగానే అడిగాడు ఆ పెద్దమనిషి.

'నీవు చెప్పిన భారతమంతా చివరకి ఇందుకేనా బాబయ్యా?' అన్నట్లు చూచాను నేను.

నా చూపులోని భావం అతడు గ్రహించాడు.

'పోనీ, ఒక అర్ధరూపాయి యివ్వండి.' అక్కడికి మమ్మల్నేదో క్షమించి వదలినట్లు. నేను ఏమీ మాట్లాడలేదు. సిగరెట్టు పొగ వదలుతూ, పత్రికవైపు చూస్తున్నాను.

'పావలా అయినా యివ్వలేరా?'

'. ............'

'చివరికి రెండణాలు కూడా లేవా?'

'. ..... .....'

'నేను యింకా యిక్కడ మూడుగోజులుంటాను. సరిగా లెక్క వేసికోండి. ఈవేళ డిసెంబరు 3 వ తారీఖు, 6 వ తేదీ రాత్రి సరిగా యిదే మెయిలులో బయలుదేరి బెంగుళూరు వస్తాను.'

పెద్ద గవర్నర్ ప్రోగ్రామ్ మాదరి వేసుకొన్నాడు - వీడు, వీడి ప్రోగ్రామ్.

'ఇప్పుడీ మెయిలులోనే వచ్చేయకూడదా?' అడిగాను నేను.

'వీలుపడదు. డిశంబరు 6 వ తేదీని వస్తాను. దయచేసి 'టీ'కి ఒక అణా డబ్బులివ్వండి త్వరగా. బండికి సిగ్నల్ యిచ్చేశారు.'

'డిశంబరు 6 వ తేదీవరకు మీరిక్కడ ఏంచేస్తారు?' అడిగాడు గోపాలం.

'........'

'బెంగుళూరులోనుండి మీకు మేము చేయగల సాయమేమైనా ఉందా?' నేను అడిగాను.

'త్వరగా ఒక అణా యివ్వండి, చెబుతాను.'

'సారీ, ప్లీజ్.' అని గౌరవంగా సామం చేశా నతనికి నేను.

'జెంటిల్ మాన్' గోపాలంవైపు చూశాడు. మావాడు కూడ మొండిచెయ్యి చూపెట్టాడు.

ఇంతలో గార్డ్ విజిల్ వినపడింది. ట్రెయిను బయలుదేరే టైమయిపోయింది.

జెంటిల్‌మాన్ ముఖం కందగడ్డ మాదిరి తయారయింది. ఒకసారి ముక్కుకోణా లెగరేసి, గేటువైపు గబగబ నడుస్తూ అన్నాడు.

'ఒక అణా యివ్వమంటే యివ్వలేరు, కాని నీవు యిక్కడ ఏమిచేస్తావు? ఇక్కడ ఎందుకున్నావ్? నీ కెంతమంది పిల్లలు? నీ పెళ్లాం ఏంచేస్తోంది?-ఇవన్నీ అడగడంమాత్రం తెలుసును. మానర్ లెస్ యిడియట్స్.'

'గుడ్ బై, సార్, 7 వ తేదీ ఉదయం బెంగుళూరు కాంటన్ మెంట్ స్టేషనులో మీరాకకై నిరీక్షిస్తుంటాము.' అన్నాను.

'యూ, కంట్రీ బ్రూట్స్!' అని అరుస్తున్నాడు ఆయన ఫుట్‌బోర్డుమీద నిలబడి.

రైల్వే యింజను కూత కూసింది.

'యూ, డర్టీ సిటీ బెగ్గర్, ట్రెయిను కదులుతోంది. ఫుట్‌బోర్డుమీద నుంచి క్రిందికి దిగి, తిట్టు. లేకపోతే నిష్కారణంగా చచ్చి కూర్చుంటావు' అంటూ గోపాలం తలుపుమూసి వచ్చి, కూర్చున్నాడు.

బెంగుళూరు మెయిల్ సెంట్రల్ స్టేషన్ నుంచి బయలుదేరింది.




నారసింహ లేహ్యము




బంగారు చేర్చబడినది. మేహము, నిశ్శక్తి, నిస్సత్తువ, శుక్ల నష్టమును హరించి బలమును, కాంతిని, వీర్యవృద్ధిని కలిగించు వరప్రసాదము—

20 తు॥ డబ్బి రు. 3-4-0 పోస్టేజి 12 అ.

పి. సి. ఏ. & కంపెని. "ఆయుర్వేదసమాజం"

పెరిదేపి- నెల్లూరు జిల్లా.



డాన్ క్విక్ సెట్

వెల రూ. 2-0-0

ఆంధ్ర గ్రంథమాల,

మద్రాసు- 1


Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St, Madras

నిలిచి ఆకులు మేయుటమే మేలు!

ఫొటో—శ్రీ వి తంబి (కర్నూలు)



త్వరలో గ్రంథరూపంలో రానున్న నవల!

# విచిత్రవ్యక్తి

మూలం:-

మార్క్ ట్వేన్





అనువాదం:

నండూరి రామమోహనరావు



ప్రతి గొప్ప రచయితా నాటకం రాసినా, నవల రాసినా, కావ్యం రాసినా తన రచనలో తన్ను ప్రతిబింబింపజేసుకుంటాడు. ప్రపంచం మీద తన అభిప్రాయ మేమిటో ప్రత్యక్షంగానో, పాత్రలద్వారానో చెప్పి తీరుతాడు. మార్క్-ట్వేన్ రాసిన నవలల్లో మార్క్-ట్వేన్ పూర్తిగా కనిపిస్తాడు. అతని గొప్పనవలల్లో ఒకటైన "*Mysterious Stranger*" లో సైతాను భావలో మార్క్-ట్వేన్ మాట్లాడుతూ మానవజాతిమీద, చరిత్రమీద తనకు గల అక్కసునంతా తీర్చుకుంటాడు. ఇప్పటి ప్రపంచ పరిస్థితిలో— మన గత చరిత్రలో గర్వపడాల్సిన కారణాల కంటే సిగ్గు పడాల్సిన కారణాలే ఎక్కువగా ఉన్నాయనే సంగతి జ్ఞాపకంచేసుకోవడం కోసం ఈనవల చదివితీరాలి.

ఆంధ్రగ్రంథమాల

మదరాసు-1